# RECOGNITION.

1. Approved by The Director of Public Instruction "Suitable for school reading" Vide Fort St. Gec 17-7-19 P. P. 5.
2. Prescribed as Text book by The University of Ma for Intermediate Exn. 1922 (Group).
3. Prescribed as text book for Sahitya Exns. Viza garam.
4. Prescribed as text book "For Govt. Training sc Higher grade 1922."

Spoken of as the best novel in Telugu literatu universally by eminent educationalists as well as Telugu & English Press. See opinions.

ఇది

వంగూరి సుబ్బారావుగారిచే

రచియింపఁబడి

శ్రీ చలికాని లచ్చారావుగారిచే

సంపాదింపఁబడినది.

రెండవకూర్పు 1200.



చిత్రాడ:

శ్రీరామవిలాసముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1920.

వెల రు 0—12—0.

# రెండవకూర్పు పీఠిక

ఈగ్రంథము మొదటికూర్పు శ్రీ లచ్చారావుగారి యాజమాన్యమునఁ బ్రకటింపఁబడినది. దీనిని బ్రారంభమునుండియు ననేకు లాదరణతోఁ బెంచిరి. పత్రికాధిపతులు మంచియభిప్రాయముల నొసఁగిరి. విద్యాశాఖాధికారులు, విశ్వవిద్యాలయమువారు, పండితులు, జమీందారులును దీనిని గౌరవించిరి. విమర్శకు లిట్టి నవల తెలుఁగుభాషలో మఱియొకటి లేదనిరి. ఇప్పుడిది పఠనీయగ్రంథమైనది. కాగితపుఁగరవుగా నున్నను శ్రీ లచ్చారావుగారి దయచేఁ బునర్ముద్రణమందుఁగూడ నెప్పటి మూల్యమున కీయఁబడినది. కొన్ని లోపము లిందు సవరించితిని. ఈ నవలయందు గుణము లెక్కువైన నాదరించిన మిత్రుల కనేక వందనములు.

2—7—2, 
నెల్లూరు.

గ్రంథకర్త.

# సంపాదకీయ భూమిక.

—(౦)—

చదువరులారా!

'దేశభాషలందుఁ దెలుఁగు లెస్స' యనియు (Italian of the East) అనియు ఘనబిరుదములను మనయాంధ్రమాత పరదేశవాసుల వలనఁగూడఁ బడసి యుండుట లోకవిదితమె గదా. అట్లు దివ్యతరంబై పేరెన్నికఁ గాంచినభాషామతల్లి తొల్లిఁటి మర్యాదలఁ గోలుపోయి క్రమక్రమముగా క్షీణదశకు వచ్చుచు మోము వాల్చుచుండె. అట్టిసమయమున భాషాభిమానులగు బుద్ధిమంతులు కొందఱు తాదృశదుర్దశచేఁ బీడ్యమానం బగుటంజేసి యుషఃకాలచంద్రబింబముపోలెఁ గళావిహీనమై యున్న యాంధ్రభాషామతల్లి వదనబింబముఁ దిలకించి "అయ్యో సంస్కృతభాష యిదివఱకె జీవచ్ఛవం బయ్యె. ఇఁక నాంధ్రభాషకుఁగూడ నట్టియిక్కట్టు పొడకట్టున ట్లున్నది. రానురాను ముందిఁక నెట్టిదురవస్థ పట్టునో" యని నిరంతరవేదనావేదితహృదయులై యావలల వాంచి విచారమనస్కులై యాయమవదనబింబము మఱల మందస్మితకందళితంబుగఁ బొనర్చిననేగాని మాపూనిక విడువమని బద్ధకంకణులై వారివారిశక్త్యనుసరణి సమాజములు, గ్రంథమాలలు మొదలగునవి స్థాపించి భాషాసముద్ధరణ నలుపఁదలఁచి తత్ప్రయత్నములు చేయమొదలిడిరి. మేమును జంద్రునికొక నూలిపోఁగనునట్లు తదీయసేవఁ జేయుచుఁ దదుద్యమబద్ధమానసులమై 1912 వ సంవత్సరమున 'శ్రీరామవిలాస' మనుపేర నొకగ్రంథమాలను స్థాపించితిమి.

'శ్రేయాంసి బహువిఘ్నాని' యనువచనప్రకారము మాగ్రంథమాలకుఁ జిక్కులు పెక్కులు సంభవించినవి. అయినప్పటికిని 'అనిత్యాని శరీరాణి - విభవో నైవ శాశ్వతః - నిత్యం సన్నిహితో మృత్యుః

కర్తవ్యో ధర్మసంగ్రహః ॥' అను వచనార్థము నెఱింగి మాయంతరాత్మప్రేరణంబున సఘటనాఘటనాపటిష్ఠుం డగుభగవంతునిపై భారము వైచి యుస్మదీయ కార్యసాఫల్యము కోఱుచుం బూనుకొంటిమి. ఇట్లుండ భక్తజనపరాయణుం డగునాభగవంతుఁడు మాప్రార్థన నంగీకరించి పంపిన దేవదూతలో యనఁ ద్విలింగ్యాంగ్ల భాషాకవితావిశారదులును, గ్రాంథికభాషాసముద్ధారణానిబద్ధకంకణులును బ్రశంసనీయులు నగు కూచి నరసింహముపంతులు బి. ఏ. గారును, పానుగంటి లక్ష్మీనరసింహారావు బి. ఏ. గారును, తాతూరి లక్ష్మీనరసింహారావు బి. ఏ. గారు మొదలగు మహనీయులు మాయుద్యమమునకుఁ గడు సంతసించి యాలోచనాసభ్యులు (Advisory board) గా నుండుటకు నంగీకారమొసఁగిరి. అకృత్రిమ మాగ్రంథమాల నూతనకుసుమగుంభితమై రాణ నొప్పఁదొడఁగెను.

'గతం నశోచామి కృతం స్మరామి' యనువచనము జ్ఞప్తియందునుచుకొని చరిత్రాంశముఁ గొంత ముచ్చటించెద. శ్రీకృష్ణదేవరాయలు క్రీస్తుశకము 1509 వ సంవత్సరంబునఁ బట్టాభిషిక్తుఁడాయెను. ఈయనయొద్ద రాజకార్యనిర్వహణాకుశలుండును, కుశాగ్రబుద్ధియు నగు "తిమ్మరుసు" అను బ్రాహ్మణోత్తముఁడు మంత్రిగా నుండెను. రాయలువారు విజయనగర రాజ్యమును (విద్యానగరము) రామరాజ్యమువలెఁ బ్రజారంజకముగాఁ బరిపాలించెను. ఈయనకాలమునందే యాంధ్రభాష నానఁబెట్టిన రత్నశలాకవలె మిక్కిలి ప్రకాశమానమై శుక్లపక్షచంద్రికవలె దినదినాభివృద్ధిఁ గాంచుచు వచ్చెను. పూర్వకాలంబున మాళవదేశాధిపతి యగుభోజమహారాజు సంస్కృతభాష నెట్లాదరించి పోషించెనో యట్లే కృష్ణదేవరాయలుఁ గూడ నాంధ్రభాష నాదరించి కవుల సన్మానించి వారిచే గ్రంథరచనఁ జేయించి లోకంబున వ్యాపింపఁజేయుటచేత నాంధ్రభోజుఁ డని ప్రఖ్యాతిఁ గాంచెను. ఈయ

న కవుల నాదరించి వారిచేఁ గావ్యంబులు వ్రాయించుటయే కాక తాను సంస్కృతాంధ్రములయం దసాధారణపాండిత్యప్రకర్ష కలవాఁ డగుటంజేసి యుభయ భాషలయందు గ్రంథములు రచించి ప్రఖ్యాతి వడసెను. ఈయన కాలమందే ప్రబంధరచన క్రొత్తగాఁ బ్రారంభ మాయెను.

మఱియు నాయనసంస్థానంబునఁ బేరెన్నికఁగాంచిన యాంధ్రకవితాపితామహబిరుదాంకితుండును సర్వతోముఖపాండిత్యశౌండుఁడు నగు నల్లసాని పెద్దనయు, 'ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు' అని పేరుగాంచిన (నంది) ముక్కుతిమ్మనార్యుఁడును, 'స్తుతమతియైన యాంధ్రకవిధూర్జటిపల్కులకేలఁ గల్గెనో యతులితమాధురీమహిమ' అని వినుతిఁ గాంచిన ధూర్జటికవియు, 'సరససాహిత్యరచన విస్ఫురణ మెఱయ సారమధురోక్తి మాదయగారి మల్లనార్యు' డని ఖ్యాతిఁ బొందిన మల్లనయు, సంపూర్ణశ్లేషకావ్యమును సులభశైలిని వ్రాసినట్టియు, మఱియుఁ గళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్న ప్రబంధద్వితీయ కథాచమత్కృతిప్రధానమునఁ బేరెన్నికఁ గన్నట్టియు, "సంస్తుత్యోభయ శ్లేషసం - ఘటనన్ రాఘవపాండవీయకృతి శక్యంబే రచింపంగ నె - చ్చట నెవ్వారికి నీకె చెల్లె నదిభాషాకావ్యమున్ జేయఁగన్ -" అనియు మెప్పువడసి పట్టి బింగళిసూరనార్యుఁడును, 'అతిమధురరసాయన ద్రాక్షాపాకముగా శృంగారరసయుక్తంబుగఁ బ్రబంధంబు రచింపు' మని రాయలచేఁ గోరఁబడిన రామభద్రకవియు, దేశవిఖ్యాతి నొందిన తెనాలిరామకృష్ణకవియు, రామరాజభూషణకవివరుండును, ఏతాదృశమహాకవిపుంగవు లష్టదిగ్గజంబు లన సుప్రసిద్ధకవితాసంపన్నులై విలసిల్లుచుండిరి. అట్టిసుకవిరాజన్యులఁ దనయాస్థానంబునం దునిచికొని భాషాయోషామల్లిక

*N. B.*—ఇందు కొందఱు కవులు కృ॥ పోషణమున లేరని విమర్శకులమతముగా నున్నది.

మిగుల వన్నెవాసి దెచ్చుటచే నాయనను గీర్తికాంత వరించెననిన సందియంబె! అట్టివానిజన్మంబె పవిత్రవంతమై సార్థకం బైనది. ఈభూమండలమున నెందఱు రాజులుపుట్టి గిట్ట లేదు! ఈయనచరిత్ర వ్రాయువారు ధన్యులు.

మఱియు నీయన శౌర్యధైర్యస్థైర్యగాంభీర్యపరాక్రమసాహసాది గుణాధికుఁడనుటకు నీయన సింహాసనమునకు వచ్చిన యచిరకాలంబులోనే నిజరాజ్యమును నానాముఖంబుల వ్యాపింపఁజేసి ఘనబిరుదావళు లందియుండెను. అవి (శ్రీమహన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ, అరిరాయవిభాడ, భాషిగెతప్పువరాయరగండ, అష్టదిక్కులరాయమనోభయంకర, పూర్వదక్షిణపశ్చిమ సముద్రాధీశ్వర, యవనరాజ్యసంస్థాపనాచార్య, గజపతివిభాడ, శ్రీవీరప్రతాప, మొదలగునవై యున్నవి.

మహాభారతయుద్ధముతరువాత నీయనచేసిన రాయచూరుయుద్ధమును మించినది వేఱొకటి యీదేశమున లేదని చరిత్రకారులయభిప్రాయము. ఈయనయొద్దఁ గమ్మలు వెలమవారు యుద్ధనైపుణ్యమున మిగుల మన్ననలనందిరి. ఈయన దాసీపుత్రుఁడని కింవదంతిమాత్రమేగాని దానికిఁ దగునాధారంబులేమింజేసి యది విశ్వాసార్హముగాదు. మంచివారి కేదోయొకకళంక మాపాదించుట మనదేశీయుల కాచారముకాఁబోలు !

## ప్రభాతము.

ఏతద్గ్రంథమునం దుండుసారాంశములఁ గొన్నిటి సంక్షేపముగ నిందు ముచ్చటించెద. ఇది యొకచరిత్రాత్మక మైననవల. శ్రీకృష్ణదేవరాయలయొక్క రాజ్యవైభవము సంస్థానమర్యాదలు మొదలగునవి చక్కఁగ నిందు వర్ణింపఁబడినవి. మఱియు రాయలకుఁ గలకవితాదరణ, ఆకాలమందు రాజులకుండు చిత్రలేఖనశక్తి, అప్పటికాగితములవాడుక,

పరదేశీయుల ప్రసంగము మొదలగుచరిత్రాంశములఁ దెలుపుచున్నది. మంత్రితిమ్మరుసుయొక్క రాజకీయకార్యనిర్వహణధురంధరత్వము, సేనానాయకులప్రభుభక్తి, రాజాదరణ, రాజపరిపాలనావిధానము మొదలగునవి యిందు సముచితముగ వర్ణింపఁబడియెను.

గజపతి తనతనయను రాయల కిచ్చెద నని వాగ్దానమొసఁగి మెవ్వ రెన్ని చెప్పినను తిరుగ మఱలకుండుట క్షత్రియధర్మమును సూచించుచుండెను. యథార్థశూన్యములు, ననర్థవిధాయకములు నగుదూరదృష్టి లేనిదాసీభాషణంబులకుఁ జెవియొగ్గినందులకు రుచిదేవి పడినకడగండ్లు, పశ్చాత్తాపము మిగుల విచారకరములు. తిమ్మరుసుగూఢతంత్రమువలన రుచిదేవికిని దదీయప్రియజననికిని జరిగినయుత్తరప్రత్యుత్తరములు రుచిదేవికిఁ గలపతిభక్తిని తెల్లడించుచున్నవి. రుచిదేవియొక్క సవతి యామెను రాయలతోఁ గలుపుట మిక్కిలియనురాగసూచకమును, నీతిబోధకమునై ప్రశంసనీయముగ నున్నది. ఇందలివర్ణనలు స్వాభావికములుగాను, రసవంతముగాను, కవిత్వము ద్రాక్షాపాకమువలె మృదులముగా నుండి, చదువరులకు గ్రంథము సాంతముగాఁ జదువునాసక్తియు, పదంపడి యానందమును బ్రాదుర్భవింపఁజేయును. గ్రంథము సాంతముగాఁ జదివినవారికే గ్రంథకర్తయొక్కవచనరచనానైపుణ్యము కథాచమత్కృతి మొదలగువిశేషములు బోధపడును. మాతృభాషాశ్రేయోభిలాషు లగుమహనీయు లెల్లరును మాయుద్యమమునకుఁ దోడ్పడఁగలరని మాయాశయము.

చెలికాని లచ్చారావు,

సంపాదకుఁడు.



శ్రీరామచంద్ర.

# ప్రభాతము.

## మొదటి ప్రకరణము.

### ప్రభాతము.

"సీ. నక్షత్రదీపికల్ నైజకాంతుల రవి
కర్పణ మొనరించి యడఁగుచుండఁ
గలకలమని పక్షి గములెల్లవడి లేచి
భానునిగీర్తించి పాడుచుండ
మలయానిలుండు కమ్మవిరిగంధములఁ గూర్చి
బాలభానునిసేవఁ బ్రబలుచుండ
నుడురాజు తనతేజ ముడిగి యుండియు లేక
సూర్యుఁ దెల్లంబోయి చూచుచుండఁ
గీ. ప్రకృతి చైతన్యకాంతులఁ బ్రబలుచుండ
భక్తకోటియు సంతోష వార్ధిఁ దేలఁ
బుష్పలావిక లెల్లెడఁ బురమునందు
నేగుచున్నారు లెమ్మిఁకఁ గృష్ణరాయ !"

అని వైతాళికులు విజయనగరాంతఃపురసౌధభాగమున హెచ్చరికలు గీతము చేసినపిమ్మట "కర్ణాటాంధ్రరాజ్యలక్ష్మీబాహుపీఠా !

మూరురాయరగండా! జగనొబ్బగండా! జయీభవ! విజయీభవ!" అని శ్రీకృష్ణరాయలవారిని వందిమాగధులు మేలుకొలుపుచుండిరి. బంగరుపిడులఁ గుంచెలుగాఁ గట్టిన చమరీమృగములవింజామరము లరుణోదయసమయమున సేవకుల చేతులయందు వెండితీఁగలకుంచెలవలె ధవళకాంతులతోఁ బ్రకాశించుచుండెను. నెమలికుంచె లింద్రధనుర్వర్ణముల నీనుచుండెను. శ్వేతాతపత్రాదిరాజచిహ్నములు భృత్యకోటిహస్తముల నలంకరించుకొని ద్వారముకడ వేచియుండెను. "తిమ్మరుసయ్యవారు వచ్చువేళ యైనది. రాయలు నేఁడింకను లేవలేదు." అని సేవకులు గుసగుసలాడుకొనుచుండిరి. రాయ లిప్పుడు లేచు నప్పుడు లేచునని యందఱుఁ దొట్రుపాటు నొందుచుండిరి.

సార్వభౌముఁ డుదయింప నాతనికిఁ దమతమరాజ్యములనుండి కప్పములఁ గట్టి, తమప్రతిభఁ గోలుపోయి రిక్తకరులగుసామంతరాజులవలె దినరా జుదయింప నాతనికాంతిలోఁ దమకాంతులు లీనమైపోవఁ బ్రతిభఁ దొలఁగి రిక్తకరము లై నక్షత్రములు కాంతిహీనము లగుచుండెను.

మహారాజు లేచునప్పుడు వందిమాగధవర్గము స్తోత్రపాఠము లొనరించుచున్నట్లు సూర్యోదయ మహాకౌతూహలాయత్తచిత్తముతోఁ బక్షికోటి పాటలఁ బాడుచు, ఱెక్క లల్లార్చుచు మిత్రుల సౌఖ్యముగ నాహారాదికసంపాదనముకై పోవచ్చునని కుతూహలపడుచుండెను.

అరుణోదయసమయమున నుండు ప్రశాంతియు, నిర్మలమందమారుతము నావసంతకాలముచం దుదయభాగమునం దెప్పటివలెనే ప్రబలి యుండెను. అదృష్టవంతుఁడును బరాక్రమవంతుఁడు నగుమహారాజు విజయయాత్రకుఁ బోవసమకట్టునపు డెచ్చటకుఁ బోయిన నచ్చటనే జయము గలుగుననుటకు శుభసూచకముగ దేశమున నుండు

ప్రతివీరకంఠనక్షరము లడఁగి దేశమంతయు శాంతిప్రదమై యుండునటు లాసూర్యోదయసమయమున లోకమంతయు నిర్మలభావసంపూరితమై యుండెను. ఆసమయమునఁ బ్రకృతి యోగిహృదయమువలెఁ దటస్థ ముగ నుండెను.

మహమ్మదీయులు పేరునకు రాజ్యముఁ జేయుచు, రాజ్యభా గముల నన్నిటిఁ గోలుపోయినపిమ్మట నభిమానముచేఁ దమ చిన్నదు ర్గములనుండి తీసివేయని పతాకవస్త్రములపై ముద్రింపఁబడి యున్న మాసినచంద్రునివలె నీలాంబరముపైఁ బ్రకాశహీనుఁడై చంద్రుఁ డొకమూల నొదిగియుండెను.

సహస్రదళములతో వికసించుచున్న పద్మము క్రమముగఁ బరి మళకాంతులచే నలరారుచుండ సహస్రకరములతో నుదయించుచున్న పద్మినీమిత్రుఁడు క్రమముగఁ దేజఃప్రతాపవిభాసితుఁ డగుచుండెను.

కొలఁకుల నుస్నాతులై ద్రవిడవేదములఁ జదువుచు వైష్ణవ బ్రహ్మచారులును, భక్తులును, పట్టణమంతటఁ గలదేవాలయము లకుఁ బోవుచుండిరి.

తులసీమందారమాలికలను, పూజార్హము లగులితరపుష్పమా లికలను దీసికొని పడుచులు గుడిముంగిళ్ల నిలువఁబడి మందహాసవదన ములతో భక్తులకును బుణ్యస్త్రీలకుఁ గుసుమమాలికల నమ్మఁజూపు చుండిరి.

ఇప్పటికిని రాయలు పరుండినభవనద్వారము తెఱవఁబడలేదు. ప్రతిదిన మీసరికి విహారము పోయివచ్చి చెమ్మటలుపట్టువఱకు సాము చేసి, సుస్నాతుఁడై దేవతారాధనమునకు రాయలవారు పోవుచుం డుట వాడుక ! మల్లులు, నాశ్వికులు, వైతాళికులు, సేవకులు, మం త్రులు, కవులు మొదలగువారు వేలకొలఁది 'రాయలు లేవలేదు లేవలేదు' అని కారణము తెలియక గజిబిజి పడుచుండిరి.

ఎవ్వరును బోయి లేపుటకు సాహసింపలేదు. ఎవ్వరికి నాస్వాతంత్ర్యమును లేదు. క్రమముగా సూర్యకాంతులు మీాఁదఁ బ్రొద్దెక్కుచుండెను. తుదకీసంగతి తిమ్మరుసయ్యవారికిఁ దెలియవచ్చెను.

ఆసమయమున నుద్యానవనమునై పునఁ గలగవాక్షము తెఱచియుండెను. ఆగవాక్షముకడ రాయ లొకపీఠముపైఁ గూరుచుండియుండెను. ఆప్రక్క కెవ్వరును రారు. ఉద్యానవనములోనివారి కాసౌధాగ్రమునఁ గలరాయ లగపడుటకు వీలులేదు. తోఁటయందైన నెవ్వరు లేరు. ఏమి యీావిచిత్రము! రాయలు నిద్రించుచుండెనని యందఱుఁ దలంచిరి. శరీరానారోగ్యమై యుండునా యని యంతఃపురపరిచారకులు రాజవైద్యులను సిద్ధముగ నుంచిరి. కాని రాయ లప్పు మేల్కొనియుండియు భవనద్వారము తెఱవక యాగవాక్షముకడ నేమిచేయుచుండెను ?

అతనినేత్రములు కెందామరలవలె నెఱ్ఱఁబారి, నవజరక్తవర్ణశోభితము లగుజీరలు రక్తిమాతిశయముఁ గాంచియుండెను. భవనమునకు బయట జరుగునందడి రాయలు గుర్తించియుండలేదు. వందిమాగధులసామాన్యగీతము లైనవిమ్మట ద్వారపాలకులు బయట నిశ్శబ్దముగ నుండిరి. అయినను మేలుకొనియుండిన రాయలు ద్వారమునకీవల భృత్యకోటి నిరీక్షించియుండిన ట్లెఱుఁగకపోఁడు! అట్లయ్యు నాతటస్థభావమేల ? అతనివదనము పరిశీలనముగఁ జూచినచో నాతఁడు రాత్రియంతయు మేలుకొనియుండినట్లుఁ దోఁచును. కపోలహస్తుఁ డయినరాయలొక్కగడియకు లేచి ప్రక్కనున్నయుత్తరీయమునఁ జెమ్మటలు దుడుచుకొని నిట్టూర్పుఁబుచ్చి మఱల యోజనఁ జేయుచుఁగూరుచుండెను. దీర్ఘాలోచనపరుఁడై రాయలు కాలము నెఱుఁగకయుండుట కిది ప్రథమము కాకపోయిన నిదివఱకాతఁ డెన్నఁడు నీప్రభాతసమయమున నిట్లు ద్వారము తెఱవక యుండలేదు. రాత్రి తడపినపట్టివేరు

తడికలపై పునరు రాయలు చూచి తలపంకించెను. అతఁడు మరల లేచి యటునిటుఁ బ్రచారమొనర్చినచ్చి హంసతూలికాతల్పముపై నొరగి కన్నుల మూసికొనెను. అతఁడు మందహాసము చేయుచుండెను. అట్లే పరుండెను. కదలుట లేదు. ఒకగడియకాల మట్లే యుండెను. అతనిచిఱునవ్వు నట్లే యుండెను. తుద కాతఁడు నిద్రపోయెను. నిద్ర కాదు! భ్రమ. కాదు స్వప్నము. అతఁ డొకవిధమైనస్వప్నావస్థయం దుండి నిశ్చేష్టుఁడై యుండెను.

ఇంతలోఁ దిమ్మరుసయ్యవారు వచ్చుచుండిరని ప్రతీహారులనిరి. ఆప్రదేశమున నున్న వారందఱుఁ దమతమదుస్తుల సరిచేసికొనుచు నీటు నటు తప్పుకొని దారిచేసిరి. విజయనగరసామ్రాజ్యమును బంగరము వలె నాడించి శత్రుభీకరముగఁ గరవాలమును ఝుళిపించినమంత్రిశేఖరుఁ డిప్పుడారంగమునకు వచ్చెను. "రాయలవారు లేవలేదా?" అని భవనరక్షకుని దిమ్మరుసు ప్రశ్నించెను. అతఁడు కృతాంజలితో భూమి కటు వంగి "చిత్తము! లే—" అనుచుండ, సేవకులనందఱు దూరమునఁ గలమఱియొకచావడియం దుండుఁడని యాజ్ఞాపించి యామంత్రిశేఖరుఁడు తనవెంటవచ్చినభృత్యునిచేతి కొకతాళముచెవినిచ్చి భవనద్వారమును దీయించి సేవకులనందఱు నచటనే యుండుఁడని యాతఁడు లోనికిఁ బోయెను.

ఈతాళముచెవి త్రిప్పుటవలనఁ గలిగినసవ్వడి రాయలు గ్రహించి లేచి "అప్పాజీ!" అని పిలిచెను. "ఏమిది? సూర్యుఁడు గతి తప్పినట్లు—" అని మంత్రియనుచుండ రాయలు "వలదు! కారణములు పిమ్మట తెలియఁజేయుదును. ఉద్దేశపూర్వకముగఁ గాని—చిద్దురబద్ధకమునఁగాని యొనర్చినది కాదు" అని సమాధానము చెప్పుచు బయటికి వచ్చెను. "రాయచూరుముట్టడిని గుఱించి యోజించుచుంటిరా?" అని తిమ్మరుసు ననెను. "కాదు" అని రాయలు పరా

ను నన్నను. "కవితాకన్యపై దృష్టికాదు కద!" అని తిమ్మరుసు చిఱునవ్వు నవ్వెను. రాయలు నవ్వుచు "సభాభవనమున కొకగడియలో వచ్చెదను." అనెను. "చిత్రము" అని తిమ్మరుసు మేడదిగెను.



## రెండవ ప్రకరణము.

—(o)—

### చింతామణిమందిరము.

రాయల పడకగదికిఁ బ్రక్కఁ జింతామణిమందిరమను నొక్క భవనము కలదు. అందనేకచిత్రపటములు గోడలపై వ్రేలాడుచుండెను. శయనించుటకు, విలాసార్థముగఁ గూర్చుండుటకు వీలయినపూలపనిచేసినగుడ్డతో నాలుగైదుసోఫాలామందిరమునఁ గలవు. బారులుతీరినపవడపుఁగంబములపై బంగరులతలు చుట్టికొని ప్రాఁకుచున్నట్లుఁ జిత్రింపఁబడెను. పులిచర్మములు, నేనుఁగుదంతములు ననేకములాగదియందు గోడలపైఁ జిత్రపటములనడుమ నందముగ నమర్చియుంచిరి, సజీవము లనిభ్రమగొల్పుదుప్పులతల లచ్చటచ్చట నమరియుండెను. చూరు మొగ్గలు తీర్చిన ట్లుండి స్తంభములపైనమర్చిన సింహపుఁదలలయందుఁ బ్రతిఫలించుచుండి గదియంతయు వితానములపై నద్దినపూలచెట్లతోడను, నందందు ఫలించిన వింతరంగులఫలజాతులవలె నమరియున్న పాదరసపుబుడ్లతోడను, ఫలముల భక్షించుట కెగిరివచ్చినవాయని తోఁచు ఱెక్కలల్లార్చుపక్షి చిత్రములతోడను శోభావంతమై యుండెను. రత్నఖచిత మగుబంగరుపిల్లను, శ్యామలము లగుపట్టుత్రాళ్లను గల రెండుకరవాలములు గోడపై మేకులకుఁ దగిల్చి యుంచిరి. గదిలో నడుగుభాగమున విశాల మగురత్నకంబళము పఱచియుండెను. చాందినీకంచువలె ముత్యములసరములు వింతవింతగ నమర్చియుండెను. పాదరసపుబుడ్లయం దాముత్యపుఝాలరులును, రత్న

కంబళముపై నున్నరంగురంగులపుష్పములును బ్రతిఫలించి చెక్కడ పుఁబనిచేసిన పెద్దగాజుకుప్పెలో సానఁబట్టిన పెద్దవిచిత్రరత్నగోళములో యని భ్రాంతిగొలుపుచుండెను. నవరత్నములహారములును, రాయలు ధరించుశిరోవేష్టములును జిలుగుసరిగపూలపని చేసినయంగరఖాలును, కొలఁదిగ నాగదియం దొకసోఫాపైఁ బడియుండెను. బంగరువికారము గలకట్టుచట్రములం దమర్చిన నాలుగైదు నిలువుటద్దము లాగదియందు నాల్గుప్రక్కల నమరియుండి, యెవ్వరైన నందుఁ బ్రవేశించినచో నొకదానియం దొకటి ప్రతిఫలించి యెందఱో ప్రవేశించినట్లుఁ గనఁబడును.

ఇప్పు డామందిరములోనికి రాయలు ప్రవేశించెను. ద్వారముకడ వేచియున్న భృత్యులలో నొకని జూచి "నీవీక్షణము పోయి—" అని సందేహించి తిమ్మరుసయ్యవారి నీదినము సభయందలి వ్యవహారములఁ బరిష్కరింపుమని చెప్పుము—" అని రాయ లాజ్ఞాపించెను. భృత్యుఁడు వినయపూర్వకముగ వంగి వెనుదిరుగక రాయలవైపునకే ముఖముంచి కొంచెము నడచి నిష్క్రమించుచుండ "ఈమాటలు రహస్యముగ నప్పాజితోఁ జెప్పుము. నేఁడు కొంచెము బద్ధకముగ నున్నది" అని రాయలు చింతామణీ మందిరములోనికిఁ బోయెను. అతని దృష్టి నలువైపులకుఁ బ్రసరించెను. అతఁ డామందిరమునంతను గ్రొత్తవానివలెఁ జూచెను. అతని కదనివి కలుగలేదు. అతని వదనమునఁ గొంచెము విచారము—అట్లనుటకు వీలులేదు. అసంతుష్టిభావచిహ్నములు ముద్రితములై యుండెను. ఆచిహ్నములైనఁ బరిశీలనముగఁ జూచు బుద్ధిమంతులకు మాత్రమే గోచరమగును తక్కినవారవి నిద్రబద్ధకమునఁ గలిగినలోపములని తలంపవచ్చును.

అతఁ డాభవనమున నున్నయొక తాటియాకుల గ్రంథమును దీసి చదువఁదలంచెను, నూలుత్రమును విప్పి గ్రంథమును దెఱచునప్పటి

కది మేఘసందేశమయ్యెను. ఆతఁడది చదువకయే ప్రక్కనుంచివేసెను. ఆగ్రంథము నాతఁడు చదువఁదలంపలేదు. రామాయణము పట్కాండలు నొకవైపున, భారతయుద్ధసంతయు రెండవవైపునఁ జిత్రింపఁబడియున్న పటముల నాతఁడు చూచుట కొంచెము తృప్తికరముగ నుండునని తలంచెను. హరధనుస్సు విఱుచునప్పుడించుక దూరమున నిలువఁబడిన సీత ముద్దుమొగమునందలి వింతభావము లాతనికంటఁబడెను. ఆతని హృదయమున భావపరంపర లుదయించి కల్లోలము చేయఁ గొంతవడి కొక్కనిట్టూర్పుఁ బుచ్చెను.

రాయలు భృత్యునిబిలిచి యలసాని పెద్దనగారిని బిలువుమని చెప్పెను. భృత్యుఁడు చిత్తమని వెడలిపోయెను.

ఇంతలో నాభవనముకడ నున్న మఱియొకసేవకుఁడు తత్తరపాటుతో భవనద్వారమునఁ బ్రవేశించి "ప్రభువులనుజూచుటకుఁ దిమ్మరుసయ్యవారు వచ్చుచున్నార" ని చెప్పెను.

"మంచిది, రానిమ్ము" ని రాయలు నుడివెను.

తిమ్మరుసయ్యవారుసభఁ జాలించి గృహమునకుఁ బోవుచు రాయలకడకు వచ్చెను. ఆతఁడు చింతామణీమందిరమునఁ బ్రవేశించి "ప్రభువుగారిచర్య నేఁడు వింతగనున్నది. పరిపాలన ప్రారంభమునుండియు నేఁటివఱ కెన్నఁడు నీట్టివర్తన మెఱుఁగము. రాజకార్యములయందశ్రద్ధ నూతనము!" అని నవ్వుచుఁ బలికెను. "తగినమంత్రివరులుండినరాజున కీమాత్రము విశ్రాంతియుందాశ్చర్య మేల?" అని మంత్రివరునకుఁ బీరముఁ జెప్పెను. తిమ్మరుసు నవ్వుచుఁ గూరుచుండి "ఇంతవఱకు నీవిశ్రాంతిపై బాబుగారికికోరిక యుండక నేఁడు కలుగుటయందాశ్చర్య మున్నది. మంత్రివరులు నూతనముగఁ దగినవారైనట్లు ప్రభువుగారు తెలిసికొనిరా? మమ్ములను బరీక్షింపవలయునని కుతూహలమా?" అని పలికెను.

"ఒక్కనాటి కింత దూరమేల?" అనిరాయలనెను.

"ఒక్కనాటికైన భయము లేదు. ప్రభువుగారి విశ్రాంతి కొంతకాలమువఱకు పోవునని సందియమొదవుచున్నది. కాకుండినచో నిప్పుడు మఱల రాను. ఐనను మంత్రులయర్హతను గనుఁగొనుటకుఁ బ్రభువులు రాత్రుల శయనాగారములయందు నిద్రమానియుండుటమాత్రము—" అని తిమ్మరుసు నవ్వెను.

"నిన్నటిదిన మెండయధికముగ నుండుటచేతను, మొన్న రాత్రి పులివేఁటయు నేఁటివిశ్రాంతికిఁ గారణములు!" అని రాయలు నుడివెను.

"అందువలననే రాత్రి సుఖనిద్ర కలుగుటకు మాఱుగ-నిద్ర లేకపోయినది కాఁబోలు!" నని తిమ్మరు సనెను.

వారుభయులును నవ్వుకొనిరి. అప్పుడచ్చటికిఁ బెద్దన్నగారికొఱకుఁ బోయినభృత్యుఁడు వచ్చి యాతనిరాకఁ దెలిపెను.

"వారిని రానిచ్చుట కభ్యంతరమేమి!" అని రాయలనెను.

"సత్వరము తీసికొనిరమ్ము!" అని తిమ్మరు సనెను.

అప్పు డామందిరములోని కాంధ్రకవితాపితామహుఁడు నవ్వుమొగముతోఁ బ్రవేశించెను. "నేఁడేమి క్రొత్తవారివలె మందిరములోనికి వచ్చుటకు ముందు భృత్యునంపినారు" అనుచు రాయలు లేచి నమస్కరించెను. తిమ్మరుసు కుశలప్రశ్నమొనరించు నవ్వులోఁ గుతుకదృష్టులఁ బఱపుచుండెను. పెద్దన "మంత్రిగారితోఁ బ్రభువులు రాజకార్యములనుగుఱించి మాటలాడుచుండవచ్చునని యట్లుఁ జేసితిని." అని తిమ్మరుసువైపునకుఁ దిరిగి "గ్రంథపాఠకులు ఖడ్గధారులకు భయముండవలదా?" అని నవ్వెను.

"అవును! గంటపుఁగోటులు ఖడ్గధారలనతిక్రమించునుగదా! ఆవశ్యము మీకు మేము భయపడవలయును." అని తిమ్మరుసనెను.

రాయలునవ్వెను. పెద్దనరాయలవైపునకుఁ దిరిగి "ప్రభువులు

మంత్రివరులతో నేకీభవించుట సహజముకాని యనేక ఘంటములను బోషించునొక్క ఖడ్గమువిలువ నుడువవలయునా?" అని పలికెను.

"కరవాలమును గంటమును గలసిన నుండుశక్తి కేశక్తియుఁ జాలద" నిరాయ లనెను.

"ప్రభువుగారి కారెండుశక్తులును గలవ" ని పెద్దన పలికెను. రాయలు మందహాస మొనర్చెను.

"మీరునుగలవు!" అని తిమ్మరు సనెను.

"తాటియాకులు గీయుటకు" అని పెద్దన పలికెను.

రాయలునవ్వుచు "అప్పాజీ! మీభోజనమునకు వేళకాలేదా?" అనెను.

"చిత్తము! కావ్యకాలక్షేప మొనరింపుఁడు సెలవుదీసికొందుమన" ని తిమ్మరుసు వెడలిపోయెను.

అనంతరము రాయలు పెద్దనమహాకవిని జూచి "గురూత్తమా! నేఁ డొకపద్యము రచియించితిని. మీరు చిత్తగింప వలయును." అని రాయ లొకతాటియాకును దీసి ప్రక్కబల్లపై నున్న గంటముతో నిట్లు వ్రాయుచుండెను.

కననియరవిరిగందంబు కలను గాంచి
భ్రమరరాజంబు వనమెల్ల భ్రమసి తిరుగు
పలుకబారినఫలముల పరిమళముల
స్వప్నమునఁ జూచి కీరంబు శ్రమల నొందు
స్వర్ణమయపద్మనాళంబు స్వప్నమందు
గొఱికినట్టులు కలఁగని కూయు హంస
కులికి ప్రియుఁబిల్వఁ గోయని కూసి పికము
మారుమోగిసిననవి, ప్రియు మాట లనుచు
వెదకి తల్లడపడు మతి విసుఁగుఁజెందు

స్వప్నమునఁ గన్నదదియెల్ల సత్యమగునె
మారుమోత్రలు నిజమౌనె కోరుకొనిన
సత్యమెఱిఁగిన పరమాత్మ ఛాయ యైన
బుద్ధి భ్రమఁజెంది బాధలఁ బొందలనేల

అని చదివెను. పెద్దన్నగారందలిభావములను మఱలఁ జదివి సంతసించెను. పిమ్మట వారు మనుచరిత్రమును గుఱించి మాటలాడుకొనిరి.



## మూడవ ప్రకరణము.

—(o)—

### చిత్రలేఖనము.

చిత్రలేఖనము మనోహరమైనకళ. ఇది ప్రాచీనకాలము నుండియు నార్యావర్తమునఁ బ్రబలియున్నది. దీనికి రాజాదరణము ప్రబలముగ నుండెననుటకు రాజులును రాజబాలికలు నీయుత్తమవిద్య నభ్యసించు చుండెడువారనుటయే ప్రబలనిదర్శనము. [కవిత, సంగీతము, చిత్రలేఖనము, నివిమూడును మానవహృదయమును గరఁగింపఁగలవు. ఇందేది ప్రధానస్థానము నాక్రమించు ననువిషయ మిచ్చట నిర్ణయించుకొనుటకుఁ దగినసమయము కాకపోయినను] జిత్రలేఖనము మనోగతభావములను బ్రదర్శించుట కొకసాధనమని మన మంగీకరింపవచ్చును. ఈమూడు కళలును బ్రయోజనములయినవే యైనను మనోగత భావములకంటె మనోగతరూపముల నచ్చుగుద్దినట్లుఁ బ్రదర్శించుటకుఁ జిత్రలేఖనము సులభమైనసాధన మగుచున్నది.

చింతామణీమందిరమున నొకనాఁడు చిత్రలేఖన సాధనములన్నియు సమకూర్పఁ బడియుండెను. కృష్ణరాయలువంటి సార్వభౌముండు కుంచె చేతఁ బూని రంగుల ముంచుచు, యోజించుచు, నొకకోమ

లాంగిచిత్రిమను వ్రాయుచుండెను. అతఁడింకను దాను రచియించెడి తరుణీమణి రూపమును సంపూర్ణముగ రచియించియుండలేదు. కొంత లోటుగ నుండెను. అతఁడు కన్నులు మూసికొని మనోగతరూపమును ధ్యానించి యాపటమును లిఖయించుచుండెను. మఱియొక రెండుగడియలలో నాపటము పూర్తియయ్యెను. అతఁడు లేచి కన్నుబొమలఁ జిట్లించి పటమును జూచెను. మనుష్యాకారమున జీవకళ పోసినట్లున్న యాచిత్రపటమున నింకను గొంచెము లోటు గలిగినట్లుఁదలఁచి మఱల రెండుమూడు ప్రదేశముల సవరించెను. సన్ననిజిలుగు దువ్వలువయు, మొకమల్ రైకయు, ధరించి, సర్వాభరణభూషితురాలైననిండుజవ్వని యగునాపటమునందలి వనిత యతిరమణీయముగ నుండెను. చక్కని మోమును, కపోలవాసమై యున్నతీరును, మృణాళములవంటి బాహువులును, సన్ననినడుమును నాసికసొబగును, నుండవలసిన ట్లున్నచుబుకమును, చిఱునగవును నాతరుణీమణి కదలుచున్న సజీవ యగునెలఁతవలె మనోహరమై యుండెను. రాయ లొక్క నిట్టూర్పుఁబుచ్చి చేతులు గడుగుకొని వస్త్రముతోఁ బట్టిన చిఱుచెమటలఁ దుడుచుకొనెను. మందిరద్వారము మూయఁబడి యుండుటచే సేవకు లెవ్వరును లేరు. రాయ లిటునటుఁజూచి మఱలఁ బటమును దదేకధ్యానమునఁ దిలకించి మందహాస మొనరించెను. అతఁడాపటము నంతత్యంతాదరమును గలిగియుండి నట్లాతనిచర్యల్లు సూచించుచుండెను. అతఁడు రచియించినదగుటఁ నంతయాదర ముండునేమోయని యనుకొనుట కాపటము వాకస్మికముగఁ జూచిన వారెవ్వరున్న రూపము సజీవము కాదని కాని దుర్లభ రమణీయాకృతియని కాని చెప్పుటకు సందేహింపరు. ఆపటముపై ననేక రీతులదృష్టులఁ బఱపి రాయలు తుద కందుపై నొకవస్త్రము గప్పి, మందిరద్వారముకడకు వచ్చెను. మఱలఁ బట్టి శాలిసమీపంబున నాపటమును జేరి, యాచ్ఛాదిత వస్త్రమును దొలఁ

గించి పటము నొక్కఁగడియవఱకు నదేపనిగఁ జూచెను. ఆదివ్యసుందరవిగ్రహము కదలి యాతనితో మాటలాడనుంకించిన ట్లాతఁడు భ్రమఁజెందెను. తాను రచియించినపట మదియని యాతఁడు మఱచి యాపటముతో నాతఁడు సంభాషింపవలెనని కుతూహలపడెను. తుదకుఁ గొన్నిమాటలడిగెను. ఆబాలిక సిగ్గుచే వదనము వంచుచున్న ట్లాతఁడు భావించెను. తుద కిస్సీ యిది పటమని యాతఁడు రిచ్చపడిన ట్లాతనివదనము మారెను.

ఎంతసేపు చూచినను దనివితీరని యాకాంతామణిసౌందర్యము రాయలహృదయమును గలఁచివైచెను. కావ్యపఠనమున మనుజుఁ డందు వర్ణింపఁబడినవనితను మనోరంగములఁ జూచి, యాకాంతరూపగుణసౌందర్యములకు మురిసి తుద కట్టికాంతను బడసినయాతనిజన్మము ధన్యమని తలంచునట్లుఁ గేవలము రంగులకూడిక యగునాదశపరికాగితమునందలి తాను రచియించినరూపము కొఱకు రాయ లావేదనపడుచున్నట్లుఁ జూచిన వారికి ద్యోతక మగుచుండెను.

రాయల మనస్సచ్చట లేదు. ఆతఁ డెన్నివిధములఁ జూచినను జిత్రపటమునందలి బాలిక సజీవమని యాతనికిఁ గలుగుచున్న భ్రమ స్వప్నరూపమున నాతనికి వింతవింతరూపములతోఁ బొడకట్టుచుండెను. ఆలావణ్యవతిపై నెన్నియో పద్యముల రచియింపవలయునని యాతనికి బుద్ధిపొడమెను. పెద్దనకవికడఁ జదివినపద్యము నాపటముక్రిందఁ జిత్రించెను. అచ్చట నేల నిలువఁబడెద వీవలకు రమ్మని పాణిగ్రహణ మొనరించి యామెనీవలకుఁ దెత్తుమని యాతనికిఁ గోరిక లుదయించుచుండెను.

తుద కాతఁడు విసిఁగి యాచ్ఛాదితవస్త్రమును మఱల మూసి, పగ మొత్తగించి మఱలఁ జూచి, ఎట్టకేల కీవలకు వచ్చెను. ద్వారము తెఱచినప్పటి కచ్చట నంతవఱకుఁ గునికిపాట్లు పడుచున్న భృత్యుఁ డొకఁడు దరిపడి లేచి, కన్నులు నవలించుకొని, బల్లెము నిలుపఁబెట్టి,

కన్నులం దుడుచుకొని యప్రమత్తుండై యుండినట్లుం గనంబడుటకుం బ్రయత్నించుచుండెను.

రాయ లాతనిం జూడకయే పడకగదిలోనికిం బోయెను. శయ్యపై బఱుండి కన్నుల మూసికొనెను. ఒక్క అరగడియ కాల మాతం డట్లుండి మఱల లేచి చింతామణీమందిరము లోనికిం బోయి తలుపులు మూసి వైచెను.

ఆతండు కోరినట్లు—తలంచినట్లు—పటమునందలి బాలిక సోఫాపైం గూరుచుండి యాతని జూచి లేచిన ట్లాతండనుకొని మఱలం గాదని నిశ్చయపఱచుకొని, పటముకడకుం బోయి వస్త్రమును దొలంగించెను. ఆమందిర మంతయు నూతనకాంతులం బ్రకాశించిన ట్లాతం డనుకొనెను. నిశ్చయముగ నందఱకు నాచిత్రపటమునందలి రూపమువలన నాభవనము రమణీయాతిశయమును గాంచుచున్నట్లుం దోంపకమానదు.

ఏమియుం దోంచక చిత్రపటప్రతిబింబముల వందలకొలందిగం జూపుచున్న నిలువుటద్దముల నాతండు పరికించుచుండెను. బాలిక నిలువుటద్దములలో ననేక వేషముల సంచరించుచున్న ట్లాతండు తలంచుచుండెను. ఒకచోట శూలినియై విక్రమముం జూపుచున్నట్లు, ఒకచోట వీణ వాయించుచున్నట్లు, మఱియొకచోట యోగినియైనట్లు, ఇంకొకచో నెన్నియో వేల యువతీమణుల కన్నదానము చేయుచున్నట్లు, కొండొకచో నొకచిన్ననావపైం దరంగితసరోవరమునం బోవుచు విహారమునకుం దన్నుంగూడం బిలుచుచున్నట్లు—తుదకుం గొన్నిచోట్ల శయనించినట్లు పూలం గోయుచున్నట్లు—అశ్వము నెక్కి విహరించుచున్నట్లు—నిరాధారముగ నాకాశమండలమున నడచుచున్నట్లు—కొంతవడి కేమియుం జేయక తనప్రక్క నిలువంబడి దుఃఖించుచున్నట్లు, వేలకొలందికరవాలము లామెచుట్టును మెఱయుచు మిణుగురుపురుగువలె నదృశ్యమగుచున్నట్లు—నింక నెన్నియో విధములం గనంబడుచుండెను. ద్వా

రము గాలికిఁ దెఱవఁబడెను. అప్పు డాతనిదృష్టియుఁ దెఱవఁబడెను. ఎప్పటిచింతామణీమందిరమయ్యెను. ద్వారమున కావల భటుఁ డాతనికంటఁబడెను. రాయలు దిగ్గున లేచి పటముపై వస్త్రము గప్పి, గవాక్షముపై పునఃదృష్టిఁ జూచెను. అప్పటికి చంద్రోదయ మగుచుండెను. అంతలోనే సాయంకాల మైనదా యని రాయలు తలంచుచు గుమ్మముకడకు వచ్చెను. తిమ్మరుసయ్యవా రిచ్చిరని యొక భటుఁ డొక లేఖ నాతని కిచ్చెను.

దీపమువెలుతురులో నాతఁ డాచీటిచదువుకొనెను. అం దిట్లున్నది. " ప్రభువర్యా !

నాఁడు మొదలు నేటికిఁ బదునేనుదినము లైనవి. తాము సభాభవనమునకే వచ్చుట లేదు. దర్శనమైన దుర్లభమగుచున్నది. మహమ్మదీయులరాయబారులఁ బంపివేసితిమి. పదమూఁ డొందరలు మిక్కిలి ముఖ్యముగ గమనింపవలసి యున్నది. దీనికిఁ బ్రత్యుత్తరము లేనిమొదల నప్పాజీని మీరు నిందింపవలదు.

తిమ్మరుసయ్య."

రాయ లది చూచి మారుపలుకక శయనాగారమునకు వెడలిపోయెను. భృత్యులును వెడలిపోయిరి.

---

## నాల్గవ ప్రకరణము.

—o—

### గూఢచర్యలు.

రాత్రి మూఁడవజాము గడచుచుండెను. చంద్రాస్తమయమైయొకగడియకాలము గడచినది. చీఁకటు లెల్లెడల సాంద్రముగ వ్యాపించుచుండెను. నక్షత్రరాజి ప్రకాశవంతమైనను విజయనగరాంతఃపురమునందలి చింతామణీమందిరముకడ నంతగాఁ బ్రకాశము నొద

పించుట లేదు. కారణ మాచుట్టుప్రక్కల జీమూతములవలె వ్యాపిరి చియున్న తరుచ్ఛాయలై యుండును. పవనదేవుఁడు మందమందముగఁ బ్రచారము లొనరించుచున్నను బ్రకృతి యంతయు నిశ్చైతన్యమై యుండెను. నిద్రించుమనుజుని యుచ్ఛ్వాసనిశ్వాసము లాతని నెంత చైతన్యయుక్తముగ నుంచునో యట్లే ప్రకృతి జీవచిహ్నము లున్నను గమనించుటకు వీలగునంత చైతన్యము లేదు. అప్పుడప్పుడు నిద్రించు నాతఁడు దేహోమకాటునకో యవయవచలనముఁ జేయునట్లు—గాలి రివ్వున వీచి తరుశాఖలలో నొకటిరెంటిని గదల్చిచల్లారుచుండెను. పట్టణమునందలి ఘటికాయంత్రాలయములనుండి యప్పుడే పదునెనిమిది గంటలు కొట్టిరి. సంపూర్ణముగ వికసించినబొండుమల్లియలు, పారిజాతములు, చంద్రకాంతములు, మున్నగుపుష్పములనుండి పరిమళములు బయలువెడలి వాతావరణ మంతయు సురభిళముగఁ జేయుచుండెను. చింతామణీమందిరప్రాంతము లన్నియుఁ బరిమళవంతములై యుండెను. అంతఃపురమున నున్నకావలివాండ్రు కొందఱు కూరుచుండియుఁ గొందఱు నిలువఁబడియుఁ, గొందఱు గోడలకుఁ జేరగిలియుఁ గునుకుచుండిరి. దీపకాంతులు క్రమక్రమముగాఁ దగ్గిపోవుచుండెను.

అగాధాంధకారమున నొకవ్యక్తియెట్లో రాయలయంతఃపురప్రవేశ మొనర్చెను. అతఁడు మెల్లగ నాచింతామణీ మందిరముకడకు వచ్చి తలుపు త్రోసెను. అది తాళముచే బంధింపఁ బడియుంటఁ దన మొలనుండి యొకబీగము తీసి తలుపుఁ దెఱచి, యావ్యక్తి లోనికిఁ బ్రవేశించి, చెకుముకి రాల్చి తన యొద్దనున్న మైనపువత్తిని వెలిఁగించెను. ఆతనిముఖమున నొకవస్త్రము వ్యాపించి యుంట వ్యక్తి యెవ్వరో తెలియుటలేదు. మఱియునాతఁ డాదీపసాహాయ్యమున నందు రాయలు రచియించినపటమును జూచి దీపమార్పెను. బయట వృక్షముపై నొకఘూక మరచి యెగిరిపోయెను. దానికిఁ బ్రత్యుత్తరముగఁ

గాఁబోలు మఱియొకటి విక్రుతముగఁ గావుకేకలతో నరచుచు దాని వెంట నెగిరిపోయిన ట్లలుకు డయ్యెను.

ఇంతలో నెవ్వరో వచ్చి యాతని వెనుకప్రాటున నిలువఁబడి కరతలమును జల్లగఁ దాఁకిన ట్లాతఁడు గ్రహించెను. ఇరువురుభటు లావ్యక్తిని బట్టుకొని యీవల కీడ్చిరి. వ్యక్తి నిర్భయముగఁ దాళము వైచెను. భటు లాతనివింతచర్యకు భయాశ్చర్యముల నొందుచు, రాయలు లేచునను భయమున నానొంగినుగుఱించి కేకలు వైవకయే యాతని దూరమునఁగలయంతః పురరక్షకునికడకుఁ దీసికొనిపోయిరి. అంతఃపురరక్షకుఁ డాతనికడ కొకదీపమును దెచ్చెను. ఆతనివదనమును బరికింప నాతఁడు తిమ్మరుసు. అందఱు భయమునొందిరి.

అప్పుడు తిమ్మరు సంతఃపురరక్షకుని చెవిలో నెద్దియో చెప్పి క్రింద కు వేడలిపోయెను. ద్వారరక్షకుఁడు లేచి నిలువఁబడి మంత్రికి వందన ము చేసెను. ‘‘మంచిది! కావలియం దప్రమత్తులై యుండుఁడు! ఏది! నేఁబోవునప్పుడిచ్చిన వస్తుచయము!" అని తిమ్మరుసు తనవస్తులను గర వాలమును దీసికొని వెడలిపోవుచుండెను. భటు లందఱు నాతనివింతచర్య లెఱిఁగినవారగుట నాశ్చర్య మొందక పోయినను భయము నొందిరి.

అంతఃపురద్వారమును గడచి తిమ్మరుసు ~ కృష్ణ యొక్క విహారమందిరమునకుఁ బోయెను. ఆమందిరము సుధాధవళితుద్యాయు తమై సమోన్నతమై విరాజిల్లుచుండును. రాయలిచ్చవచ్చినప్పు డందుఁ బ్రవేశించి సుఖకాలక్షేపము చేయుచుండును. విద్వద్గోష్ఠి సలుపుచు రాయ లందొకప్పుడు నెలకొలఁది నివసించును. ఆమందిరమునకుఁ గ్రిందిభాగమునఁ బరరాష్ట్రములకును, సరిహద్దులఁగల యల్లరజాతుల వారికిని సంబంధించిన కార్యాలోచనమున కనువగు నుద్యోగులును గాఁగితములు నుండును. అప్పటికిఁ బహతమ్రముగ నెంచఁబడు వారా యణ యాగ్యము లగుగ్రంథ వాఙ్ము లన్నియు వానుక ననుసరించి

తాళపత్రములపై వ్రాయుచుండినను రాజకీయము లగువ్యవహారము లన్నియుఁ గాగితములపై జరుగుచుండెను. అప్పటికే కొండపల్లిలోను కాగితములును, బుడతకీచుల (Portuguese) దేశమునుండి కొత్తగ వచ్చునీలిగోవా కాగితములును వాడుకలోనికి వచ్చుచుండెను. కాగితము లరుదై ప్రియమగుట నెల్లవారలు నింకను గాగితముల నుపయోగించుట లేదు. ఈమందిరమున కించుకదూరమున రాయలవారి గూఢచారుల కార్యస్థానముండెను ఆర్యావర్తమునందు రాజు ప్రజాభిప్రాయమును దెలిసికొనుటకును, శత్రుసామంతరాజులకుట్రల భేదించుటకును విరివిగఁ జారుల నుపయోగించుట పురాణకాలమునుండియు వాడుకఁ గలదు. రాష్ట్రపరిపాలనమునకు ముఖ్యసాధకులగు గూఢచారులు రాయలకాలమున నత్యున్నతస్థానమును వహించియుండిరి. అధికవేతనములతో గూఢచారులపై శ్యాముసే రాయు లేర్పఱచి, యందుఁ బలువురున్నతోద్యోగుల నియమించెను. దక్షిణహిందూస్థానమునందలి వార్తలన్నియుఁ బ్రతిదినమును దెలిసికొనుచుండుట రాయలవంటిసార్వభౌమునికి విధాయకమగుట నీశాఖయందు దక్షినిపుణులును బుద్ధిశాలురు నగుగూఢచారుల నెందఱనో యూరనిరాజ్యమున నుంచుకొనెను.

తిమ్మరుసు విహారమందిరప్రవేశ మొనరించి పైయంతస్తుమీఁద నున్నయొకవిశాలప్రదేశమునకుఁ బోయి యచ్చటఁ బఱచియున్న కంబళముపై నాసీనుఁడై యోజించెను. అతఁడొకటి రెండుగడియ లా చీఁకటిలోఁ గూరుచుండి, తన కొక భృత్యుని బిలిచి గూఢచారాధిపతిని దీసికొని రమ్మని చెప్పెను. ఆభటుఁ డొకగాజుగోళమునం దున్న సుగంధతైలదీపికను ముట్టించి చారాధిపతిని దీసికొని వచ్చుటకుఁ బోయెను. ఉచితకాలమున నాతఁ డటకు వచ్చి మంత్రియాజ్ఞ నాతని కించుకదూరమునఁ గూరుచుండెను.

"నీవతినిపుణు లగుచారుల నియమించి, దేశమందున్న సాంప

ర్యవతు లగురాజకన్యల రూపపటములఁ దెప్పింపవలయును. సౌందర్యరాశి యగుపటమునందలికన్నియ చౌళుకీన — కాని విజయా! నీవానాఁడు గజపతితనూజాతపటమని పంపితి వది యెచ్చట నున్నది ?" అని తిమ్మరుసు నడిగెను.

విజయుఁడు స్మృతి నభినయించి " చిత్రము ! అది దేవరకడనే విడిచిపెట్టితిని." అని బదులు పలికెను. పిమ్మట తిమ్మరుసు సాతనిఁ జిత్రపటసంగ్రహణము పదునుదినములలోఁ బూర్తికావలెనని చెప్పి పంపివేసెను. కొంతవడికిఁ దిమ్మరుసు తలపంకించి " ప్రత్యుత్తమక్షత్రియరాజ్యమున నీచిక్కు పోలేదు. నరసింహదేవరాయలు నాగాంబను విడిచి యొకవత్సరము గడపుటయు, సవతితోఁ బంతము నైచి యామె యోడిపోవుటవలన నాయుమాసములు పేరునకు దాసియగుటయు, శత్రుప్రవృత్తిభానుని ప్రకాశమున కోర్వఁజాలక కుటిలురైచుటయు నీవివాహమున కాటంకములుగ నున్నవి. సుక్షత్రియులగుసాగివారిబిడ్డ యగునాగాంబికాపుత్రుని కీకళంకమువలనఁ గొన్నిచిక్కులు తటస్థించుచున్నవి. ఒకమనుజుని మంచివాఁడని ప్రఖ్యాతి నొందుట కష్టము కాని, దుష్టవంశజుఁ డనిగాని, వ్యభిచారి యనిగాని, దొంగయనిగాని, తార్పుఁబోతనిగాని సులభముగఁ బ్రకటింపవచ్చును. దుర్వార్త జలముపైఁ దైలబిందువువలె రక్తముచెరచిన శరీరముపైఁ దామరవలె నిట్టె ప్రాఁకిపోవును. కానిమ్ము! విజయనగరసార్వభౌమునిపైఁ గలిగినవింతవార్తలనే ఛేదింపలేమా ? కాని—యొక్కటి భయ మగుచున్నది. వ్యాసకాళిదాసాదిమహాకవులకీర్తి కనూయపడి శత్రువులు ప్రబంధజేసినదుర్వార్త లిప్పటికిని శిలాక్షరములవలె సముద్రములగుశాసనములవలె నిలిచిపోయినవి. అట్లయీవార్త—రాఁగలవానినిగ్గుతించి యిప్పటినుండియుఁ గలతపడినఁ బ్రయోజన మేమి ? జ్ఞప్తియున్నది. బహుశః గజపతితనూజాత యైయుండును. పటమునందలికాంతక విన్న

యమైనచో నిప్పటి వివాహవిషయము విచారింపనగును. ప్రభాత మగుచున్నది. అదిగో కోడికూత!" అని తిమ్మరుసు లేచి వెడలిపో యెను. సేవకుఁడు దీపమార్పెను. ఇఁక నచ్చట నేమున్నది? మహా మంత్రిగారు లేనిదే యామందిరమునఁ బ్రభాతకాంతులైనఁ బ్రవేశింప వీలు లేదు.

---

## పదవ ప్రకరణము.

—o—

### సరసాలాపము.

"అవును! నాటకముల ననుసరించి ప్రబంధములు వ్రాసియుం డిరి. పినవీరన్నగారి శృంగారశాకుంతలమును, నికేవుల రచియింపఁబడిన ప్రబోధచంద్రోదయము నందులకుఁ దార్కాణములు!" అని పెద్దన పదునాల్గువత్సరములవయస్సు గల భట్టుమూర్తితో ననెను.

"చిత్రము! తామకూడ నట్లే—" అని భట్టుమూర్తియను చుండ నడ్డము వచ్చి

"అట్లుకాదు. రాయలవారికి వస్తువు ప్రాచీనమైనను, పురాణ గాథల నెత్తి విపులముగఁ బ్రబంధశైలి ననుకరించుట సమంజస మని యభిప్రాయము. ఇప్పుడు ప్రబంధములే వన్నెఁగాంచుచున్నవి. ఇం దుఁ గవికి స్వేచ్ఛ కలదు. శక్తియుక్తులఁ జూపుటకు భావప్రకటనము, రసప్రకటనముఁ జేయుటకు, నిచ్చవచ్చినటుల స్వభావమును వర్ణించు టకు వీలు గలదు. కావుననే పురాణములు, యక్షగానములు, రగడ లు, ద్విపదలు మాని కవులందఱుఁ బ్రబంధములకై ప్రయత్నించు చున్నారు." అని పెద్దన్నగారు నుడివిరి.

"ఇదిగో ఆ కైదా ప్రబంధములకు రాయలవారు బహుమాన ములొసఁగిరి కాని యగ్రహారము లిప్పుడు లేదు." అని భట్టనెను.

"ఓయీ ! చెప్పుటతో సరియా ! ప్రబంధము వ్రాయుటయు నేగ భాషాంగీకరణమా ! ఉచితరీతిఁ దగుమాత్రము పెంచి నాయికానాయకగుణపోషణమున కవసరములగు పరిస్థితులఁ గల్పించుకొనవలయును. ఇదివఱకే నియమింపఁబడినపాత్రల యథార్థస్వభావములఁ బ్రకటింపవలయును." అని పెద్దన పలికెను.

"చిత్రము ! మీరెప్పుడు ముగింతురో ప్రబంధము ! ఆరెండాశ్వాసములు వ్రాసి యట్లే యుంచిరి." అని భట్టనెను.

"చూతమేఁడి! సూరన-" యని పెద్దనపలుకుచుండఁ గ్రొత్తతాటియాకులను గీయుటకొరకై కత్తిని దీసికొని యొక బాలుఁడటఁ బ్రవేశించెను.

"పిమ్మటఁ దాటియాకుల గీయవచ్చును. కేతనదశకుమార చరిత్రమును దీయుఁడు. భట్టూ ! సూరన్న నిన్నటిదినమున మేఘసందేశశ్లోకములను గాని పాణినిసూత్రములనుగాని యొప్పగింపలేదు. అమరముకూడ మఱచిపోవునేతఁ డేమిపనికివచ్చును." అని పెద్దనయనుచుండ-

"తాతగారూ! మీచేఁ దిట్లు దినుటకంటె—." యని ముఖము చిట్లించుకొనునాతని జూచి—

"పింగళివారిచిన్నవాఁడ వామాత్రము నుండవలసినదే! పెద్దయుఁ జిన్నయు లేదా? నిన్నగఱపుట తిట్టుటయా? చూడుము మాభట్టువానిని- ఎంతవిద్యాప్రియుఁడో—రాయలవారి వైణికునికడకుఁ బోయి సంగీతవిద్యకూడ నభివృద్ధిపఱచుకొనుచున్నాఁడు. మేమిట్లే చదువుకొంటిమా ? పిల్ల యెదిగినది. మా మనుమరాలాశువుగ నీపై నొక శతకముఁ జెప్పును. అందుదాని కంటెనైనఁ జోడిమి యుండవలదా ? రెండుముక్కలువచ్చిన రాయలకడ నేదైన నింతయుపయోగమని చూచుచుంటిని." అని పెద్దన యూరకుండెను.

"నాకంతదారిద్ర్యము లేదు. రాయలు మాతండ్రిగారి కొసఁగిన నిడమానూరగ్రహారమే చాలును. కాలిపైఁ గాలువైచికొని కూ

రుచుంచిన జరుగును." అని సూరన పలికెను.

"విద్య ధనార్జనమునకుఁ గాకపోయినను, రాయలనమ్ముఖవర్తన మునకు విద్యావ్యాసంగ మవసరము." అని పెద్దన యనెను.

భట్టు వికసిత నేత్రముల నీసంభాషణము వినుచుండెను.

"రాయలసమ్ముఖవర్తనము గౌరవాస్పదమే. దానికీ చిలుక పలుకులు బండవల్లెలు నవసరము లేదు." అని సూరన పలికెను.

"అవును! సహజకవితాధార కలపోతనామాత్యాదులవలెఁ బ్రతిభ యుండినఁ జాలును. కాని పాండితిలేనికవిత యాహ్వాదరణమునకుఁ దగియుండదు." అని పెద్దన పలికెను.

"స్వామీ! పాండితిలేనికవితప్రకాశించునా!" అని భట్టుమూర్తి యడిగెను.

పింగళిసూరన చిన్నతనపువెట్టియో — హేళనమో — వికవిక నవ్వుచుండెను.

"తాతగారూ! కవితకుఁ బాండితికి సంబంధములేదు. మీరు చెప్పినట్లు పోతనార్యునిభాగవతము గౌరవింపఁబడకపోవుట కాతనిపాండితికి లోటు కావచ్చును. కాని సహజప్రతిభ కలకవితయంను దుగుణముసే గ్రహింపవలయునుగాని గ్రంథకర్త యనుకశ్లోకముల నెల్ల వల్లెవేసెనా? నాటకాంతము గురుకులవాసము చేసెనా? అలంకారశాస్త్రమంతయు హస్తగత మై యుండెనా? అని విచారింపరు." అని మఱల నవ్వెను.

"తెలియనివానికైనఁ జెప్పవచ్చును. తెలిసినవానికైనఁ జెప్ప వచ్చును. తెలిసియుఁ దెలియనిమూర్ఖునితో నేమిచెప్పను." అని పెద్దన కోపపడెను.

అంతటసూరన గూర్గృహములోనికి వెడలిపోయెను. చాడి యుండునన్నతనబట్టలపెట్టెను దెమ్మని యత్త నడిగెను. అప్పు డాకవి

తంతు వదియేల ? నీవు పోయి తెమ్చుకొమ్మనెను. అతఁడు చిందులు ద్రొక్కుచు మఱలఁ జావడిలోనికి వచ్చి తనవస్త్రములఁ దీసికొను చుండెను.

"అబట్టలు తీయుచుంటివేల ?" అని పెద్దన యడిగెను.

"మాగ్రామము పోయి రావలెను." అని సూరన చెప్పెను.

"ఇంతమూర్ఖునకుఁ జదు వెట్లు వచ్చును ? స్వచ్ఛమైన నరం స్కృతపాండితి లేనినాఁ డీతనిమొగముఁ జూడను. ఓసీ! సూరనా! నీభార్యకడఁ గాళిదాసత్రయముఁ జదివి నన్నుఁ జూడరమ్ము!" అని పెద్దన హేళనము చేసెను.

ఇంతలో లోపలనుండి యత్తగారు "నాయనా! బాబయ్య గారిమాటలకు వ్యతిరేకింపకుము. బుద్ధి తెచ్చుకొనవలదా ? ఎన్నినాళ్లు చిన్నతనేము ! అఁదుదానవైన నిద్దఱుపిల్లలతల్లివై యుందువు." అని పలికెను.

సూరన కెంతయో కోపము వచ్చెను. మఱుమాటఁ జెప్పుటకు నాలుక తొణుకనంతయాగ్రహము వచ్చెను. ఆగ్రహము దుఃఖముగా మారిపోయెను. అతనికిఁ గంతస్ఫూర్తియైనపిమ్మట నాప్పటిలో నా తనికిఁదీసికొనవలసినవస్త్రాదికము లగపడ లేదు. అతఁడు దొడ్డిలోనికిఁ బోయి పెంకుటింటిపెణకపై నారఁబెట్టిన రెండు తాటియాకుగ్రంథము లను దీసికొనెను. అందొకటి యాతఁడప్పుడు రచియించిన చాటుపద్య మణిమంజరి. రెండవది గరుడపురాణము. అతఁడా రెండుగ్రంథములను దీసి పెరటిలోనున్ననూతిలోనికి విసరివైచెను. అతఁ డాదొడ్డిదారిని భోజనము చేయకయే వీథిలోనికి వచ్చి జనసమ్మర్దములగుమిడియనగర పురవీథుల నొందేని వెడలిపోయెను. అతఁడు పింగళి పోయియుండు నని వారనుకొనిరి. సూరనభార్య యీసంగతులు విని "అమ్మా! కృష్ణ వేణీతీరమునఁ గలపింగళిపోవలయునన్న సులభమా ? వారిని బోయి

తీసికొనిరమ్మని తాతతోఁ జెప్పుము." అని తల్లిని బ్రతిమాలుచుం డెను. ఆమెతల్లి తనతండ్రియగు పెద్దనతో నీసంగతులఁ జెప్పలేకపో యెను. ఏమైన నేమి ? సూరన రెండుమూఁడుదినములైన నింటికి రా లేదు. ఆతఁడు పోవుచు "అత్తింట నాలుగునెలలున్న నంబటిగట్టు లే గు" నన్నమాటలు సూరనభార్య వినెను. ఆమె మిగుల దుఃఖించెను. ఆమె బాలిక ! ఏమిచేయఁగలదప్పుడు ?

## ఆఱవ ప్రకరణము.

—— (o) ——

### కథకుఁడు.

గోదావరినదిమీఁద నుత్తరముగనున్న కళింగదేశమునకుఁ గజ పతినగరము ముఖ్యపట్టణము. ఆపట్టణము పెద్దకోటయు, దుర్గమ మగు పరిఘయుఁ గలిగి శత్రుదుర్గమ్మై యుండెను. ఆదేశమును గజపతి యనురాజు పాలించుచుండెను. ఒకనాఁ డాపట్టణమునందున్న పూట కూటింటియరఁగుపైఁ గొందఱుస్త్రీపురుషులు చేరి యుండిరి. వెన్నెల దినములగుటఁ గొందఱారుబైటఁ గూరుచుండియుండిరి. ఎవ్వరో నలువ దివత్సరములపురుషుఁడు దేశమునం దప్పటికి ననుశ్రుతముగ వచ్చుచు న్నకాశీమజిలీలలో నియొకకథ చెప్పుచుండెను. అరఁగుపై నాముదపు దీపము వెలుఁగుచుండెను. రాత్రి యేడెనిమిదిగడియలు దాటియుండు టచేఁ బట్టణమంతయు మాటుమణఁగుచుండెను. కథ చెప్పునప్పుడచ్చ టనున్నవృద్ధుఁడొక్కఁడు దూఁకొట్టుచుండెను. కథయం దొకరాజకొమ రిత వర్ణింపఁబడుచుండెను. ఆమె మిక్కిలిసౌందర్యవంతురాలనియు నం తటిరూపవతి యీభూలోకమున దుర్లభయనియు రంభాద్యప్సరోంగ నామణు లామెపాదసేవకైనఁ దగమని సురలోకమునకుఁ బారిపోయి రనియుఁ గథకుఁడు యథాప్రకారోత్ప్రేక్షాలంకారాదులతో వినువారి వీనులకు విందుగఁ గథ చెప్పుచుండెను.

అప్పు డందున్న యువకుఁ డొకఁడు "మాయూరి రాజుగారి పుత్త్రి కంటె సుందరమైనవారు కలరా ?" అని ప్రశ్నించెను.

కథకుఁ డాగి "ఏమది నాయనా ?" అని యడిగెను. ఆ పడుచు వాఁడు మఱలఁ దన సందేహమును దెలుపఁ బలికెను. కొందఱు నవ్వి కథ సాగనిండనిరి.

"అట్లు కాదు ! బుద్ధిమంతుఁడు ప్రశ్నించినాఁడు. ప్రత్యుత్తరము చెప్పకుండ నుండుట మంచిది కాదు." అని కథకుఁ డాపడుచువాని వైపునకుఁ దిరిగి "నాయనా ! నేఁ జెప్పిన రాజకన్య సౌందర్యమున కెవ్వరస తే తీసిపోవుదురను మనుష్యాంగన లోకలెక్కనా ?" అనెను.

"అట్లనుటకు వీలు లేదు. మీ యూరి రాజకన్యను జూచిన నట్లనను." అని యాపడుచు వాఁడనెను.

"అట్లయినచో మన మిరువురము నా కన్యను జూతము!" అని కథకుఁ డనెను.

"రాజబాలికను జూచుట యెట్లు?" అని సభికులలోఁ గొందఱు కథ ననుసరింపు మనిరి.

"రూపపటమును జూచినఁ జాలదా ?" అని యువకుఁ డనెను.

"నీవు హృదయమున నా కన్యచిత్రపటమును సంపాదింపుము" అని కథకుఁ డనెను.

"చిత్రపట మేలకవచ్చునా ? మాయూరి ఘంటనిచ్చినవాని కేఁబదివరాల నిచ్చినచో నా బాలికరూపమును దిలకింప నగును. నేనచ్చటఁ జూచితిని." అని యువకుఁ డనెను.

"మంచిది. ఉదయమున మనము మాటలాడుదము." అని కథకుఁడు కథ ననుగమించెను,

అందొక వీరాగ్రేసరుఁ డగు బాలకుఁడు చేసిన సాహస కార్యములును, పామొకటి మూతని బాల్యమునఁ దేనెపెంకువుల నోటఁబడునట్లు

చేసి కాపాడుటయు, వేఁటకువచ్చిన రాజాబాలకుని దీసికొనిపోయి పెంచుకొనుటయు, రాజ్యహీనుఁడైన యాతఁ డాబాలకుని దెచ్చినప్పటినుండియు ననేక రాజ్యముల కధికారి యగుటయు, బాలకుని కైదేండ్లు దాఁటిన వెంటనే సౌందర్యరాశి యగుకన్నియను బెండ్లియాడి యెత్తుకొనివచ్చుటయు, మామగారి రాజ్యమున నాకన్యకుఁ బుట్టినపుత్రునికిఁ బట్టాభిషేక మొనరించుటయుఁ గొద్దిమార్పులతో నాబాలకుఁ డట్లేసుమా రాఱువేలమందిభార్యలకు మగఁడై సుఖముగఁ దండ్రిమరణానంతరము రాజ్యమేలుటయు దివ్యగమనములు దివ్యదృష్టులు పరకాయప్రవేశము లాదిగాఁగల సమస్తకలాకుశలుఁడగు నారాజాఱువేలయొకటవసారి మఱలఁ బుత్రినిగనుటయుఁ గథ కంచికి వెళ్లుటయు, మేమింటికివచ్చుటయు నాదిగాఁగల సర్వవృత్తాంతములఁ బూసగ్రుచ్చినట్లు కథ చెప్పి ముగించెను. సభ్యులందఱు లేచి తమతమయిండ్లకుఁ బోవయత్నించుచుండిరి. చల్లగాలికి నిద్రపోయిన సంతానముల లేపుకొని స్త్రీలు రేపి బాబుగారుండి మఱియొకకథ చెప్పిన బాగుగనుండుననియు, మాయుప్రపంచ మనియు, మహారాజు లనియుఁ, జెప్పుకొనుచుఁ దమకుఁ దోఁచినట్లు విమర్శించుకొనుచు నందఱు నిండ్లకుఁబోయిరి. మహారాజపుత్రిక సౌందర్యవతి యని చెప్పినయువకునితోఁ గథకుఁ డుదయమున రమ్మని చెప్పి పూఁటకూటింటియవ్వ యమర్చిన ప్రక్కపైఁ బరుండఁ బోయెను.

మరుచటిదిన ముదయమున యువకుఁడు కథకునికడకు వచ్చెను. ఆతఁ డింకను లేవలేదని పూఁటకూటింటియవ్వ చెప్ప రాత్రి కొందఱు పామరజనులు "ఈబాబు దేయూరో? రెండుకీర్తనలు పాడఁగలరేమొ?" అని యడిగిన సర్వసాధారణ ప్రశ్నములు స్మృతికిరా నాతఁడు నీకథకునివాసస్థాన మేదియై యుండునని యూరక కూరుచుండునప్పు డొదవుపని లేని యర్థముమాలినయాలోచనములఁ జేయుచుఁ గూరుచుం

చెను. ఇంతలో నాకథకుఁడు లేచి వచ్చి యువకునిఁజూచి సంతసించి యూరుబైటి కాతనితోఁ గలసి పోయెను. వారిరువురును గొలనియావలకుఁ బోయి కాలకృత్యముల నెఱవేర్చుకొనిన పిమ్మటఁ బిచ్చయుఁ బాటియు మాటలాడుకొనుచుఁ బట్టణములోనికి వచ్చి ముచ్చియింటికిఁ బోయిరి.

అప్పుడు యువకుఁడు నవ్వుచు రామలింగమునుజూచి "అన్నా! మిత్రులు వచ్చినారు. ఎచ్చటకుఁ బోవుచున్నావు! కూరుచుండుము." అని యడిగెను.

"నక్కపల్లిబొమ్మలా? అవి మేమమ్మము. అంగడిలోనికిఁ బొండు!" అని యాచెవిటిరామలింగ మనెను.

"అది కాదు. కూరుచుండుము." అని యువకుఁ డనుచుండ

"వానిధరలా? మాకుఁ దెలియదు. మేము గిలకలబద్దలు చేయుట మానితిమి. విల్లమ్ములఁ జేయుట కిప్పుడు మాతమ్ముఁ డూర లేఁడు." అని రామలింగ మనెను.

కథకుఁడు నవ్వ నాఁపుకొని "అయ్యా! మేము విండ్ల కొఱకు రాలేదు." అని గట్టిగా నఱచెను.

"ఇండ్లద్దెకు దొరకుట బహుకష్టము. మాయింటఁజోటులేదు." అని రామలింగ మనెను.

ఇఁకఁ గార్యము లేదని యువకుఁడు లోనికరిగి యాతని భార్యను బిలిచెను. అప్పు డొకబాలిక యావలకు వచ్చి "ఏమ"ని యడిగెను.

యువకుఁ డామెతోఁ జెప్పి రాజబాలికపటమును దెప్పించెను. రామలింగ మదిచూచి "మనకొంప మునుఁగును. ఇది యెందులకు?" అని యడిగెను.

"ఏఁబదివరా లిత్తును. చూచి మఱల రహస్యముగఁ దెచ్చెద" నని యువకుఁ డనెను.

"అమ్మా! అట్లు వీలు లేదు. మా యమ్మను బిలిచెద నుండుఁడు" అని బాలిక లోనికిఁ బోవుచుండ

"అత్యాచారితము కాదు. రాజుగారి పెద్దకూఁతురిది." అని రామలింగ మనెను.

"నానత్తి!" అని యువకుఁడు లోనికిఁ బోయెను. మఱిరెయుక పాలికకడియులో రామలింగము భార్య కేఁబది వరాల నిచ్చి యాపటము నతఁడు నత్రుముగ జెప్పి యువకుఁడు వలకుఁ దీసికొనివచ్చి కథకుని రమ్మని తీసికొనిపోయెను.

"రాజుగారి సెలవైనది కాఁబోలు" అని రామలింగ మనుకొనుచు నంగడికిఁ బోయెను.

---

## ఏడవ ప్రకరణము.

ఇదిమఱల స్వప్నము కాదుగద!

"బాబుగా రీదినమున సెలవిత్తు మనిరి. దేశము నందలి ప్రబల శత్రువుల నందఱ జయించి విజయలక్ష్మీ కటాక్షవీక్షణ చంద్రికల విహరించు ప్రభువుగా రర్ధాంగిని గైకొనకుండుట ప్రజలకు సంతోషదాయకము కాదు." అని తిమ్మరుసు రాయలవారితో విహారమందిరమునఁ బ్రసంగించుచుండెను.

"అప్పాజీ! ప్రస్తుతము వివాహము చేసికొనునిచ్ఛ లేదు. మన మాలోచించిన విజయయాత్రకుఁ బిమ్మట యోజింప నగును." అని రాయలనెను.

"ప్రభువువా రట్లు సెలవిచ్చుట ధర్మము కాదు. విజయయాత్రకును బోవచ్చును—" అని తిమ్మరుసనెను.

"ఇంత తొందరగ నిప్పుడు వివాహము కాకుండిన నేమి?" అని రాయ లడిగెను.

"అయ్యో! ఇప్పటికిని దొందర యనుచుంటిరా? దేశమునం గలవిప్లవ మీకారణమునం బ్రబలుచున్నది. దేవరవారు త్రిమతుల్రి యువకాంతలు జనింపలేదనియు నందువలన నేత్రప్రియుండును తనబాలిక నిచ్చుటకంగీకరించుటలేమి వివాహ మిట్లాగిపోవుచున్న దనియుం బ్రజలందఱు దొకవదంతి వ్యాపించుచున్నది. అది మనరాష్ట్రాభివృద్ధికి క్షేమకరము కాదు." అని తిమ్మరుసనెను.

"ఈశత్రువుల ప్రవాదమునకు భయము నొందవలయునా? కాని యట్టిపలుగాకుల శిక్షింపవచ్చును." అని రాయలనుచుండఁ దిమ్మరుసు నవ్వుచు "లోకమును మూయఁగలమా?" అని పలికెను.

"కాని యప్పాజీ! మనోహారిణి యగుకన్య దొరకనిపట్ల ప్రవాదములకు భయపడుటది యిష్టములేనికొంత నెట్లు పరిణయము కాఁగలము." అని రాయ లనెను.

"బాబూ! మీరట్లు సందేహింపవలసినది లేదు. మీకిష్టమైన యాబాలికామణి యెవ్వరో—విజయనగర సామ్రాజ్య మహాలక్ష్మికేమహాశ్రీమంతురాలు సోదరి కావలసియున్న దో—ఆ యదృష్టవంతురా లెవ్వరో—సెలవైనచో నొకటిరెండుమాసములలో దేవరవారికిఁ బరిణయ మొనరింతును." అని తిమ్మరుసనెను. "అప్పాజీ! మీబుద్ధి విశేషమునం గాఁగల కార్యముల వంటిది కాదు. ఇది మానవశక్తులకు మించినకార్యము." అని రాయ లనెను.

"బాబుగా రప్సరోంగనలఁ బ్రేమించుచుంటిరా?" అని తిమ్మరుసు నవ్వుచుండెను.

"అప్పాజీ! నేను ప్రేమించుకన్య లభించుటదుర్లభము." అని రాయ లనెను.

"మీరొకకన్యను ప్రేమించుచుండినయెడల మనము ప్రయత్నించినచో నసాధ్యము కాదు. ఆకన్యయెవరు." అని తిమ్మరుసనెను.

" ఆకన్య యెవరో తెలియదు." అని రాయలనెను.

" తెలియనికన్యను ప్రేమించుట యెట్లు ? ఆధార ముండవలయును " అని తిమ్మరుసనెను

" అప్పాజీ ! దాపరిక మేల? మీకడ రహస్యముగనుంచినలాభ మేమి? నేను స్వప్నమునం దొకకన్యను గని ప్రేమించితిని." అని రాయలనెను.

" ఉషాకన్య యనిరుద్ధునివలె !" అని తిమ్మరు సనెను.

" అవును. ఇంచుక భేదమున్నది. అప్పాజీ చిత్రరేఖ కావలెను." అని రాయలనెను.

" ప్రభువుగారియాజ్ఞ యైనచోఁ దిమ్మరుసు చిత్రలేఖ కాఁదగి యున్నాఁడు. మనభరతఖండమునందలి ప్రభుపుత్రికలపటములన్నియు దేవర పరిశీలింపవలెను." అని తిమ్మరుసనెను.

" నేను చూచినకన్య యథార్థరూపమును బటమున లిఖయించితిని." అని రాయలనెను.

" చిత్తము ! మీరు స్వప్నమునఁ గనినకన్యరూపపటము నాకడఁ గలదు." అని తిమ్మరుసనెను.

" మీరారూపపటమును జూపఁగలిగినచో మీయాజ్ఞననుసరించి నేనాకన్యను వివాహమాడెదను. కాని —" అని రాయలాగెను.

" కాని యేమి ? మీకాపటమును జూపుట నాపని. మంచిది." అని తిమ్మరుసు సేవకుని బిలిచెను. ఆతనితో నాతఁ డేదియో చెప్పి పంపి " బాబుగారు స్వప్నమునఁ గనినకన్యకంటె సౌందర్యవతి యగు మఱియొకకన్య యుండినఁ జాలదా ?" అని తిమ్మరుసడిగెను.

" పెద్దలు. మీ రెఱుఁగనివిషయము మేమికలదు ? నేనాకన్యను స్వప్నమునఁ గనుటయే దైవికము. మఱియు సౌందర్య మొక్కటియే మనము కోరఁదగినదా ? ఇంతకు నేను స్వప్నమునఁ జూచినకన్యపట

ముసు మీరు చూపుట యెట్లు ?" అని రాయలడిగెను.

" మీరు చిత్తగించి మీమంత్రిశక్తి యుపాకన్యకసాయపమున ర్చినచిత్రరేఖ ప్రజ్ఞతోఁ బోల్చి చూచెదరుగాక!" అని తిమ్మరుసనెను.

" ఈకార్యము మనుష్యశక్తికి మించినది. నేను నమ్మజాలను." అని రాయ లనుచుండ నొకపటమును దీసికొని తిమ్మరుసంపిన సేవకుఁ డరుదెంచెను.

అంతట దిమ్మరు సాపటమును దీసికొని రాయలువామభాగము ననున్నయొకసువర్ణమయపీఠముపై నుంచెను. పటమునకు వస్త్ర మాచ్ఛాదింపఁబడి యుండెను. పీఠముపై నుంచినపిమ్మటఁ దిమ్మరుసు " దేవరవారు వాగ్దానమును నిలుపుకొని, యీపటమునందలికన్య దేవరస్వప్నమునఁ జూచినకన్యయేయైనచోఁ దప్పక కడుశీఘ్రకాలమున వివాహమున కంగీకరింపవలయును." అనెను.

"సందేహ మేల? కాని మీరు నాస్వప్నమునుగుఱించియే యెఱుఁగనిసమయమున నందు నేఁజూచినకన్యను పటమునఁజూపుట దుర్ఘటము. ఈపటము మఱియొకసుందరబాలికది కావచ్చును." అని రాయలనెను.

" తినఁబోవుచు రుచి యడుగ నేల ? స్వయముగఁ జిత్తగింపనగును." అని తిమ్మరుసనెను.

"ఇది నిజముగ నాకన్యరూపపటమే యైనయెడల మిమ్ముల దైవసములని యారాధింపవ—" అనుచు రాయలు పటముపైనున్న వస్త్రమును దొలఁగింప నటుచూచుచు నని యింకమాటలాడక యూఁగిపోయెను. రాయలకన్నులుమిరుమిట్లు గొలిపినట్లు చలించెను. "అప్పాజీ! ఇది మఱల స్వప్నముకాదుగద !" అని పలుకుచుఁ బటము నదేపనిగఁజూచెను. ఈపటమునందలికన్యరూపము చింతామణీభవనమునందలిరాయలురచియించిన పటమున కచ్చుగుద్దినట్లుండెను. ఈపటముక్రింద నాగరాక్షరములతో " తుఖారామ్ " అని లిఖియింపఁబడి

యుండెను. రాయ లది చదువుకొని "అప్పాజీ! మీకెట్లీరహస్యము తెలిసినది." అని యడిగెను.

"ప్రభువర్యా! చింతామణీమందిరమునందలిపటమున కిది ప్రతియని మీరెఱుఁగకపోరు." అని తిమ్మరుసన రాయ లాశ్చర్యముతోఁ దిమ్మరుసును జూచెను. తాను తప్పఁ బరులెవ్వరు చింతామణీభవనమునందలిపటముఁగూడ నెఱుఁగరని రాయలనమ్మకము.

అప్పుడు తిమ్మరుసు సాశ్చర్యమునొందుచున్న రాయలఁ జూచి "ప్రభువర్యా! మీ చింతామణీమందిరమునఁ గలపటమునంగలి నాతిఁ దెలియుటకంటె నేసికన్యగలదేశమును దెలిసికొని, యాపటమునిటకుఁ దెప్పించుటకు మీరాశ్చర్యమునొందవలసియున్నది. ఆప్రశంసయంతయు మనగూఢచారులకుఁ జెందవలసి యున్నది." అని తిమ్మరుసనెను.

పిమ్మట రాయ లడుగఁ దిమ్మరుసు నాపటము నెట్లుచూచినదియుఁ, బిమ్మటఁ గథకునిబంపి పటమును దెప్పించినయుపాయములను జెప్పెను.

"నగరమున మాసమ్ముఖమున నుండియు నప్పాజీ! మీరలొనరించినకార్య మాశ్చర్యజనకముగ నున్నది." అని రాయలనెను.

"నామనవి నాదరించి ప్రభువులు వివాహప్రయత్నముల కనుజ్ఞయిచ్చినచో నిఁకనానందజనకముగఁ గూడ నుండును" నినవ్వుచుఁ దిమ్మరుసనెను.

"నాకీరూపవటమునందుఁజూపినకన్య కలదనునమ్మకము లేదు. నేనామెను జూచినపిమ్మటఁ బరిణయము కావచ్చు" నని రాయలనుచుండ నాసమయమున కిరువురుభృత్యులు వచ్చి చారాధిపతికడనుండి యొకరహస్యలేఖను దెచ్చి తిమ్మరుసున కిచ్చిరి. అతఁడది చదివి "ప్రభువర్యా! గూఢచారమందిరమునకుఁ బోవలయును. విజయయాత్రాసంబంధములగు దేశములనుండి చారులు. బహుశీఘ్రముగ వినవలెను." అని తిమ్మరుసనెను. వారిరువు రాభవనముననే క్రిందియంతస్తునఁ గల రహస్యమందిరమునకు వెడలిపోయిరి.

## ఎనిమిదవ ప్రకరణము.

—(౦)—

### విజయయాత్ర.

అప్పుడు ప్రభాత మయ్యెను. అతివిశాలమును, రమణీయము నగు నావిజయనగర పురవరంబున జనులందఱును లేచి తమతమ కాలకృత్యంబుల నెఱవేర్చుకొనుచుండిరి. ఎప్పటివలెఁ బట్టణమునందలి రత్నరాసులయంగడులు తెఱచి బేరసారములకు బేరులు దిరుగుచుండిరి. పుష్పములు, ఫలములు, చిలుకలు, పక్షులు, భోజనపదార్థములు శాకములును జుట్టుపట్లఁగలపల్లెలనుండి బండ్లపైఁ బుటికలపైఁ గావిళ్లపై, నగరమునకుఁ జేరుచున్నవి. రాజకీయవ్యవహారములకొఱకు. వర్తకవ్యాపారములకు, సైన్యసామాగ్రి నందఁజేయుటకుఁగొలువునఁ జేరుటకు వేలకొలఁది జనము గుంపులుగుంపులుగ వచ్చియంతకుముందే తెఱచినకోటగుమ్మములకడ నుండి తాము ముందుఁబోవలయుఁ దాము ముందుఁబోవలయు నని యాత్రముతో నేగుచుండిరి. దధిఘృతక్షీరములఁ దట్టల నిడి తలలపై నుంచుకొని గొల్లపిల్లలు, వృద్ధులు నెందఱో వచ్చుచుండిరి. కమలమిత్రుఁడు కరకర లేచి తనసహస్రబాహువులను నెమలిపురివలె విప్పుచుండెను, వీథులలో వెండిబంగారునాణెములు, నవరత్నరాసులును ఫలములుల ప్రోవులవలెఁ బళ్లెరములఁ బోసి యమ్ముచున్నయాయంగడుల సొంపును, మృదులహస్త పద్మముల మనోహర పుష్పమాలిక నిడియమ్ము నాపుష్పలావికలను, శివకేశవాలయముల వెలువడుఘంటానినాదములను. భక్తుల కేకలను హారతిధూపధూమమును నొకకవి చూచినచో నాపట్టణము నమరావతితోడను నలకాపట్టణము తోడను బోల్చి మింటికంటిసౌధముల, నింగికంటు ధాన్యపురాసుల దారలఁ బరిహసించు రత్నరాసులను జేసి యొక ప్రబంధమునందుఁ గూర్చి పురవర్ణన మొనరింపవచ్చును. ఎంతయథార్థముగ వ్రాసినను

మనప్రబంధములయం దతిశయోక్తులని మనము తలంచున వన్నియు నింను రావలసివచ్చును. అసత్యములు వ్రాసిరని పలువురచే నిందనొం దకుండ నున్నది యున్నట్లు వ్రాయవలసినమే మానంశయం దేమిచే యులకును దోఁచక యిట్లు వ్రాయఁదలంచితిమి. పదిపండ్రెండుక్రోశ ములచతురము గలయొక గొప్పతటాకమునం దడవివలె నల్లుకొని పో యినతామరలు, హంసలు, పద్మములు, మత్స్యములు, నితరజలచర ముల నొక్కసారి చూచి వర్ణించుట యెంతకష్టమో, యాకొండల నడుమనున్న పట్టణమునుగుఱించి వ్రాయుట యంతకష్టముగ నుండెను. అటునిటుకదలుచున్న జనులెల్లరు నొక్కసారి యాగిన వివరముగ నన్నియును యథారీతి నింపఁ జిత్రించి యుందుము. తటాకమునన్ను వేలకొలఁదిపక్షులు చలింపక యుండనట్లే, యాపట్టణమునందలిజను లెల్ల రు నటునిటుఁ దిరుగుటమానరని యాపట్టణవర్ణనమును జరిత్రకారునకు వదలి మేమిట వ్రాయుట మానితిమి.

ఇంతలో నొకభేరీనినాదము వినఁబడెను. పురమెల్లడ నెందఱో దప్పులవాండ్రు బయలుదేరి "రాయలవారు నేఁటిదినము సాయంకా లము నాలుగుగడియలవేళఁ దురకలపై నుత్తరదిగ్విజయ యాత్రకుఁ బోవుదురు." అని చాటించుచుండిరి. పట్టణమునందలిజను లందఱు మ తింతకదలికతో నటునిటుఁ బోవుచుండిరి.

విల్లమ్ములఁ జేయుపనివాం డ్రెందఱో కట్టలుకట్టలు బండ్లపై వేయుచుండిరి. రంగురంగులగుడ్డలు, పట్టు, కంబళీలతోఁ జేయబడిన కుటీరసాధనముల నగరమాఎలకుఁ జేర్చుచుండిరి. గజములు, అశ్వము లు యుద్ధసామాగ్రిలతో వేలకొలఁది నగరమున కావలకుఁ బోవుచుం డెను. అమ్ములకుఁ బూయువిషకరండములు, అగ్నిగోళములు, మందు సామగ్రిలు, క్షీరములకు గోవులు, ధాన్యములు, ఫలములు, నగర మున నాఁబాలుపట్టణమున కావలకుఁ జేర్పఁబడుచుండెను. రణభేరులు,

ముఖవీణలు, సన్నాయిలు, బూరలు, బాకాలు, డోళ్లు వందలకొలఁది మనుజులూఁదుచు వాయించుచుఁ దీసికొనిపోవుచుండిరి. గజములపై, వృషభములపై ఢక్కాడమరుకధారు లగుమనుజులు పోవుచుండిరి. శంఖారావములు మిన్నుముట్టుచుండెను. తప్పెటలు' తాళములు, "గోహింసాపరులగు మహమ్మదీయమారణమహోత్సవ" మనుకేకలు! రక్తవస్త్రాంబరములు, రక్తపుష్పమాలికలువీరగంధధారణములు,ఆహాహా! ఎంతలో మారిపోయినది! పట్టణమంతయునెంతలోఁ గలవరము చెందినది! ఎంత యుత్సాహము! ఎన్నివేలమందిజనులు! ఏమని వర్ణింపము! సామాన్యముగ నుండునప్పుడే వర్ణనాతీతమనిపించిన యామహానగరము నీసమయమున నెట్లుండె నని చెప్పము ?

పుత్రుల దీవించి పంపువీరమాతలు, భర్తలఁ బూలమాలికల నలంకరించి పంపుపుణ్యస్త్రీలు, శూరులపై సేసలు, పుష్పములు చల్లు బ్రాహ్మణవనితలు—అంతయు నుత్సాహము !

ఈమహాకలకలములతో నగరమంతయుఁ దల్లక్రిందైనట్లుండెను. రెండుజాము లగునరికినగరబాహ్యప్రదేశమున నాపటకుటీరము లన్నియువినిర్మింపఁబడియున్నవి. వేలకొలఁదిబండ్లింకను సామగ్రులఁదెచ్చుచున్నవి. ఎచ్చటఁ దొందర లేదు. కలహము లేదు. పొరపాటు లేదు. అపాయము లేదు. విశాలము లయ్యుఁ గ్రిక్కిరిసినబాటల నాజన మేమి? ఆబండ్ల రాకపోక లేమి ? ఆనగరరక్షకులజాగరూకత యేమి ?

సాయంకాలము నాలుగు గడియల పొద్దువేళకు రెండువేల గజములదండు బయలువెడలెను. పిమ్మట నైదాఱువేలమంది కమ్మవా రశ్వములపై నుండిరి. రెడ్లు రాయలయంగరక్షకులై నడచుచుండిరి. మంత్రు లెందఱో—సేనానాయకు లెవ్వరో—దండనాథు లెవరో—తెలియుట లేదు. తుదకుఁ బదిపండ్రెండుగజము లుత్తమములగుహౌదాలలో నుత్తమాధికారుల నెక్కించుకొని కోటవెలుపలకు

వచ్చెను. వానివెనుకఁ గొందఱాశ్వికు లుండిరి. శ్వేతాతపత్రాది రాజచిహ్నములతో నాలుగేనుఁగులు వచ్చుచుండెను. వందిమాగధులు భట్రాజులు, విజయగీతములు, హెచ్చరికలు పాడుచుండిరి. తుద కందఱు "రాయలవారు వచ్చుచున్నారు!" అని లేచిరి. రాయ లెక్కిన గజము కోటవాఁకిటిసరికి రెండువేలఫిరంగు లొక్కసారి పేల్చిరి. ప్రజల చెవులు గింగురుమనిపోయినవి. గజాశ్వములుకాని, గోవృషభములుగాని బెదరక యెప్పటియట్ల నిశ్చలముగ నడచుచుండెను. ఆ సైన్యసముద్రమంతయుఁ బయటికి వెడలినను పట్టణమంతయు నిండుగనే యుండెను. తొణుకు లేదు. లోటు లేదు. వేసవియందు భానుఁడెంత ద్రావినను తరుగనిసముద్రమువలె నానగరతటాకమింకనుఁ దొట్టుకుతొట్టుకమను నిండేటివలె జనసంకీర్ణమై యెప్పటియట్లే యుండెను.

తుద కొకనడిమివయస్సు గలపురుషుఁ డొకపారశీకతురగము నెక్కి నగరరక్షకసైన్యములకు రాయలు చెప్పిపుత్తెంచిన వార్తలఁ జెప్పి వెడలిపోయెను. ఆపురుషునియుత్సాహము వర్ణనాతీతము! ఆకారము శత్రుభయంకరము. ప్రసన్నవదనమును, వింతమస్తులును ధరించిన యాతని నెవ్వరును బరిశీలనముగఁ జూచినఁగాని పోల్పఁజాలరు. కరమునఁ గరవాలము నెత్తి వాయువేగమున నశ్వమును వదలి రాయలగజమును సమీపించెను. ఆతఁడు తిమ్మరుసని ద్వారరక్షకులొకరితో నొకరు చెప్పుకొనిరి.

నిర్ణీతకాలమునకు సైస్యమంతయు నానిర్ణీతస్థానమునకుఁ జేరెను ఆనాఁ డాసైన్యమంతయు నక్కడనే యుండెను.

ఉత్తమపటకుటీరమును జేరినరాయలవారికి భృత్యులు సర్వోపచారములఁ జేయుటకు సిద్ధముగ నుండిరి. రాయ లందుఁ బ్రవేశించెను. మఱల ఫిరంగులు కాల్పఁబడెను. సైన్యపరీక్ష యొనరించి రాత్రికిఁ బయన మని తాఁకీదులు ప్రకటింపు మనిరి; లోటులేమియు లేకుండునట్లు

సైన్యమునకు వెనువెంట విజయనగరమునుండి యేదినమున కాదిన మాహారపదార్థములు, యుద్ధసామాగ్రిలు, వచ్చునేర్పాటులను జా ముడని యాయాయధికారులకు మఱల హెచ్చరికలంపబడెను. చిత్రమే మన ? ఆనమంత్రుమునఁ గూడ రాయలతోఁ గవులు, గ్రంథములతోఁ గూడఁబోవుచుండిరి.

ఆసైన్యమహాసముద్రమున నొకమూలనున్న పటకుటీరముకడ నుపచారాధ్యక్షుఁడు విడిసియుండెను.

ఆగుడారమున కేవల ముఫ్వురుసైనికులు కూరుచుండిరి. వారి ట్లు మాటలాడుకొనుచుండిరి.

ప్రథ—మొదలే రాయలకు విజయయాత్రయం దభిలాష కలదఁట.

ద్వితీ—కాకోయి ! మొన్నఁ జారులు వచ్చిరి.

తృతీ—వారేమి చెప్పకొనిరి ?

ప్రథ—నీతిగాఁడు చెప్పినాఁడురా !

ద్వితీ—నేను విజయదేవరాయలకడ నుండువాఁడను కదా ! అధ్యక్షునికంటె నితరుల కెక్కువ తెలియునా ?

ప్రథ—కాదులే ! చెప్పరా !

ద్వితీ—భోజనానంతరము మాటలాడుకొనవచ్చును.

తృతీ—ఇంకను గంట కాలేదు.

ద్వితీ—పరాకులు చెప్పినారా ?

ప్రథ—లేదు.

ద్వితీ—అబ్బ ! నాభార్య వదలిపెట్టినది కాదురా ? రాయుల వారికడ సెలవు తీసికొమ్మనెను. తురకచీరలు కొల్లగొట్టి తెచ్చెదనని యొప్పించి వచ్చితిని. పుట్టినింటికిఁ బోవునులే !

ప్రథ—ఇప్పుడా ప్రసంగ మేల? తప్పించుకొనక నిజముచెప్పరా

ద్వితీ— అబ్బ ! ఏమున్నది ? కాలము కర్మముఁ గూడివచ్చినది తురకలకు !

ప్రభ—అది యెట్లు ?

ద్వితీ—నీవన్నది నిజమే ! నేఁ జెప్పినదియు నిజమే !

ప్రభ—అనఁగ ?

ద్వితీ—పోఁదలఁచుకొన్న రాయల కిదివఱకు వంక దొరకలేదు. ఇప్పుడు తురకరాజు లిద్దఱును అమదునగరపువారితోఁ గలిసినారఁట ! ముగ్గురుఁ గలసి గజపతికి రాయబారమంపి యాతనికొంపముంచినారఁట!

ప్రభ—ముగ్గురు కాదు పదునార్వురు కలిసి వచ్చినా—రాయలవారిని జయింపఁ జాలరు.

ద్వితీ—అది నిజమే లే—పాండ్యరాజులకడఁ జూడలేదా ! కాని యిందు—గజపతి నేమిచేయుదురో—

"ఏమి చేయుదురా ? బుద్ధిహీనులారా ! అంతవడిగ మాటలాడుకొనుచుఁ జారధర్మములను విడిచినమిమ్ములను నేను దన్నినటులు రాయ లాతని దన్నును. ఛీ! లెండు. నోట నువ్వుగింజ నానని మీరా చారవృత్తికిఁ బనికివచ్చువారు ? పొండు!" అని చారాధ్యక్షుఁ డనెను.

తిమ్మరుసువారో—మఱియొకరో—పరీక్షకు వచ్చియుందురనియో—ప్రయోజనాంతర మేమియుండునో యనియో—వారు ముప్వురు దుస్తులఁ బఱచి యొకటికి నేలపైఁ బరుండి నిద్రనభినయించిరి. ఇంతలో భోజనములకు గంట యయ్యెను. దూరమునుండి గుఱ్ఱపువానివేషమునఁ దిమ్మరుసుపోవుచుండెను. ఓరకంట నాచారు లాతని దూరమునఁ జూచి కదలక మెదలక పడియుండిరి. 'భోజనములు గాకుండ సైనికులు నిద్రింపరాదు' అని గంభీరముగ వినఁబడెను. అందఱు నప్పుడు లేచి భోజనములకుఁ బోయిరి.

---

# తొమ్మిదవ ప్రకరణము.

## అన్వేషణము.

మిక్కిలి భయంకరమైనయరణ్యము. అందు నది రాత్రిభాగము. మబ్బు క్రమ్మియుండుటచేఁ జీకటి సాంద్రమై యుండెను. ఇరుప్రక్కల రెండుకొండ లున్నతములై భయంకరములై యుండెను. సృగాలము లొకటివెంబడి మఱియొకటి వికృతముగ నఱచుచుండెను. అప్పు డాదారి నొకబండి పోవుచుండెను. బండివాఁడు త్వరగ దగ్గఱనున్నపల్లెఁ జేరవలయు నని యెద్దులను హెచ్చరించుచుండెను. ఆదారిని దొంగలభయ మధికముగ నుండెను. అప్పుడప్పుడు దూరమున మేఘములు మెఱయుచుండెను. ఆబండియం దొకబాలిక యున్నది. పది పదాఱువత్సరములవయస్సు మీరి యుండదు. వెంట నొకవృద్ధుఁడు- ఇంకను షష్టిపూర్తి యైయుండదు. చేత నొకకఱ్ఱ పొడుచుకొనుచు రామకీర్తనలుపాడుచు నాంజనేయదండకములఁ జదువుచు బండివానిని హెచ్చరించుచుఁ గ్రింద నడచి బండివెనుక వచ్చుచుండెను.

"తాతా! రాయలవారు విజయయాత్రకుఁ బోయి మాసముదినము లైనట్లున్నది?" అని బండియందున్న బాలిక యడిగెను.

"ఆహా! మహమ్మదీయుల సంపూర్ణముగ నోడించినారు. ఇదిగో! ఇచ్చట కరయామడదూరముననే యుద్ధము జరిగినది. మూడు రాజ్యములవారిని హోరెత్తఁ గొట్టినారు." అని వృద్ధుఁ డనెను.

"బాబూ! గోలుకొండనవాబు గొప్పవాఁడని వాడుకపడి యుండెను. బాబూ! కూరలబండ్లు తోలుకొనిపోయినప్పుడు చూచినాము. రాయలవారిసైన్యములోఁ బెమ్మసాని లింగయ్యగారంట! బాబూ! కమ్మదొరలనాయకుఁడు—రాయలపక్షమునఁ జేసినయుద్ధము బాబూ! చూడఁ గన్నులు లేవు. ఏమి యుద్ధమండి! మూవార "లాబాణము

లుపడి చచ్చిపోవుదువు; ఫిరంగిగుండ్లు వర్షము కురిసినట్లు కురియు" నని భయపెట్టినారు కాని బాబూ! యుద్ధము చూడవలెనని కోరలు దోలుకొని వెళ్లినాము కరణముగారంపగా! బాబూ! ఏమియుద్ధమండీ!" అని బండివాఁ డొకమహోపన్యాసము చేసెను.

బాలిక యానందముతో వినుచుండెను. వృద్ధుఁ డూకొట్టుచు "వెంకటస్వామీ! తురక లేమాత్రముజన మున్నారోయి?" అని యడిగెను.

"జనమా! జనమేమి? ఇసుక వైచిన రాలదు. మనవారికంటె నెక్కువ లేరు. అయిన నేమి! కృష్ణకీవల కడుగుపెట్ట నీయలేదు. తురుకలు! టోపీలు పారవైచుకొని, తుపాకులు విడిచిపెట్టి, గుఱ్ఱములను త్రిప్పలేక—యురికి పాఱిపోయినారు. పారిపోవువారిని గొట్టఁగూడదని రాయలవారియానట కాని బాబూ—లేకపోయినఁదురకపురుగు లేకుండ—బల్లెములనుగ్రుచ్చి పారవేయక పోయినారా మనవారు!" అని బండివాఁ డుత్సాహముతో వర్ణించుచుండెను.

బండి రాళ్లపై ఖటఖటధ్వనులతోఁ బోవుచునే యుండెను. బండివాఁడు కృష్ణరాయనిసైనికుల ధైర్యోత్సాహములను, యుద్ధవిశేషములను జెప్పుచునే యుండెను. మబ్బు పట్టుచుండుటచే వర్షము వచ్చు ననుభయమున బండి త్వరగఁ దోలుమని వృద్ధుఁడు బండివానిని హెచ్చరించుచుండెను. తుదకు వారికొక కూఁతవేటుదూరమున నొక దీపపువెలుతురు చెట్లమాటున మిణుకుమిణుకుమనుచు నగపడెను. అదియే పింగళిగ్రామ మని బండివాఁ డనెను. త్వరగ నాయూరుజేరుదు మని బాలిక యుత్సాహముతో నాదీపమువైపునకుఁ జూచెను. పొలమునుండి యాలస్యముగఁ బోవుచున్నయొకరిద్దఱుకర్షకు లాబండిని గలిసికొనిరి. వారు దొంగ లని వృద్ధుఁడు భయముఁ జెందెను. "మీదే యూర" ని బండివాఁడు వారలఁ బ్రశ్నింపఁ బింగళి యని వారుత్తర

మొసంగి బండి దేగ్రామమో తెలిసికొని బండివెంట వారును నడచి వచ్చుచుండిరి. వృద్ధుఁడు కొంతవడికి ధైర్యముఁ జెంది ''పింగళియమ రయ్యగారింట నందఱుఁగుశలమా?" అని వారల నడిగెను.

''చిత్త" మని కర్షకులు బదులు పలికిరి.

పిమ్మట ''బాబూ! వారు మీకు బంధుగులా ?" అని కర్షకు లడిగిరి.

''అవును; ఈ బాలిక వారికోడలు —" అని వృద్ధుఁడనెను.

''బాబూ! ఆసూరయ్యబాబుగారి పెండ్లమా ? అమ్మగారు— సీతామహాలక్ష్మి" అని కర్షకు లుత్సాహముతో నడిగి మన బాటసారులబందుగులఁ దామెఱిఁగియున్న సంతసమును వెలిబుచ్చుచుండిరి.

ఇటులు పల్లెటూరికర్షకులు తమగ్రామములో నేరిబంధుగులు వచ్చినను సర్వసాధారణముగ నుత్సాహముతో నొనరించు సర్వసాధారణ ప్రసంగములతో వారుగ్రామము కడకువచ్చిరి. నూతన విజయనగరమునుండి పింగళి వచ్చెనేమో తెలిసికొనవలయు నని బాలిక కడుగవలెనని కుతూహల ముండెను గాని యామెకుఁ గలసిగ్గాప్రశ్నము నడుగనిచ్చియుండ లేదు. బండి గ్రామముఁ జేరుటతోడనే కర్షకులు సెలవు తీసికొని వెడలిపోయిరి. బాలికమనస్సున వారి నా ప్రశ్నము నడుగఁ గుతూహల మినుమడించి యడుగఁదలంచియు నడుగలేదు. బండివాఁడు తాను పోవలసినగృహ మెచ్చట నని పోవుచున్న కర్షకుల నడిగినప్రశ్నములును, వారుచెప్పిన యానవాళ్లును, బాలిక చెవులఁ బడినను, పాప మామె కామాటలు వినఁబడ లేదు.

ఇంతలో బండి యాఁగెను. గుమ్మములో మాటలాడుచున్న వితంతువు లిరువురు ప్రసంగమాపి యేయూరి దీబండి యని యడుగఁ దలఁచి నిలువఁబడిరి. బండినుండి బాలిక దిగెను, ఒక వితంతువు లోనికిఁ బోయి యామూదపుదీపము నెగసనఁద్రోసి గుమ్మముస కీవలకుఁ

దెచ్చుచుండెను. వృద్ధుఁడును బాలికయు గుమ్మములోనికిఁ బోయిరి. వృద్ధుఁడు పెద్దనగారి పెదతండ్రికొడుకగు ముసలిరామయ్యతాత యనియు, బాలిక తనకోడ లనియు వితంతువు తెలిసికొని, బాలిక చేయి పట్టుకొని లోనికిఁ దీసికొనిపోయెను. కొంతవడి కావితంతువు కన్నుల నీరు పెట్టుకొని యేడువఁజొచ్చెను. వచ్చినవారిరువురును దెల్లపోయిరి. "అమ్మా! ఏమియీవెఱ్ఱి!" అని తాతగా రామెయేడ్పుటకుఁ గలకారణ మెఱుఁగకయే యోదార్చెను. "మానూరన్నతండ్రి కాశికి లేచిపోయినాఁడు నాయనా! తాతగారాఁడుదానికివచ్చినచమ్మవైన రాదని యాక్షేపించిరట! నాయనా! ఈయెదిగినపిల్లమాట యేమి?" అని వితంతువు బాలికను కౌఁగిలించుకొనెను. బాలిక యాలోచన మెచ్చుటకుఁ బోయినది? ఆమెయుఁ గంటఁదడివెట్టిన ట్లాదీపపుఁ గాంతులు వెల్లడి చేసెను.

కావడిపెట్టె యొకటి తీసికొని గుమ్మములోనికి బండివాఁడు వచ్చెను. "అందఱు క్షేమమా? ఎప్పుడు బయలుదేరినారు? మనవాళ్లెక్కడ నున్నారు? సుందరిపుట్టినింటికిఁ బోయినదా? ఆఱునెలలనుంచి కబురు తెలియుట లేదు." అనుసర్వబంధుసహజము లగుప్రశ్నోత్తరములు యథాపద్ధిగ జరుగుచుండెను. కన్నుల నీరుపెట్టుకొని బంధుమర్యాద లొనరించుస్త్రీలస్థితి పైవారికిఁ గొంచము నవ్వును గలిగింపక పోదు.

లోపలనున్న స్త్రీపురుషు లందఱు నీవలకు వచ్చిరి. రాత్రి యైనది. అన్నయ్యా! కాళ్లుకడుగుకొనుడు" అని యొకరనిరి. వారందఱు లోనికిఁ బోయిరి.



# పదియవ ప్రకరణము.

## భేదతంత్రము.

కళింగరాష్ట్రపరిసరారణ్యము లతిదుర్గమములు, క్రూరజంతు సంకీర్ణములు నై యుండెను. మనుజు లొక్కరొక్కరు పోవుటకే దారు లుండవు. లావుగఁ బెరిగినయడవిజాతిచెట్ల కల్లుకొనినపట్టుగలతీఁగ లు, ముండ్లపొదలు మృగములకుఁగూడ నొక్కొక్కచోట దుర్భేద్య ములై యుంట నాయడవులు కళింగ రాజ్యమునకుఁ బెట్టనికోటలై యుండును.

ఈయరణ్యములను భేదించుకొని మార్గము లేర్పఱచుకొని రా యల సైన్యము లిప్పుడు గజపతినగరమున కించుకదూరమునఁ బటకు టీరముల వినిర్మించుకొని విడిసి యుండెను, కారణాంతరములచే మఱి యొకచిన్నసైన్యమును దీసికొని తిమ్మరుసింకొకవైపునకుఁ బోయియుం డుటచే రాయలే స్వయముగ నీసైన్యము నిట్లీరాష్ట్రముపైకిఁ దీసికొని వచ్చెను. మహమ్మదీయరాష్ట్రములమూటిని జయించినపిమ్మట రా యలునుతిమ్మరుసును వేఱుపడిరి. రాయ లీదేశమువైపులఁ గలస్థితి గతుల నెన్నఁ డెఱుఁగకయుండుటచే నరణ్యము దుర్భేద్యమయ్యుఁ జ లింపక మార్గ మేర్పఱచుకొని వచ్చి గజపతినగరము ముట్టడించుటకు సిద్ధముగ నుండెను. వెనుకనుండి వచ్చునాహారపదార్థములు రాకుండ గజపతిమిత్రు లగుపదార్గుపాత్రులను మాండలికప్రభు లేకమైవచ్చి గజపతిరాజునకు బాసటయై, దారులు గట్టిరి. మహమ్మదీయులకు సాయమొనర్చుటకు వేగునడపిన గజపతిరాజుపై రాయలు కినిసి యి టులు దాడివెడలి వచ్చెను. కాని ప్రబలశత్రు వగురాయల నెదిరించు పాటిమగటిమి లేని గజపతిపదార్గుపాత్రులఁ బిలిపించి వారివారి సైన్య ములతో రండని కోరుటచే నిప్పుడు గజపతిరాజుబలము ప్రబలతర మయ్యెను. తిమ్మరుసు లేకయుండుటచేత, రాజును. సైన్యములోఁ గొం

తభాగము మహమ్మదీయయుద్ధమునందు మడసియుండుటచేతను, కొంతసైన్యము తిమ్మరుసుతోఁ బోయియుండుటచేతను, సైనికులును, నిరుత్సాహముఁ జెందియుండిరి. రాయలు స్వయముగ నడపుచు, బలగములకుఁ బ్రోత్సాహము నొసఁగుచుండుటచే నింతవఱకు సైన్యమునందు నిరుత్సాహ మగపడుట లేదు. రెండుమూడు దినములనుండి వీరేర్పఱచుకొనివచ్చిన సన్నిమార్గము కట్టువడుటచే నాహారపదార్థములు లేక వారు కొంచెము చిక్కుపడుచుండిరి. "చేయి కాలినపిమ్మట వస్త్రముఁ బట్టినట్లు వచ్చెన" ని రాయలుఁ దొందరగ జరపినదానికిఁ బశ్చాత్తాప మొందకపోయినను, ముందుస్థితి భయావహమైయుండెను. వెనుకమార్గములు కట్టుపడినట్లు సైన్యమునకుఁ దెలిసిన గొప్పచిక్కు! ఈసందిగ్ధావస్థయందు మఱల నెట్లో దారుఁ జేసికొని తిమ్మరుసటకు రావలయునని రాయలు కోరుచుండెను. ఆతఁడు వచ్చువఱకు ముట్టడి కాజ్ఞనొసఁగ లేదు. విలుకాండ్రు నాయుధధారుల నరణ్యమంతట వేలకొలఁది గజపతి నిలిపి యుంచినట్లు రాయలవేగులవాండ్రు చెప్పిరి. ఏమిచేయుటకుఁ దోఁచదు.

ఇంతలోఁ దిమ్మరుసెట్లో సైన్యముతో రాయలఁజేరెను. వారిరువురు నాలోచించుకొనిరి. తిమ్మరుసు భేదోపాయమునఁ గాని కార్యము కాదని రాయలతోఁ జెప్పెను. ఎట్లైనఁ గార్యసిద్ధి కావలయునని రాయ లనెను.

"సరియే! రేపుసాయంకాలమునకు గజపతి దేవరవారిపాదములకడ నుందును." అని తిమ్మరుసనెను.

"అది నిజమే! ఇందాపఱునార్గురుపాత్రులుఁ జేరకుండిన నట్లే! మనకు స్థలపరిచయము లేదు. సైన్యము లలసియున్నవి. పాత్రులన హాయశూరు లని వేగులవాండ్రనిరి. ఈవిజయయాత్రయందు విజయనగరరాజ్యమునకు ప్రతిష్ఠ వచ్చిన —" అని రాయలనుచుండ

"ఏమిది? దేవరవా రెన్నఁడు లేనిదిట్లు మాటలాడుచుండి రేమి? సింహకిశోరము వణఁకుచున్న దేమి? కుంజరయూథ మెంతయుండిన నేమి? అని తిమ్మరుసనెను.

"భయముచేత మాటలాడుట లేదు. శత్రుసైనికులు మన కగపడరు. మనభటులు నిష్కారణముగ మరణముఁ జెందుట నాకిష్టము లేదు. మఱియు నాహారములే రాకుండిన మనము చేయునదేమి? ఈఘోరవిపినములోనికి విజయనగరమునుండి నూతనసైన్యముల నైనఁ దెప్పింప వీలు కాన్పింపదు. అందువలన నప్పాజీతో నాలోచింపకుండఁ జేసినయీతొందరపని మనకు హానియు నపకీర్తియుఁ దెచ్చునేమో యని సందియము కలిగి మాటలాడితిని." అని రాయ లనెను.

"దేవర యట్లు తలంప నక్కఱలేదు. తాము చేసినకార్యము నేనొనర్చినట్లు కాదా?" అని తిమ్మరు సనెను.

"ఇంతవఱకు నెన్నఁడు నేకముకానిపదార్గురుమాండలికప్రభువు లేకమౌటయు నించుక యోజింపవలసినదే!" అని రాయలనెను.

"రాజసేవాపరాయణులు నుక్కుతునియలు నగుమనసైనికుల ముందర వారెన్నివే లుండిన నేమి? కాని దేవర చెప్పినదియు నిజమే! మనసైన్యములు డస్సియున్నవి. ఎదిరిబలమెఱుఁగకుండ నెదిరించుట పరాక్రమము కానేరదు. ఈమధ్య గజపతిరాజు గౌతమీజలస్నానమునకుఁ బోవఁ గొండలపైఁ దాఁగియున్న మహమ్మదీయసైనికులు పందలకొలఁది వచ్చి ముట్టడించిరి. అప్పు డీపాత్రులలో నల్వు రుండి శత్రువుల నందఱ నురుమాడి రాజును గాపాడిరి. వారిబలపరాక్రమములు ప్రశంసనార్హములే! ప్రస్తుతావస్థ ననుసరించి యుద్ధమువలన మనకు జయము పొసఁగుదారి గాన్పింపదు. చిత్తము! తాము నిద్రింపుఁడు! నేను మఱల వచ్చెద న"ని తిమ్మరుసు లేచిబయటికి వచ్చెను.

అచ్చట కొక బ్రాహ్మణుఁడు వచ్చి సైనికులకు సాముద్రికము

చెప్పుచుండెను. తిమ్మరుసు సాతని బిలిచి
" విజయా ! కాగితములు తెప్పింపు మ" నెను. ఆబ్రాహ్మణుఁడు తమవిజయుఁడే యగుటఁ జూచి వారందఱు తెల్లఁబోయిరి. " ఆతఁ డెంతసులభముగ వేషము మార్చెను." అని వారనుకొనిరి. తిమ్మరుసు సాతనితో నెద్దియో రహస్యముగ మాటలాడెను. పిమ్మట మంత్రి లేఖకులఁ బిలిపించి పదాఱులేఖల వ్రాయించెను. పిమ్మట మంత్రి భటులఁ బిలువ నంపి, విలువగలదుస్తులపెట్టెల నాలేఖల నుంచి " ఇవి తీసికొనిపోయి శత్రుసేనాధ్యక్షులగుపదాఱుగురుపాత్రులకు రహస్యముగ నిచ్చిరండు. పొండ" ని బహిరంగముగఁ జెప్పి, విజయునికి సైగఁజేసి వెడలి పోయెను. విజయుఁడును వారలతో నెద్దియోచెప్పుచు వారివెంటఁ బోయెను. వారందఱును గజపతిరాజుశిబిరముకడనుండి పోవుటకు దారితీసిరి.

---

## పదునొకండవ ప్రకరణము.

—(o)—

### విజయము.

తిమ్మరుసు పదార్గురుపాత్రుల కంపినబహుమానములఁ దీసికొనిపోవుభటులను గజపతిభృత్యులు పట్టుకొని తమయేలికకడకుఁ దీసికొని పోయిరి. గజపతి వారుపట్టుకొనిపోవుచున్నపెట్టెలఁ దీయించి చూడ నందు బహుమానములును లేఖలును గాన్పించెను. గజపతి లేఖలఁ దీయించి చదివించుకొనెను. ఆలేఖలయం దిట్లున్నది.

* సీ. శ్రీమతుకర్ణాట । సింహాసనాధ్యక్షుఁ
డగుకృష్ణరాయధ । రాధినాథు
డలపదాఱుగురుపా । త్రులకుసంప్రీతిఁబం
పినను లేఖంబులు । మిమ్ము మునుపు

---

* కుమారధూర్జటి కృష్ణరాయవిజయమునుండి.

గజపతిరాష్ట్రదు ॥ ర్గవిశేషములనుండి
మెలపుగాఁబలికిన ॥ పలుకుబడుల
తీరువ్రాసితిరిమీ ॥ కోరినట్లనెఘనా
భరణదుకూలముల్ ॥ బంపినార

తే. మట్లనేరేపుజగడాని ॥ కరుగుదెంచి
నట్లుచనుదెంచిమాచేతి ॥ కతనిమీరు
పట్టియిచ్చినయపుడెమీ ॥ పట్లమేము
కొదవపడకుండనడిపించు ॥ కొనెదమెపుడు."

తనమిత్రులగుపాత్రులు రాయలలంచముల కాశపడి తన్నుఁ బట్టి యిచ్చుట కంగీకరించిన ట్లందు లిఖయింపఁబడియుండుట నాతఁడు చూచెను. "కటకటా! ఎంతద్రోహముచేసిరి! మిత్రులను నమ్మరాద" నిగజపతిరా జెంతయు దుఃఖించి యాతఁ డుచితపరివారముతో బయలుదేరి కోటలోనిస్త్రీజనమును విడిచి పారిపోయెను. నాయకుఁడు లేనియుద్ధ మెట్లని పాత్రులును, సైనికులును నిరుత్సాహముఁజెంది, రాయలకీర్తి వినియున్నవారు కావున భయపడి వెడలిపోయిరి. అప్పుడు రాయలసైన్యములు గజపతిరాజ్యము నాక్రమించుకొనెను. పిమ్మటఁ దిమ్మరుసు తానొనర్చినభేదతంత్రవిజయమున కుప్పొంగుచు, గజపతి రాజునకు వర్తమాన మంపెను. ఆతని కేమియు నపకార మొనర్పకుండ నాతనిరాజ్య మాతనికిచ్చి యాతనిరాయలసామంతుఁగా నొనర్చి, కాపాడుదు మని తిమ్మరుసు చెప్పి పుత్తెంచెను. రాయలధార్మికబుద్ధి నెఱిఁగినవాఁ డగుటను, శరణుఁజొచ్చినవారినిరక్షించు నని తెలిసినవాఁ డగుటను, గజపతి తుట్టతుద కంగీకరించి రాయలదర్శనమునకువచ్చెను. ఆసందర్శనసమయమున రాయలు చూపినమరియాదలకు గజపతి సంతసించి, తనరాజ్యమునంతను దిరిగి యిచ్చివేసినరాయలకు కృతజ్ఞుఁడై గజపతిరాజు, రాయలకును దనతనూజాతను బెండ్లియాడి

సఖ్యము నెఱపుమని ప్రార్థించెను. తిమ్మరసు నరిదులకు సంతోషపూర్వకముగ నంగీకరించెను.

అప్పుడు రాజు లొకచీటిని వ్రాసి తిమ్మరుసయ్యకు రహస్యముగ నందించెను. అం దిట్లున్నది, "స్వప్నమునఁ జూచినకన్య యుండ మఱల నీ వివాహ మేల?"

అందులకుఁ దిమ్మరుసు నవ్వి "తినఁబోవుచు రుచియేల?" అని మఱల వ్రాసి యిచ్చెను.

తిమ్మరుసు గజపతికన్యను రాయలు వివాహమాడుట కంగీకరించినట్లు మంత్రి చెప్పివేసెను.

తదనంతరము గజపతిరాజు, రాయలకడ సెలవుతీసికొని వెడలి పోయెను.

అప్పుడు రాయలు "అప్పాజీ! ఎందుల కీవివాహము" మనెను.

"ప్రభువుగారు స్వప్నమునఁ జూచినబాలిక గజపతికన్యయే!" అని తిమ్మరు సనెను.

"అది మేము నమ్మఁజాలము. స్వయముగ మేము చూడవలయును." అని రాయలనెను.

"చిత్తమట్లే!" అని తిమ్మరు సనెను. వారిరువురును సైన్యపరీతులై వెడలిపోయిరి.

గజపతిరాజు రాయలసెలవు తీసికొనిపోటకుఁ జేరి బాలికను రాయల కిచ్చి వివాహ మొనర్చుటకు వలయుప్రయత్నములఁ జేయుచుండెను. అప్పుడాతనిపుత్రుఁడు గజపతిం జేరి యిటులు మాటలాడఁ జొచ్చెను.

తండ్రీ! తాము రాయలతో సంధి గావించినందుల కెంతయు సంతసించితిమి. మీరాయనయెడఁ గృతజ్ఞులై ధనకనకవస్తువాహనంబు లెన్నియైన నర్పణముఁ జేసి యుండవలసినది. కాని—" అనుచుండ

"మేమిప్పుడు చేసినపనియం దేమితప్పు కలదు? 'కాని' యేమి?" అని గజపతి యడిగెను.

"ఉత్తమక్షత్రియసంజాత యగు మన బాలికాకులాభరణమణిని రాయుల కొసంగునట్లు సంధి చేసికొనుట బంధులోకమున కెంతయుఁ గష్టముగాను—" అనుచుండ

"మేము చేయునది లేదు. వాగ్దానము చేసితిమి. అట్టిసాప్వభాగముఁ దప్పుడగుటకంటెఁ గావలసినది లేదు. ఉత్తమ క్షత్రియుఁడు మాటమాత్రము తిరుగవచ్చునా? మఱియు రాయలు క్షత్రియుఁడు కాఁడనుటకుఁ బ్రజాపవాదము తప్ప మఱి యాధారములు లేవు. ఆమహామహుని ముఖలక్షణములును, శత్రునృపుల యెడఁ జూపుకరుణయు సంధిసమయముల నుండవలసిన మరియాదలను జూచినవారెవఁడు హీనకులజుఁ డనరు. ఉత్తమక్షత్రియునకే కాని యట్టిగుణసంపత్తుండుట దుర్లభము. మఱియు నెవ్వరియదృష్టమెట్లున్నదో యట్లు జరిగి తీరవలయును." అని గజపతి యనెను.

"చిత్తము! ఇదివఱలో నొకసారి రాయలవారిని మన రాజ్యాంగములయందు ముఖ్యాధికారి హీనకులజుఁడని నిందించెను. అది వారికి వేగుదెలిసినది. అందా వేగులవాండ్రు మీరే రాయలవారిని నిందించునట్లు చెప్పియుండిరట! కావుననే యీదండయాత్ర సంభవించినది. ఇట్టివిషయమున మీరిట్లు సంధి చేయుట మంచిది కాదు—" అని యాతనికొడు కనెను.

"అది యెంతయు విషాదకరము! రాయల నట్లు మన యుద్యోగులలో నొకరు నిందించుట తప్పు! కావుననే మనపై దండయాత్ర వెలువడుటలో రాయ లన్యాయ మొనర్పలేదు. పూజ్యులగు రాయలవారియెడ మనము కావించిన యపరాధ పరిహారముగ మన బాలిక నాయనకిచ్చి పరిణయమొనరించుట మంచిది! ఏమైనను వివాహము జరిగి తీరవలయును." అని గజపతి యనెను.

"మీ యంతరాత్మకు వ్యతిరేకముగ—కుటుంబ గౌరవమునకు భంగకరముగ—అంతఃపురవాసుల యంతరంగములకు విరుద్ధముగ—మీ వివాహ మొనరించినచో మిగుల దోసఁగులగును. నామనవి నాదరించి మఱియొకవిధముగ సంధి నడుపుఁడు." అని గజపతిపుత్రుఁ డనెను.

"అట్లొనర్ప వీలులేదు. పరులమాటలు మాకేల? ఇందు నా యంతరాత్మకు వ్యతిరేక మేమియు లేదు. మనరాజ్యమైనఁ బోవుట కంగీకరింపవచ్చును. కాని మనబాలికను సార్వభౌమున కీయక మానవలదు. సత్యపథమును వీడవచ్చునా?" అని గజపతి యనెను.

"అవమానింపఁబడియున్న రాయలవలన మీ బాలిక సౌఖ్యము నొందదు ఆమెకు దుస్తరము లగుబాధల నొదవించిన వా రగుదురు." అని గజపతిసుతుఁ డనెను.

"అవమానము కన్యనిచ్చి పోఁగొట్టఁదలంచి యుంటిమి. ఎవ్వరును మఱుమాట పలుకవలదు. ఆమెయదృష్టమును బాలించులోకనాథుఁ డగుజగన్నాథమూర్తి మనపాలిటఁ గలఁడు. చక్రవర్తుకుఁ డగువాతఁ డామెకు సుఖజీవితము నొసంగునుగాక! ఇట్టిభయముఁ గల్పించుటవలన గజపతులు మృషావాదులు కానేరరు. మీ రందఱకు మై వివాహము సర్వశుభములతోఁ గొనసాగునట్లు మాకు సాయపడుఁడు." అని గజపతి యనుమంతఁ నొకభృత్యుఁడు ప్రవేశించి తిమ్మరుసయ్యవారిచ్చిరని యొకలేఖ నిచ్చెను. అందిట్లున్నది.

"శ్రీమన్మహామండలేశ్వర రాజపరమేశ్వరకళింగాధీశ్వర గజపతి రాయలవారిని సార్వభౌమమూరురాయరగండ రాజాధిరాజశ్రీ కృష్ణరాయప్రధానమంత్రిశేఖరసాళువతిమ్మరుసయ్యవారు సకలైశ్వర్యమనోవాంఛితఫలసిద్ధిగా దీవించి వ్రాయించి యంపిన లేఖ —

అఖిలకర్ణాటాంధ్ర రాజ్యమునకు భవిష్యత్పట్ట మహిషియగు మాజననిని దర్శించు వేడుక గలదు. నేఁటిదిన మిరువది నాలుగుగడియ

లకు శుభసమయము. అప్పటికి లగ్ననిశ్చయమునకుఁ బ్రధానమునకువచ్చెదము. అప్పటికే సర్వముసిద్ధముగ నుండవలయునని కోరుచున్నాము,

చిత్తగింపుఁడు.

సాళువతిమ్మరుసయ్య వ్రాలు."

ఈ లేఖను జూచుటతోడనే గజపతిపుత్త్రున కాగ్రహమువచ్చెను. మీరట్లంగీకరింప వీలులేదని వాదించెను. సత్యవ్రత నిరతుఁడగు గజపతి పుత్త్రుఁ డెంత చెప్పినను వినకయుండుటఁజూచి యాతఁడు కోప ఘూర్ణితనేత్రములతో వెడలిపోయెను.

తిమ్మరుసయ్యవారిని మధ్యాహ్నముచితకాలమున రావచ్చునని బదులులేఖ వ్రాయించి పంపి, గజపతి తత్సన్నాహమును జేయుచుండెను. తిమ్మరుసయ్యవారికిఁ బ్రధానమహోత్సవ సమయమున నీయవలసిన కానుకలు, రత్నహారములు, సేలువలు నన్నియు సమకూర్చుటకు మంత్రుల కాజ్ఞయొసఁగెను. తుఖారమణీమణి నలంకరింపుఁడని యంతఃపురములోనికి వార్తనంపెను.



## పండ్రెండవ ప్రకరణము.

—— (౧) ——

పరిణయమహోత్సవము.

"అవును. మనము వెంటనే వివాహ మాచరింపవలయును. మీరు ప్రధానమహోత్సవమునకు వలసినవన్నియు సిద్ధముగనుంచినారా?" అని తిమ్మరుసయ్యవారు గజపతికోటయందొక చక్కనిచావడిలోఁ గూరుచుండితనప్రక్కను గూరుచుండినయాతనితో ననుచుండెను. ఆతనివేషమునుబట్టి చూడ నా రెండవయాతఁడు పురోహితుఁడై యుండు నని తోఁచును. "చిత్తము! సర్వము సిద్ధముగ నున్నవి!" అని యాబ్రాహ్మణుఁడు సేలువను సవరించుకొని చేతనున్న తాటియాకులపుస్తకము నట నుంచెను.

ఇంతలో నాచాపడిలోని యొకభృత్యుఁడు ప్రవేశించి గజపతిరాజుగారు నూజాకను జూడ లోనికి రావచ్చునని చెప్పెను. «మాభవిష్యత్పట్టమహిషిని జూచినపిమ్మటనే ప్రధానము జరుగవచ్చును. సరియే! మాకోరిక ననుసరించి యేర్పాటు లొనరించిరా? లెండు! పోయిచూచి వత్తము." అని తిమ్మరుసు బ్రాహ్మణుని హెచ్చరించెను. వారిరువురు నంతఃపురమునకుఁ బోయిరి.

అచ్చట నొకపీఠ ముండెను. ఇరువురు వచ్చుటఁ జూచి దాసి యొకర్తు తెరచాటునుండి తొంగిచూచి మఱియొకపీఠమును దెచ్చివైచెను. వారిరువురుఁ గూరుచుండిరి.

«రాయలవారిజన్మపత్రమును బరిశీలనముగఁ జూచినారా?" అని తిమ్మరుస నెను.

«చిత్తము! ముహూర్తము చక్కగఁ గుదిరినది. జన్మలగ్నమునకును ముహూర్తలగ్నమునకును చక్కనిగ్రహసంపత్తు కలిగినది. ఈముహూర్తబలము—" అని బ్రాహ్మణుఁ డనుచుండఁ దెరచాటునుండి పరిచారికల యాభరణములధ్వని యయ్యెను. బాలిక వచ్చుచుండె నని బ్రాహ్మణుఁ డటు చూచెను. లోపల నవ్వు వినఁబడెను.

«రాయలవారు—" అని తిమ్మరుసు సనుచుండఁ దెర నొకదాసి యొత్తిగించెను.

అప్పుడా రంగమునకుఁ గృష్ణరాయఁడు స్వప్నమునఁ దిలకించి పటమున లిఖయించినరూపమున కించుకంతయైన భేదము లేని స్వర్ణప్రతిమనుబోలు బాలిక, చిఱునగవుతో నవనతవదనముతో దాసియొకతె నడపింప నీలమేఘమునుండి దళుక్కున మెఱయు విద్యుల్లతవలెఁ దెర దాఁటి వచ్చెను. తిమ్మరుసయ్యవారు బాలికను జూచి యామెనమస్కరింప సంతసించి దీవించిరి.

ఇంతలో దాసి పురోహితునిహస్తము నలంకరించియున్న పచ్చల

కడియమును జూచి బాలికకు స్వాగ చేసెను. తుళువమణీమణి గిరు క్కున మఱలెను.

అంతఃపురమునఁ దెరచాటున "అవును!" "సరిగఁ జూడుఁడు" "నేనెఱుఁగనా?" "పురోహితుల కట్టికడియము లుండఁగూడదా?" "కాదాతఁడు రాయలే!" "వంటయింటికిఁ దేలు" సేవకుల ద్వారము మూయుఁడనుడు!" అను గుసగుసలు, కేకలు తొందరగ నను కొనుట వినఁబడుచుండెను.

"ప్రస్థానసమయమునఁ దేవలసిన బాకును దేలేదా?" అని తిమ్మరుసు పురోహితునిపైఁ గోపపడుచుఁ గేక వైచెను. పురోహితుఁడు లేచి "తెచ్చెదన" ని క్రిందకు దిగుచుండెను.

"ఆచార విరుద్ధముగ బాకును దేలేదఁట! వీరలనేమిచేయవలెను! ఆస్థానమునఁ గూరుచుండి సొమ్ము్మను దినుటకా? ప్రభువుగారి కార్యము లయం దంతవ్రమత్తతయా? అగ్రహారము లనుభవించుటకా? స్తుతి వాక్యములఁ బలుకుటకా?" అనుచు నాతని వెనువెంట నడచుచు వచ్చుచుండెను.

వారిరువురును గోటదాఁటి యావలఁ బడిరి. గజపతిరాజున కీసం గతి తెలిసి, యంతఃపురమున బ్రాహ్మణవేషధారి యగు రాయలు బట్టుటకుఁ జేసినప్రయత్నములను జూచి దురపిల్లెను. స్త్రీల నాలోచిత ముగఁ జేసినయాకుట్రవలన నేమి కొంప మునుఁగునో యని గజపతి భయముఁజెంది యపరాధము క్షమించి వివాహమునకు రమ్మని వార్త నంపెను. తిమ్మరుసు తుళువ వంశపురాజులకు బాకునకు బాసికము కట్టి వివాహ మొనర్చుట యాచార మని బదులు చెప్పెను. గజపతిరా జది మాఱియు మంచిదని సంతసమున నంగీకరించెను. తుదకట్లే వివాహ మొనర్చిరి.

వివాహానంతరము సుఖాకమణియు నొకదాసియు నంతఃపురమున నొకభవనమునఁ గూర్చుండి యుండిరి. అప్పుడే బాలిక కాదాసి మొగిలిపూలరేకులతో జడవైచి, తుమ్మెదరెక్కలవంటి శిరోజముల నాబాలికశరీరముతో సమముగుకాంతిగలవిగా మార్చుటకుఁ బ్రయత్నించెను. ఆమెకుఁ గస్తూరితిలకము నుంచుటకుఁ బ్రయత్నించుచుండెను. కురులకు మెఱుఁగిడు నప్పుడు వదనమునఁ దగిలిన తైలలేశము నొకతడిబట్టతో నాదాసి తుడుచుచుండెను. ఫాలతలమున, జడక్రింద మెడపై క్షుద్రకేశములు విడి మెఱవింతసోయగమున కాకరమగుచుండెను. ఆమె సౌందర్యమును విలోకించి, దొండపండువంటి పెదవులఁ జూచి, దాసి కన్నుల నీరుపెట్టుచుండెను. "ఎందుల కిట్లు విచారించెదవు?" అని బాలిక దీనముగ దాసినడిగెను. "అమ్మా! నీకంగరాగములు రాచి, కురులదువ్వి, జలకమాడించి, పరిమళమిళితచందనములఁ బూసి, పూలు ముడిచి, ముద్దాడుట కిఁక నీ యంతఃపురమున నెవ్వరు నోచికొని యుండలేదు. ఈ యపూర్వసౌందర్యమంతయు నడవిని గాచిన వెన్నెలవలె నిష్ప్రయోజనము కావలసివచ్చిన దని విచారించుచుంటిని." అని దాసి కళ్యాణపుబొట్టు పెట్టుచు ననెను. బంగరుమిసిమికాంతుల నీనుబాలిక వదనము జాలిగొలుపుచుఁ దెల్లఁబడిపోవుచుండెను. తుద కామె యొక్కనిట్టూర్పు విడిచి "నీవు నాతో రావా?" యని దాసి నడిగెను.

"వత్తును. ఏమిప్రయోజనము? మీరారాజుతో సుఖకాలక్షేపముఁ జేయుచు దినములఁ బుచ్చవలసినయోగ్యత లేదు కద! మేమెందఱ ముండిన లాభ మేమున్నది? తుద కిట్లయినది." అని దాసి యనుచుఁ గంట నీరు గ్రుమ్మరించు చుండెను.

"ఇప్పుడు వచ్చినప్రమాద మేమున్నది? తండ్రిగారు మనఃపూర్వకముగ నిశ్చయించి పరిణయ మొనరించిరి. రాజైనఁ బరమాత్మ

కౌసల్యాగర్భుఁ డని విందుము. వినుటయే కాక ప్రత్యక్షముగ మనరాజ్యము మఱల మన కిచ్చుటయుఁ జూచితిమి. ఇంతకు నెవరిపురాకృతకర్మము నెవ్వరు దప్పింపఁగలరు ? సృష్టియం దెక్కడఁ జూచిన లోపమే, యెక్కడఁ గనుఁగొనిన నశ్వరప్రాయమే ! సౌఖ్యమే దుర్లభము. దుఃఖమనుభవించుటకే మనము జన్మించితిమి. ఇంతకు నేనారాజునం దనిష్టము నొందియుండ లేదు. ఎక్కడకు ? ఒరుగవేసికొనిపోయిన దినములు గడవవా ? నీవూరక శోభనసమయమున దుఃఖించి నామనస్సు కలఁతఁబెట్టకుము." అని తుషారమణీమణి యనెను.

"అమ్మా ! మీకుఁ జిన్నతనము. మీ కేమియుఁ దెలియదు. మీజననిదుఃఖమునకుఁ బరిమితి లేదు. హీనకులజుని పెండ్లియాడవలసివచ్చెను బాలిక యని దుఃఖించుచున్నారు." అని దాసి యనెను.

"కులము—అవును. ఉత్తమక్షత్రియకాంతకుఁ గులసౌశీల్యంబులు గలభర్త వచ్చుట యదృష్టము. నాయదృష్టము ననుసరించి నాకుఁ దగినభర్తను దండ్రిగారు నియమించిరి. నేనందులకు వినయపూర్వకముగ నంగీకరించితిని. మఱియు నేనొక్కతె నొకకులహీనుని కర్ధాంగి నైనను, నామూలమున జనకునిరాజ్యము క్షేమముగ నుండు ననునిశ్చయము నిర్ణయమైనది. ప్రజానాశనము తప్పిపోయినది. దేశక్షేమము కలిగినది. నాకదియె పదివేలు." అని బాలిక పలికెను.

"అమ్మా ! మీరు కులహీనుఁ డగుపురుషుని భర్తయని తలంచుచు నాతనిపరిచర్యలఁ జేయుచు జీవించి కుటుంబగౌరవమునకు మితిలేనిశాశ్వతమైనలోపమును దెచ్చిపెట్టుటకంటె—తల్లీ—వేఱొకకష్టము కలదా ? తుచ్ఛమైనప్రాణములను నాబాలిక విడుచుటకు వెనుదీయదు; మానముకంటెఁ బ్రాణము మధురతర మయిననాఁడు రుచిదేవి నాబిడ్డ కానేరదు ; మాబాలిక యీకంటకమును నిర్మూలన మొనరించు నని మీతల్లిగారు చెప్పుచున్నారు." అని దాసి యనెను.

బాలిక యోజించుచుండెను. దాసి యింక నిక్షేపప్రసంగము చేయుచుండెను. బాలికరక్తము వేడి వారిపోంగుచుండెను. ఆమెకన్నుల నశ్రురాశి యపరిమితమై తుదకు శూన్యములయ్యెను. ఆమె కొకవిధమైన యావేదన మారంభమయ్యెను. ఆమె కేమిచేయుటకును దోఁచుట లేదు. చుక్కానిలేనియోడయందున్న నావికుఁడు నట్టనడిమిసముద్రమున నేయోజనములఁ జేయునో యట్లే దారికనఁబడక బాలిక యోజనలో మునిఁగియుండెను. ఇంతలో బాలికను దీసికొని రమ్మని రాణిగారిసెలవైనట్లు మఱియొకదాసి వచ్చి చెప్పెను. వారందఱు రాణిగారికడకు వెడలి పోయిరి.

---

## పదుమూడవ ప్రకరణము.

సారె.

అమ్మా! దుఃఖింపకుము. ఆఁడుజన్మ మెత్తినపిమ్మట నెప్పుడో యొకప్పుడు పరులచేతులఁ బెట్టి పంపవలసినదే! సుఖముగ వివాహ మొనర్చుకొని సార్వభౌముఁడగునల్లుని దెచ్చుకొంటివి. విచారింపకమ్మా! ఆబిడ్డను జూడఁడెట్లు తెల్లపోయి దుఃఖించుచున్నదో! మీరెట్లో సమాధానపెట్టుకొనవలెను " అని యొకబ్రాహ్మణముత్తైదువ గజపతిరాజుభార్య నంతఃపురమున నూరార్చుచుండెను.

కోటలోనెల్లెడలఁ బ్రయాణమైపోవుదానదాసీజనంబులు, నూతనవస్త్రముల ధరించి మిత్రులకడ బంధుగులకడ "మఱల నెప్పటికో!" అని విచారవదనముల నెడఁబాటును గుర్తించి వ్యసనపడు పరిచారికల, సార్వభౌముఁడగునల్లునికంపుకానుక లగుగజాశ్వరత్నహేమంబుల, తనూజాతకు గజపతిరాజిచ్చు నరణపుటావులు, వివిధరత్నాభరణముల, ఫలముల, వస్త్రములు, భృత్యులు సిద్ధముచేయుచుండిరి. గజపతిమం

తుర్రి తెల్లవిశేషములఁ గళింగరాష్ట్రమునమాత్రమే దొరకుదంతపుసామగ్రిల, పవడపుఁగోళ్లమంచములు, రత్నఖచితసువర్ణాసనములు, సువర్ణపాత్రిలు, మొదలగున వెన్నియో బండ్లకొలఁది తెప్పించి కృష్ణరాయఁ డందుకొనుటకును, గజపతిపంపుటకును, దగినట్లు దర్పసహితముగ నుండవలసినట్లు కానుక లేర్పఱచుచుండిరి. భటులు దాసీవాండ్రు నీవిచిత్రవివాహమునుగూర్చియు, బాలికస్థితినిగుఱించియు, గుసగుస లాడుకొనుచుఁ జెప్పుకొనుచుఁ, ద్వరగ విజయనగరపట్టణమునకు రాయల సైన్యముతోఁ బోవుటకుఁ గుతూహలముఁ జెందుచుండిరి.

‘‘ పిల్లలు జాగ్రత్త ?’’ ‘‘ కూఁతునువివాహమున కుత్తరమరిపుదువా ?’’ ‘‘ మాయయ్యకార్యమునకు వీలుచేసికొని రావలయును.’’ ‘‘ పెద్దపట్టణమున నూతనసౌఖ్యముల మరఁగి మమ్ము మఱవక యుందువా ?’’ ‘‘ దయయుంచుఁడు ’’ ‘‘ ఉత్తరములు వ్రాయుచుండుము.’’ ‘‘ ఏదియో వంకఁబెట్టుకొని నీవొకసారి రమ్ము !’’ అనుభృత్యకోటి పరస్పరము వీడుకొలుపుసమయముల నాడుకొను వాక్యోపవాక్యములతో నాప్రదేశమంతయు సందడి గలిగి యుండెను. ఎవరిమూటలు వారు కట్టుకొని యుండఁగ దలయొకబండిపై సామానులు సర్దుకొనిరి. వేలకొలఁదిశకటములవృషభములు గంటలు గణగణమని మ్రోయ బండ్లకడనిలువఁబడి ప్రయాణమగువఱకు మేయుచుండెను. బండి కొకరిద్దఱు కూరుచుండున ట్లేర్పఱచి యుండుటచే దారిలో సౌఖ్యముగ నిద్రలు పట్టవచ్చు ననుకొనుచుండిరి. ఆసమయమున గజపతిరాజ్యమే తరలిపోవుచున్నట్లున్న రాజబాలికసారెకావళ్లు చూచుటకుఁ బట్టణమునందలి యమ్మలక్కలందఱుఁ జంటిపిల్లలఁ జంకల నిడుకొని యెడపిల్లల నెడమచేతఁ బట్టుకొని, నడుమ సుబ్బక్కమాటలు వినఁబడకుండ ‘‘ అమ్మా ! జీడిలు కొనిపెట్టవు !’’ అని యేడ్చుమూడవపిల్లవాని నొక్క మొట్టికాయతో సమాధానపెట్టుచు, స్త్రీపురుషులు వేలకొలఁదిగఁ

జేరియున్న కోటద్వారముకడ గుంపులలోనికిఁ బట్టణమునందలి పుణ్య స్త్రీలు మందలుమందలుగ నంతయు మించిపోవునని వచ్చిచేరుచుండిరి.

ప్రయాణసన్నాహమున రాయలసైన్య మంతయుఁ బటకుటీరముల విప్పి బండ్లపై నేనుఁగులపై వైచి సిద్ధము చేయుచుండెను. ఆప్పుడప్పుడు కొందఱు అశ్వికసైనికులు కోటలోనుండి రాయలవిడిదిప్రదేశమునకును, మఱిఁ గోటలోనికిని వచ్చుచుఁ బోవుచు ద్వారముకడఁ గూడియున్న జనసంఘము నొసరిల్లుఁడని యదలించుచుండిరి.

మేడపైనుండి యీసన్నాహములను జూచుచున్న గజపతిరాజుభార్య యగునప్పలనరసమాంబ తనూజాత నిన్నదినములనుండి యల్లారుముద్దుగఁ బెంచిననాముద్దియ నిప్పుడు రాయలతో నత్తింటికిఁ బంపవలసివచ్చిన దని కావలయును దుఃఖించుచుండెను.

ఊఱడించుచున్న బ్రాహ్మణవనిత యామెకంటె నధికముగఁ గంటఁనీరుపెట్టుకొనుచుఁ బైఁటకొంగునఁ దుడుచుకొని తడుపుచుండెను. రాణి కుపశమనవాక్యములఁ జెప్పఁదలంచిన యామెనోట మాట రాకుండెను. ఎట్లయిన నామెదుఃఖము వలసినప్పుడు తగ్గింపఁగల శక్తి గలిగియుండుటచేఁ దుదకామె రాణి నెట్లో సమాధానపఱచి పసపుఁగుంకుమ పంచియిచ్చి బాలిక నాందోళిక నెక్కింపఁదలయును రమ్మని యామెను దోడ్కొని పోయెను. దాసీజనంబులు, బంధుమిత్రులు నాబాలికను బంపవలసినసమయమున మఱల నొక్కసారి దుఃఖింపకుండఁజాలకపోయిరి. “సార్వభౌముని పెండ్లియాడెను. సంతసింపుఁడు!” అని యొకరనఁ దెరచాటునుండి “అందువలననే మఱియు దుఃఖింపవలసివచ్చినది. అమ్మా! ఇఁకమాకంటఁ బడవా? మాయింటికి రావా? తల్లీ! పదాఱేండ్లు పెంచితి మమ్మా! నీవేబీదకడుపునవైనఁ బుట్టినచో నింతకంటె సుఖము నొందియుందువా!” అని తల్లి యనేక విధముల వాపోవుచుండెను. “అయ్యగారు మిక్కిలి పామరత్వము

నొందుచున్నారు. మీరు మా రాజుగారిని బడిణయమై యిటకు వచ్చిన
ట్లే యామెయు నత్తింటికిఁ బోవుచున్నది. మీరు సుఖపడినట్లే యా
మెయు సుఖించును-" అని చుట్టుప్రక్కలవారు సమాధానపఱచిరి.

ఇంతలో గజపతి త్వరగఁ బ్రయాణము సాగింపవలయుననియు,
ముహూర్తము దాఁటిపోవుననియు వార్తనంపెను. రాణి యెంత చెప్పి
నను విలపించుచునే యున్నదని చెప్పుచుండుటచేఁ దానే స్వయముగ
వచ్చెదనని యంతఃపురమునకు వచ్చెను. ఆతనిజూచి రాణి క్రిందినుం
డి లేచి కౌఁగిలించుకొని "మన మహాలక్ష్మి వెడలిపోవుచున్నది. మ
నతల్లి యిఁక మనకంటఁబడదు." అని బాలికవలె నేడ్చెను. స్వభావ
ముగఁ గఠినహృదయమో, గాంభీర్యమో కలిగియుండవలసినపురుషుఁ
డగుగజపతిసహితము నాసమయమున దుఃఖము నాఁపుకొనలేకపోయెను.
ఎలుగెంతయదిమినను గంట నీళ్లెవరాపఁగలరు? భార్యనూఱడించు
టకాతఁడు మాటలాడఁబోయి శుష్కించిపోయిన తగ్గిన వీణాతంతువువలె
మారినస్వరముతో "నూరకుండుఁ డూరకుండుఁడు. ఇప్పు డామెకు
వచ్చినభయ మేమి?" అని దుఃఖభారమున నొకటిరెండుమాటలాడెను.

అప్పుడు తుఖారమణిమణి నలంకరించి పరిచారికలు తలిదం
డ్రులకు మ్రొక్కింపఁ దీసికొని వచ్చిరి. ఆబాలికయుఁ దండ్రివదన
మును జూడలేక చిన్నాలున వచ్చి యాతనిపాదములపైఁ బడెను. జననీ
జనకు లామెను లేవనెత్త నామెయు దుఃఖించుచుండెను. తలిదండ్రు
లిరువురు నామె నూఱడించి, యత్తింట మెలఁగవలసినరీతుల బుద్ధు
లఁ గఱపి విడువలేక విడువలేక విడిచిరి.

"అమ్మా! నామాట వినుము! నాముద్దు చెల్లింపుము, నేను
సుఖముగ మరణించెదను. ఆమాట వినవలయును." అని యొకరాజ
బంధునిభార్య వచ్చి యాబాలికతో మెల్లగా ననెను. "అది మీతల్లి
గారియిష్టము!" అని మఱల ననెను. బాలిక తల్లిని జూచెను, మఱలఁ

దల్లి బాలికను గౌఁగిలించుకొని తలపై నాభరణముల నించుచు సవరించుచు "అమ్మా! గజపతుల గౌరవము నిలువఁబెట్టుము! ఇంతియె నేఁజెప్పవలసినది." అని బాలికతో నని పల్యంకిక నెక్కించెను. అందఱుఁ బ్రయాణమైరి. సకాలమున సారెచీరలతో రుచిదేవి రాయల సైన్యమును జేరెను.



## పదునాల్గవ ప్రకరణము.

—(o)—

### దారుణకృత్యము.

కేవలము సైన్యబలమే బలము కానేరదు. తమసైన్యముకంటె పలురెట్లధికముగ నున్న గజపతిరాజుసైన్యము స్వదేశమున నుండియు, మహామ్మదీయసైన్యము నోడించుటతో నలసియున్నకృష్ణరాయనిస్వల్పసైన్యముముందర నిరుపయోగమైనది. బాహుబలయుతుఁ డగుమనుజుఁడు తనకంటె బలహీనుఁడైనను బుద్ధిబలము గలిగియుండిన శత్రువునకుఁ జిక్కును. బుద్ధిబలముకడ బాహుబలము నిరుపయోగమైన గజపతిరాజుపరాజయము దైవికము కదా! నాయకులయందుఁ దిమ్మరుసు భేదతంత్రమువలన వైరుధ్యము గల్పించి గజపతిబలవంతమైనసైన్యశరీరమునుండి నాయకశిరమును దొలఁగించి నిరుపయోగమొనర్చెను. మేధావంతుఁడగుమానవునిబుద్ధికుశలత మానవులస్థితిగతులను మార్చి వింతఫలముల నిచ్చి యదృష్టదేవతకటాక్షవీక్షణముల రూక్షవీక్షణములుగ మార్చివైచును. ఈబుద్ధిబలమునకు లోకమంతయు విధేయమై కలిగినమార్పులకు బాలిపడి యాశ్చర్యముగఁ జూచుచుండును. బుద్ధిబలమే యొకప్పుడు దైవబలమగును. భగవదంశమగుమానవునిబుద్ధి కర్మసూత్రమునే మార్చివైచుచున్నటుల మనకొకప్పుడు తోఁచుచుండును.

గజపతిబాలిక యగురుచిదేవిట్లు కృష్ణరాయ సైన్య పరివృతయై కతిపయదినములలో విజయనగరముఁ జేరినపిమ్మటఁ గొన్నిదినముల కచ్చట నొకనాఁడు మహావైభవముగఁ బట్టణమంతయు నలంకరించిరి. పట్టమహిషి వచ్చినదని ప్రజలందఱు నానందము నొందిరి. నాఁడే పునస్సంధానముహూర్త మని పెద్దలు నిర్ణయించిరి. తిమ్మరుసు రాయలఁ బుత్రునివలె నాదరించుచు, రాయలు ప్రేమించినకన్యను దెచ్చి రాణి నొనర్చినందుల కెంతయు సంతసపడుచుండెను. ఉచితకాలమున బాలికను శయనమందిరమున కంపుటకు నిశ్చయింపఁబడెను. రుచిదేవికి వేఱుగ నియమించినమందిరమున నామెవెంట వచ్చినపరిచారికలతో నామె విడిసియుండెను.

సంధ్యావేళ నామందిరోపరిభాగమున నొకగదియందు రుచిదేవికడ నొకపరిచారిక నాలుగుకత్తులను దీసి తల వంచుకొని యొకకత్తిపై నొకకత్తిని బెట్టిరాయుచు, "అమ్మా! మీరట్లు చేయవలసియున్నది. అదృష్ట మనియు, కర్మఫల మనియుజరిగిన మోసమునకు లోఁబడుట పిఱికితనము." అని యనుచుండెను.

బాలిక గవాక్షమునుండి బయటికిఁ జూచుచుండెను. ఉన్నతతరుశాఖాగ్రములపై నంటియున్నట్లగపడుచుండిన నీలంపుటాకసము నామెకనుఁగొనుచుండెను. ఆమె యేమియు బదులు చెప్పలేదు.

"ఇంతవఱకుఁ బలుమారులు పలువురు చెప్పినయీవిషయము నుగుఱించి మీకింత యోజన యేల? పరువు ప్రతిష్ఠయు లేని దుర్భరజీవితముకంటె—పవిత్రఖడ్గధారలచే మరణము నొందుట యుత్తమక్షత్రియకాంత కోరఁదగినది." అని దాసి యనెను.

"అది సత్యమే! కాని నీవు ధర్మసూక్ష్మము యోజించుటలేదు. నాభర్తయే నాకు దైవము! నేనాతని నెట్లునఱకఁగలను." అని రుచిదేవి యనెను.

“కులహీనుఁడు భర్త యెట్లగును? మఱియు మోసముచే నిన్నా తఁడు పెండ్లి యాడెను.” అని దాసియనెను.

“ఇందాతనిమోస మేమియు లేదు. నాతండ్రి యుద్దేశపూర్వకముగ నన్నాతని కిచ్చి పెండ్లి చేసెను. తలిదండ్రులు దెచ్చి పెండ్లి యొనర్చినభర్తయే భర్త కాకపోయిన నిఁక భర్త యెవరు?” అని రుచిదేవి యనెను.

“నీవంతపౌరుషహీన మగుమాటనాడినచో దాసియగునేఁ జెప్పన దేమున్నది? నీతండ్రి రావణునకు దేవతలు భయపడినట్లు—రాక్షసులకు మునులు భయముఁ జెందినట్లు—రాయలకు భయపడి రాజ్యసంరక్షణముకొఱకు, తనూజాతమానమును మంటఁ గలుపుట కంగీకరించెను. తుచ్ఛమైనప్రాణముల కాశపడి నీవును పిఱికిమాట లాడుచున్నావు. సూర్యవంశజుల మనియు, శ్రీరామమూర్తి వంశము నుండి యూడిపడితి మనియుఁ బెద్దతిరలు చనువుకొనుగజపతులవంశమునఁ బుట్టినబాలికవు నీవి మాటలాడుట కడు విచారకరము.” అని దాసి కనులెఱ్ఱజేసి నిర్భయముగ ననెను. ఆమె చేతనున్నకత్తులు విసరి యొక మూలకుఁ బారవైచెను.

“సుందరి! నీకింతయావేశ ముండవలసినపని లేదు. రాయలు నిజముగఁ గులహీనుఁడైన నాతని మనము చంపవలసిన యగత్యము లేదు. మన మనుకొనిన ట్లాతఁడు కులహీనుఁడు గాక, నిజమైన పరాక్రమమువలననే మనల నోడించి యుండినప్పుడు, మనమాప్రజాపాల కుని జంపిన నాతనికొఱ కెందఱేత్తురో, ముష్కరతురుష్కు లెట్లు విజృంభించి మనదేశమును గొల్లగొట్టుదురో—మన మూహించి తెలిసికొనవలసినదే! నేనాతనితోఁ గాపుర మొనరించినఁ గదా—గజపతులవంశమున కపకీర్తి! నేమరణించెద నాకత్తుల నిటు తెమ్ము!” అని రుచిదేవి యని కన్నుల నీరు పెట్టుకొనుచుండెను.

"అమ్మా! నాపైఁ గినియకుఁడు! మీ రాలోచింపుఁడు! పాత్రులను మీతండ్రినుండి వేఱుపఱచుటకు రాయలు కపటము చేసెనఁట. పరాక్రమవంతుఁడైనచో శత్రునర్పుట యేమినీతి! రాజ్యవినాశమును మాన్పఁగదా మీతండ్రి మిమ్ముల వివాహమొనర్చినది! తుచ్ఛుఁడో క్రూరుఁడిట్లు చచ్చెనా—హిందువుఁ డని యాతఁడు మహమ్మదీయులకంటె నధికదుష్కార్యము లొనర్చుచుండెను. ఒక్క బాలిక యిట్లొనర్చెనా—మరల నేరాజు నిట్లు బాలికలయిష్టమునకు వ్యతిరేకముగఁ బరిణయ మాడ సాహసింపఁడు. మఱియు స్వయంవరస్వాతంత్ర్యము గలమీకు మీతండ్రిగారు చేసినవివాహ మధర్మమైనది. మీకాభర్త భర్తయే కానప్పుడు మీకు దైవసముఁ డెట్లగును." అని దాసియనెను.

"నాకేమియుఁ దోఁచుట లేదు. అని రుచిదేవి యనెను.

"అమ్మా! మీకీచిరప్రేమక త్తె యోద్యానమువలెఁ దగిలించెదను. మిమ్ముల నాశయనాగారమున కంపి యుండఁగ నీవలకు వచ్చినపిమ్మట రాయలు మిమ్ముల సమీపించును. అప్పు డేమరి పాటున నుండును. మోహాతిరేకమున మైమఱచి యుండును. ఆతఁడు పురుషుఁడబలనేనెట్లని యోజింపకుఁడు. మీరీ కరవాలమున నాతని సమయింపుఁడు. గజపతివంశశీలమును గాపాడుఁడు. చిరకీర్తిని బొందుఁడు. గుర్కెదుపాలిమ మెట్లయిన నేమి? కాకుండినచో నాకీదుస్తుల నలంకరింపుఁడు. నేఁ బోయి యాకార్యము నెఱవేర్తును" అని దాసి యనెను.

బాలిక ప్రత్యుత్తర మేమియుఁ జెప్పలేదు. ఇంతలో నారంగమున కెవ్వరో వచ్చుచుండుటఁ గని వారా సంభాషణ మాపి నడిమి చావడిలోనికిఁ బోయిరి.

---

# షడునేనవప్రకరణము.

---

## ప్రత్యాగమ్ము.

కృష్ణరాయలు శయనాగారమునుండి యీవలకు వచ్చెను. తిమ్మరుసయ్యవారు ప్రక్కచావడిలో నిలువఁబడి యుండెను. గాజుకుప్పెలయం దున్న దీపకళికలు సంపూర్ణప్రకాశము నిచ్చుచుండెను. రాయలు తిమ్మరుసును సమీపించి „అప్పాజీ! బాలికపయోముఖవిషకుండిక వలెఁ గంటకసమన్వితలతికయుంబోలె శయనాగారమునకు వచ్చినది. ఆమె మనమునం దనిష్ట ముండఁగ మన మామెయం దవ్యాజానురాగమున నుండినఁ బ్రయోజన మేమి?” అని పలికెను.

“ఇప్పుడు దేవరవారి యాజ్ఞ యేమి?” అని తిమ్మరుసడిగెను.

“బాలికను జనకునింటికిఁ బంపివేయుఁడు.” అని రాయలనెను.

తిమ్మరుసు యోజించి కొంతవడి కొక్కనిట్టూర్పును విడిచి రాయలఁ జూచెను. పరిచారకు నొకనిబిలిచి యుచితపరివారమున పల్లకుల నాయత్తపఱుపు మని యాజ్ఞ నొసఁగెను. మఱియొక గడియలో సర్వము సిద్ధము చేయఁబడెను. తిమ్మరుసు శయనాగారమునఁ బ్రవేశించెను. అచ్చట రుచిదేవి యవనతముఖియై నిలువఁబడి యుండెను. తిమ్మరు సందుఁ బ్రవేశించిన దామె యెఱుఁగదు. ఆతఁ డామెను జూచి “అమ్మా! తండ్రిగారిదేశమునకు దయచేయవలెను.” అనిపలికెను.

అమె తల యెత్తెను. అశ్రుధార లపరిమితముగ నాబాలికవదనమునఁ గురియుచుండెను. తిమ్మరుసును జూచుసరి కామె దుఃఖము తీవ్రమయ్యెను. ఆమె గుండెలు తటతట శబ్దించుచుండెను. „ఈమనోహరసౌందర్యవతి కింతక్రూరహృదయమా? ఈసుకుమార శరీరమున నిట్టిపాషాణహృదయమా?” అని తిమ్మరు సనుకొనెను. బాలిక నేలపైఁ గూలెను. „తండ్రీ! నాకీగతి తప్పదా?” అని యావేదనతో

బాలిక పలికెను. తిమ్మరుసు బదులు చెప్పలేదు. కీలువిడిన జంత్రపుబొమ్మవలె నాతనిపాదముల కించుక దూరమునఁ బడియుండిన బాలిక నాతఁడు గుచ్చిగుమ్మరించినపుష్పరాశియో యని తలంచుచుండెను. తమకందఱకు శిరమునఁ ధరింపవలసిన యాజ్ఞ లొసఁగుననుకొనిన యాబాలిక యిప్పటిదుస్థితిఁ జూడ నాతనికి జాలి కలిగెను. రాజనీతికోవిదుఁడగు తిమ్మరుసుకన్నులు బాష్పపూరితము లయ్యెను. తానాబాలిక రూపపటమును దెప్పించి రాయలఁ బరిణయమున కంగీకరింపఁజేసి, భేదోపాయమునఁ గార్యము నిర్వర్తించి, యుద్ధము లేకుండఁ జేసినపాట్లాతనికి జ్ఞప్తికి వచ్చెను. తుదకాప్రయత్న మంతయు నిష్ఫలమైనదని యాతఁడు విచారించెను. "కర్మసూత్రము!" అనుమాట లాతని నోటినుండి బహిర్గత మయ్యెను. "కంటక మెంతత్వరగఁ దీసిపారవేసిన నంత మంచిది." అని రాయలయాజ్ఞ యని సేవకుఁ డొకఁడువచ్చి చెప్పి తిమ్మరుసును జూచెను. అతఁ డొక్కనిట్టూర్పుఁబుచ్చి గజపతినగరపుదాసీలఁ బిలువనంపి బాలికను దోడ్కొని మందిరముక్రిందకు వచ్చి సిద్ధముగ నున్నయాందోళికల నెక్కుఁడని మంత్రి యాజ్ఞాపించెను. వారేమియు మాటలాడక యాతని యాజ్ఞల ననుసరించిరి. ఎవ్వరును మాటలాడ లేదు. క్రిందఁ బడి యున్న బాలికను లేవనెత్తి దాసీలు తీసికొనిపోయి పల్లకి నెక్కించిరి.

ఆరాత్రిసమయమునఁ బరివారసహితముగ గజపతితనూజాతతో గలసి పరిచారిక లందఱు నరణ్యమార్గముఁబట్టి వెడలి పోవుచుండిరి. మృదులమై, కోమలమై, ప్రకాశవంతమై, యున్న కృష్ణరాయుని సముజ్జ్వలమైనమూర్తి రుచిదేవికన్నుల యెదుటఁ గట్టి నట్లుండెను. ప్రేమసంపూరితములగు తరళనయనముల చూడ్కులతోఁ, జిఱునవ్వుతో, ఆదరణముతో—రాయలు తనపాణిగ్రహణ మొనర్చి శయనాగారమున హంసతూలికాతల్పమునకుఁ జేర్పఁ బ్రయత్నించిన సమయ మూ

మెహృదయమును గలంచివైచుచుండెను. అతఁడుచేయిపట్టి చేరఁదీసి కొనునప్పుడు మొలయందున్నకత్తి యుఱ్ఱవలెఁ గ్రిందకుఁ బడినప్పు డాతఁ డదరిపడి, తనచేయి విడిచిననంగతి దలఁచి యులికిపడి, యట్టి దుష్కార్యము జరుగకుండ నుండినఁ దనయదృష్ట విూనమయము నకెట్లు ఫలించియుండునని యామె తలపోయుచుండెను. కుటుంబగౌరవము చెడిపోయెఁ బోయె నని—కొంప కగ్గి తగిలెఁదగిలెనని, రాయల సంహరింపకుండినఁ బౌరుషము లేదు లేదని ప్రోత్సాహించి, పోరి పోరి తనచే నిట్టిదుష్కృత్యముఁ జేయింపఁ జీరపైఁ గత్తి నమర్చిన తనదాసిపై నాగ్రహ మతిక్రమించు చుండెను. మనోహరవస్తు నిచయముతో—హృద యానందకర పరిమళములతో—కవికుదయించు భావపరంపరయుంబోలె నగరువత్తులనుండి వెలువడు సుగంధధూమములలో—పన్నీటిసువర్ణకలశములతో—నాగవల్లీదళములతో—అన్నిటికంటె నధికముగఁ దన్నుఁ జేరి తన్నుధన్యనుజేయు మహాకౌతుకముతో సౌఖ్యాపేక్షతో సమీపించుభర్తతో విరాజిల్లుచున్న—రెండుగడియల క్రిందటఁ దనదే యగుశయనమందిర మామెమనస్సునందుఁ బ్రచలితమగు చుండెను. ఆశయనమందిరమున నుండి నస్థితికి—తానిప్పుడు పోవుచున్న క్రూరమృగసంకులమగు—ఘోరకంటకపరివృతంబగు—భయంకరస్వరూప కాళవర్ణధారియగు—మహారణ్యమార్గమునం దాబోయలమూర్ఖులు మరణించినశవముకొఱకేడ్చుబంధుమిత్రులవలెఁ దనదుస్థితి కేడ్చుచున్న యేడ్పులవలె నామె వినుచుండెను. భయంకరములును నూతనములు నగుమృగాలధ్వను లామెకు మరణమే ప్రాప్తించినట్లు—తన్ను శ్మశానవాటికకుఁ దీసికొనిపోవుచున్నట్లుగ నాబాలికకు భయముఁ గొలుపుచుండెను. మఱలఁ దానాసౌఖ్య జనకశయన మందిరముననే రాయల కించుక దూరమున నిలువఁబడినట్లు—"కత్తి మాపరిచారికలు కట్టిరి; తీసివేయుదు" నని చెప్పనుంకించినట్లు—సిగ్గుచే నట్లు చెప్పఁజా

లక యుండినట్లు—ఇంతలో రాయలు తన్ను సమీపించుచున్నట్లు—అతనిమూర్తి నోరకంటఁ జూచి తానిదివఱ కెన్నఁడు నెఱుఁగని పరమానందమునకు లోనైనట్లు—భ్రమఁజెంది యులికిపడి కత్రి క్రిందకు బడినదని తలంచి తిరుగఁ దనప్రస్తుతస్థితి జ్ఞప్తికివచ్చి యావేదన పడుచుండెను. "అకటా! ఈజన్మమున నిఁక నా మహామహుని చెట్టపట్టి యుండు యోగ్యత లేదా? ఆమహాశయునిమూర్తి నైన దర్శింప వీలు లేదా? నేనిప్పుడే పట్టణమునకుఁ బోయి రాయల పాదపంకజములపైఁ బడి ప్రార్థించెదను. తిమ్మరుసును దండ్రిరక్షింపు మని ప్రార్థింత మని తలంచి పల్లకిబోయల నాజ్ఞాపింప నుంకించి "వారట్లు చేయుటకు 'రాజాజ్ఞ లేద" ని నిస్పృహఁ జెంది—తానే యురికి వెనుకకుఁ బోవనిశ్చయించును. పెద్దభయ మావేశించి బాలిక యట్లు చేయలేక పోవును. రాయల నఱకుమని తన్ను బ్రోత్సాహించిన దాసి తనకంటఁ బడిన నామెనునఱికి వేయవలయు నని యామెనిశ్చయించుకొనును. "ఆహాహా! కరుణాస్వరూపుఁడు! ప్రణయమూర్తి! తన్నుఁ జంపుటకుఁ గత్తులఁ దెచ్చి తనశయనమందిరమునఁ జొచ్చిన నన్నురిదీయింపక, యిలువెడలఁగొట్టక, గౌరవపూర్వకముగ నింతపరివారముతో నన్ను మఱల నా తండ్రియింటి కంపుచున్న యాశ్రీకృష్ణదేవమహారాయని—ఛీ! ఛీ! తుచ్ఛులు ప్రకటించిన ప్రవాదముల నమ్మి—తుంటరు లగు పరిచారికలప్రబోధములకుఁ జెవి యొగ్గి—ఉదారహృదయుఁడు, ఆంధ్రకర్ణాటరాజ్యసంస్థాపకుఁడు—అవతారపురుషుఁడు, ననదగుభర్తను—దేవసమునిఁ జంపుటకుఁ బ్రయత్నించిన నాకే శిక్షయైన విధింపవలసినదే! మఱల నే నేమొగము పెట్టుకొని కన్నయింటికిఁ బోవలయును! మందభాగ్యురాలను." అని బాలిక వాపోవుచుండెను. "ఇట్టి కారుణ్యమూర్తి పట్టుదలకై—మోహపరితృప్తికై—నన్నుఁ దెచ్చెనని చెప్పిన దాసి నాలుక వేయిచీలికలఁ జేయవలదా? తనయంతఃపురమునకుఁ దెచ్చ

కొనిన—మాతండ్రి యగ్నిసాక్షిగ వివాహ మొనరించిన నన్ను తన దాసి నగునన్ను, తనయిష్టమువచ్చినట్లు శిక్షించుకొని బుద్ధిచెప్పుకొని తనవాంఛితమును నెఱవేర్చుకొనఁదగిన నన్ను—కటకటా! రాయలు నాదురదృష్టవశమున విడిచివైచెను. ఆతనికి మోహపరితృప్తియే ప్రధానమైన నన్నాతఁ డాసమయమున నేమిచేయలేఁడు! నాకిష్టము లేదని—నేనాతనిప్రేమించుట లేదని—యాతఁడు గ్రహించినతక్షణము నన్నాతఁడు విడిచి వెడలిపోయెను. కరుణాస్వరూపా! నాపాపములు ఫలించినవి. నాకైనించుక జాలిపడలేకపోతివా? నేను లోకమెఱుఁగని బాలికనని క్షమియింపలేకపోతివా? ఈకత్తు లేలధరించితివని నన్ను నిలువఁబెట్టి యడుగ లేకపోయితివా?" అని బాలిక దుఃఖించుచుండెను.

ఆమెదృష్టియందు రాయలప్రచండమూర్తిపై నొకవిధమైన యనిర్వచనీయ మగుప్రకాశము గలుగుచున్నట్లు—ఆప్రకాశము బాలభానునివలెఁ గ్రమాభివృద్ధిని గాంచుచున్నట్లు—తుదకు లోకమంతయు వ్యాపించుచున్నట్లు—చీఁకటు లెల్లెడఁ బారిపోవుచున్నటులు—శ్యామలసస్యసంపూరితము లగుపొలములపై—రత్నసంశోభితము లగు సంగడులుగలపట్టణములపైఁ—గోట్లకొలఁదిప్రజలు ధరించిన తెల్లనియగ్రములు గలబల్లెములపైఁ బ్రకాశించుచున్నట్లు—రాజాధిరాజు లందఱు నాతనిపాదములపైఁ బడుచున్నట్లు—దూరమునుండి యిదియంతయుఁ జూచుచున్నతన్నాతఁడు చూచి నవ్వి తనప్రక్కను గూరుచుండుటకు సైగచేసి పిలిచినట్లు—రుచిదేవి యొకస్వప్నముఁ గనెను. ఒక యాలోచనమును జేసెను. సగ మాలోచనము—సగము స్వప్నము నగునొకవింతచర్య కామె లోఁబడి, యులికిపడి వెంట వచ్చుచున్నపరిచారికలఁ బిలిచి సవారి నాఁపు మనెను.

అప్పటికిఁ దెల తెలవారుచుండెను. అరణ్యము విడిచి వారొక పల్లెను సమీపించుచుండిరి. అది పర్వతవనసమన్వితమగునొకమనోహ

కప్రదేశము. "మన మెచ్చటకు వచ్చితిమి?" అని రుచిదేవి యడిగెను.

పరిచారిక లామెకడకు కయిదాఱుగురు పరుగెత్తుకొని వచ్చిరి. "చినగొల్లపల్లె" యనునొకపల్లెకడకు వచ్చితిమి. అది యిచ్చటకుఁ గొంచెము దూరమునఁ గలదు. అని రాయలపరిచారకులు చెప్పిరి.

"నన్నెచ్చటకుఁ దీసికొనిపోవుదురు?" అని రుచియడిగెను.

"రాయలయాజ్ఞ—" అని పరిచారకుఁ డనుచుండ

"అవునది యేప్రదేశము?" అని రుచి యడిగెను.

"గజపతినగరము!" అని వారనిరి.

"ఈప్రదేశ మెవ్వరిరాజ్యములోనిది?" అని రుచి యడిగెను.

"శ్రీకృష్ణరాయలు నూతనముగ జయించినది." అని సేవకు లనిరి.

"మంచిది! మేమిఁకఁ బైకిఁబోము. మీరు వెనుకకుఁ బొండు." అని రుచి యనెను.

రాయలభృత్యు లట్లొనర్చుటకు రాజాజ్ఞ లేదని చెప్పిరి. కాని యామెకడనిఁక మాటలాడలేక వెడలిపోవలసివచ్చెను.



## పదునాఱవ ప్రకరణము.

—(౦)—

### గాలివాన.

కృష్ణరాయలు బాలికను బంపివేసినపిమ్మటఁ దిమ్మరుసయ్యవారిని బంపివేసి క్రోధపరవశుఁడై చింతామణీమందిరములోనికి వెడలిపోయెను. భృత్యు లందఱు భయముతో దూరదూరమున వేచియుండిరి. దీపమైన లేకుండుటచేఁ జింతామణిమందిర మంతయు నంధకారబంధురమై యుండెను. రాయ లదియేమియు గ్రహింపలేదు. ఆతని మనమున నెట్టియూహలుప్పతిల్లుచున్నవో తెలిసికొనుట యెట్లు? ఆతే

డొక సోఫాపై జతికిలఁబడి ఫాలతలము పాణితలమునఁ జేర్చి, సోఫాచే తిపై మోచేతి నూని చింతానిమగ్నుఁడై యుండెను. "దీపము!" అని యాతఁడు బిగ్గరగా ననెను. ఆస్వరమునఁ గ్రోధదుఃఖములు ద్యోతక మగుచుండెను. దుఃఖమునకంటెఁ గ్రోధమాస్వరమునఁ బ్రస్ఫుట మగుచుండెను. మారినయాస్వరమునకు భృత్యుఁ డటునిటు చూచెను. తుదకాసేవకుఁ డాపరిక్రమను దెచ్చియుంచినదివ్వెతో గుమ్మముకడకు వచ్చి నిలువఁబడెను. "లోనికిఁ దెమ్ము!" అని రాయ లనెను. భృత్యుఁ డాదీపమును యథాస్థానమున నుంచి ద్వారముకడకు వెడలి పోయెను.

రాయలు చిత్రపటమువై పునకుఁ దిరిగెను. వస్త్ర మాచ్ఛాదింపఁబడి యుండెను. ఆతఁడు లేచి యాపటమును జేరుటకుఁ దగినబల మాతనిశరీరమున లేదని గ్రహించెను. కలగనినరాత్రిమొదలు నేఁటివఱకై నచర్యయంతయు నాతనికి జ్ఞప్తికి వచ్చెను. క్రమక్రమము గా నాతనిచిత్తవైకల్య మంతయు నొకదీర్ఘనాటకమువలె నాతనిమనో రంగములఁ దిరుగుచుండెను. కత్తిఁగట్టినబాలిక నాతఁడు ప్రేమతోఁ జేయిపట్టి దగ్గఱకుఁ జేర్చువఱకు నాతఁడు యోజింపఁగొనఁగలిగెను. అతని కాగ్రహము ప్రకోపించెను. అప్పు డాకార్యము జరిగినట్లు, పరిక్రమ నాబాలిక నిలువఁబడి వణఁకుచున్నట్లు నాతఁడు చూచెను. చటాలున లేచి చిత్రపటమును జేరి యాచ్ఛాదితవస్త్రమును దొలఁ గించెను. బాలిక యవనతవదనయై భయముతో నాచిత్రపటమున దాఁగిన ట్లాతఁ డనుకొనెను. "ఇట్టిపుష్పమునఁ గంటకములా?" యని యాతఁడు గొణఁగుకొని నిట్టూర్పు విడిచెను. తుద కాతఁ డచ్చట నున్నమషీరసమునఁ గుంచెముంచి బాలికరూపమును వికృత మొనర్చె ను. కృష్ణరాయలు లేచి పటమును జూచెను. ఇఁకఁ జూడ లేకపోయెను. ప్రకృతియంతయు నాశనమైన ట్లాతనికిఁ దోఁచెను. ఆతఁడు గవాక్ష

ము జేరెను. ఆచీఁకటి నాతఁ డట్లే చూచుచుండెను. ఆతని మనస్సంతయుఁ దీవ్రముగఁ దిరుగుచుండెను. సర్వప్రకృతియుఁ దిరుగుచున్నట్లాతనికిఁ దోఁచెను. వృక్షములు, ఇండ్లు, నక్షత్రములు, మేఘములు, నాకసము, నివి యన్నియు నాతమోరాశియందు లీనమై ప్రకృతియంతయు దుఃఖసంపూరితమైన ట్లుండెను. ఇఁకఁ దెల్లవారదని యాతఁ డనుకొనెను. ముగ్ధయు నలౌకికసౌందర్యమూర్తియు నగు బాలికమాత్ర మాయంధకారమునఁ దాండవించుచున్న ట్లుండెను. చింతామణిమందిరము లేదు. విజయనగరపట్టణము లేదు. ప్రపంచము లేదు. తానున్నదికూడ సందేహము—సర్వము నాయంధకారమునఁ గరఁగి యదృశ్యమైనట్లాతనికిఁ దోఁచెను. ఆతని కణతలు వేఁడిమిచేఁ గొట్టుకొనుచున్న ట్లాతఁ డనుకొనెను. కన్నులు మంట లెత్తి శిరమంతయు నొచ్చుచున్నట్లుండెను. తాను విస్మృతము చేసినను బాలిక—మహాలయసమయమునఁ గన్నులు మూసికొని తాండవించు నటరాజప్రభువలెఁ—దాండవించుట యాతని కసహ్యకరముగ నుండెను. కొంచెము భీతియుఁ గలుగుచుండెను. ఆతనియొడలెల్లయు జల్లుమని చెమటలు గ్రమ్మెను. మహాప్రళయ మగుట నాసమయమున దృశ్యప్రపంచమును నశింపఁజేయుటకు భగవంతుఁడంపిన నాశనాగ్ని వేఁడిమి యని యాతనికి భయ మొదవెను. బాలిక నృత్యముఁ జేయుచు నాయంధకారమున దూరముగ వెడలిపోవుచుండె నని యాతఁ డనుకొనెను. ఆతని కించుక జ్ఞప్తి కలిగెను. వెనుకకుఁ దిరిగెను. పటమువంకఁ జూచెను. అప్పు డాతనిమనస్సంతయుఁ దేఱినదని యాతఁ డనుకొనెను. అది ప్రళయకాలము కాదని యచ్చటనున్న వస్త్రము నొకదానిని నీట ముంచి బాలికపటముపై నప్పుడు వ్రాసిన మషీరసమును మెల్లగఁ దుడిచెను. పటమించుక కళంకమున్నను బరిశుభ్రమయ్యెను. బాలిక రక్తవర్ణవస్త్రమాతడిగుడ్డతోఁ గాషాయవర్ణముగ మాఱిపోయెను. నీలవర్ణము గల

భాగములు కొంచెము నల్లఁబడెను. తుద కాతఁ డొక్క నిట్టూర్పును బుచ్చి యిఁక నచ్చట నుండ లేక పోయెను. శయనించినఁ గొంచెము సుఖముగ నుండు నని యాతఁడు తలంచెను. అశ్రువులు క్రమ్మిన నేత్రము లాతఁడు తుడుచుకొనెను. "బాలిక నిర్దోషి! ఇదియంతయుఁ గజపతి మాయ! ఆతని శిక్షింపవలయును." అని యాతఁ డనుకొనెను. ఆతని దృష్టి మేకులకుఁ దగిలించిన కరవాలముల పైకిఁ బోయెను. ఆకత్తిని చూసి యిప్పుడే యుద్ధరంగమున కుఱుకవలె నని యాతఁ డనుకొనెను. ఆతని దృష్టి మఱలఁ జిత్రము పైకిఁ బోయెను. ఆచిత్రపటమునందలి బాలికమెడనుండి కత్తి క్రిందికిఁ బడిపోయిన ట్లాతనికి సవ్వడి కలిగిన ట్లనుమానించెను. "ఏమైన నేమి? దోషము నొనర్చినవారికి శిక్ష జరుగవలెను." అని యాతఁ డామందిరమును విడిచి వెడలిపోయెను.

ఇది మొదటి భాగము.





# ప్రభాతము.

## రెండవ భాగము.

### మొదటి ప్రకరణము.

#### వనమందిరము.

నిబిడతరుశాఖాశ్యామలవర్ణశోభితంబును, వియద్గంగాసదృశరఘుధీయుక్తగగనచుంబితపర్వతరాజపరాజితంబును, నవకోమలపల్లవఫలపుష్పసౌరభమిళితవాయుసంచారసంయుతంబును, ఘోరవనమృగసంకులధ్వానప్రతిస్వనితపర్వతగహ్వరసంశోభితంబును, భయంకరభావసంజనకవికృతశ్యామలవర్ణసంకలితంబును, వివిధవర్ణవిహంగమధురకలకూజితసంపూరితంబును, నిర్జనప్రదేశంబు నగునాకొండలోయ కించుకదూరమున సుధాధవళకుడ్యవిరాజితంబును, మధురపుష్పఫలసమేతవినోదారామపరివృతంబును, శాంతిప్రదంబు నగునామందిరము నూతనముగ నదఁగ — నేడెనిమిదివత్సరములకుఁ బూర్వమే కట్టఁబడినది. అందుఁ బురుషు లెవ్వరును వసియింపరు. కాషాయాంబరధారిణు లగుకొందఱు తరుణీమణు లందు వసియించుచుండిరి. పరిచారిక లాచుట్టుపట్ల గొల్లపల్లెలకుఁ బోయి వలసినపదార్థములను గొని తెచ్చుచుందురు. ఆమందిరమునం దొకపుణ్యాత్మురాలు వసియించుచుండును. ఆమె చేయుచుండినధర్మములకు మితి లేదు. లక్షలకొలఁది ప్రజలకు నిరతాన్నప్రదాన

ము చేయుచుండుటచే నామె ప్రత్యక్షాన్నపూర్ణాదేవియని యాచుట్టు ప్రక్కలప్రజలు వాకొనుచుందురు. ఆమెచేసినగోదానములు, సువర్ణదానములు నపరిమితము లని ప్రజలు చెప్పుకొనుచుందురు. వేలకొలఁదిప్రజ లామె త్రవ్వించు వాపీకూపతటాకాదులయందుఁ బనులఁజేసి జీవించుచుందురు. ఆచుట్టుప్రక్కలపల్లెలఁ గలబీదజను లనేకు లామందిరమున కించుక దూరమునఁ గలయెత్తయినసమప్రదేశమును జూచుకొని నూతనముగ నొకపల్లెను నిర్మించి యందు నివసించుచుండిరి. వారి కనేకవిధముల నాగృహిణి సాహాయ్యమొసర్చి యుండుటచే వారు నూతనగృహనిర్మాణములను, క్షేత్రసంపాదనమును, జేసికొని క్రమముగ భాగ్యవంతు లగుచుండిరి. ఆపల్లె క్రమముగ నభివృద్ధియై యొకపట్టణమువలె నగునని తోఁచుచుండెను.

ఆగృహిణి బయటి కెన్నఁడును రాదు. వేలకొలఁదివిప్రులు నిరంతరము వచ్చి దానభోజనపరితృప్తులై పోవుచు నామె యొకయోగినియనియు, స్వర్ణయోగరహస్యభేదిని యగుభైరవియనియు, వనలక్ష్మియవతారమనియు, పురుషులకంటెఁ బడ దేల యనియు, దీనివలన నామె కేమిప్రయోజన మనియు, నేచక్రవర్తినియో విరాగమున నిట్లువచ్చియుండవచ్చు ననియుఁ బలువిధములఁ జెప్పుకొనుచుఁ బోవుచుందురు. ఇంతవఱకామెను జూచినవారెవ్వరును లేరు. కాని యామె యార్తుల పాలిఁటి మహాలక్ష్మి యనియుఁ, జల్లనిహృదయము గలకరుణామూర్తియనియు నామెనందఱుఁ గీర్తించుచుండిరి. ఒకరు నిర్ణయించి పేరు పెట్టకపోయినను, గ్రమముగా నెట్లో యామెపేరు వరదరాజమ్మవారని వాడుకలోనికి వచ్చెను. వరదరాజమ్మవారినిఁ జూచినవా రింతవఱకెవ్వరును లేరు.

మందిరప్రాంగణమునఁ గలవిశాల మగునుద్యానవనమంతయు హరిపూజార్హ మగుపుష్పపత్రములు నిచ్చులతావృక్షములతో నిండి

యున్నది. మామిడిగున్నలు గాలికిఁ గదలుచు మేఁత మేయుటకు వచ్చినగజంబులమాడ్కి నచ్చటచ్చటఁ గాన్పించును. అంతఁ బెక్కుచోట్లఁ గలపుష్పలతలపొదరిండ్లు, తరుచ్ఛాయలును శాంతిప్రదములై, పురాణకాలమునాఁటిబుషి వాటికల జ్ఞప్తికిఁ దెచ్చుచుండెను.

వివిధకార్యముల నిర్వర్తించుటకు నియమింపఁబడినపరిచారికలందఱుఁ గాషాయాంబరముల ధరించి చల్లబాటువేళల నాయాతరుచ్ఛాయల నెమరవేయుచుఁ బరుండియున్నమృగశాబకములకును, వృక్షాగ్రభాగముల కెక్కి షడ్జస్వరమునఁ గేకలిడుచుఁ గ్రింద నడయాడుచుఁ బురివిప్పి సువర్ణరత్నఖచితచామరముల విసరునట్లు వికసించుచుఁ బ్రకృతితో నైక్యమై ప్రశాంతానందము నొందుచున్న నెమళ్లకును, వింతయాకృతుల వివిధవివిధములబుతము లొనర్చు పక్షిజాలమునకు నిష్టములగు వేలువేలుమధురాహారములఁ దెచ్చివేసి వానితోఁ గలసి యానందించుచుందురు. అవి యన్నియుఁ బెంపుడుమృగములు, పక్షులు నని యవి యాపరిచారికలకిడఁ జూపుచనువును గనువారికిఁ దోఁచును. నిరంతరకార్యాలోలురును, పరమానందమయప్రకృతిసంపూర్ణాకృతిని గనుఁగొనఁజాలనినాగరికులు నాయాటవికులమహానందమును గ్రహించిచూచినచో నిక నట్టివారు తమనాగరికత నాసహాప్రముఖయగుప్రకృతియెదుట నుంచుకొనఁజాలక భయమున నానాగరికత నావలకుఁ బంపివేసి, తాముఁగూడ నాయాటవికులతోఁ గలియవలయు నని కోరుకొనుచుందురు.

ఆరామమునందుఁ బర్ణకుటీరము లెన్నియో కలవు. అచ్చటచ్చటఁ గలకంతు లెందఱో భక్తితోఁ బాటలఁ బాడుచుందురు. కొందఱు పూలమాలికలఁ గ్రుచ్చుచుందురు. మఱికొందఱు పుష్పములఁ గోయుచుందురు. కొంద ఱానందపారవశ్యమునఁ జొక్కి యోగనిద్రలఁ బోవుచుండిరా యని తోఁచుచుందురు. పరిచారిక లందఱు యుక్త

సమయములఁ జేయవలసినసర్వకార్యములను యథావిధి నిర్వర్తించి, తీరిక వేళల నాయుద్యానవనము కాదు—ఋషివాటిక కించుక మధ్యము ననున్న మందిరమునకుఁ బోయి, యందుఁ గలమురళీధరకృష్ణభగవానుని గీర్తించుపాటలు పాడుచునో, పూలమాలికలసమర్పించుచునో, నైవేద్యముల నర్పించుచునో, భజన చేయుచునో, భక్తిచే నొడలు మఱచి నృత్యము చేయుచునో, కాలము గడపుచుండును. ఆయాభాగములకుఁ బురుషు లెవ్వరును రాకుండునట్లు జాగరూకత తీసికొనువాఁడుక యుండెడిది. వరదరాజమ్మగారిమాహాత్మ్యముననో, ఆమెయెడఁ బ్రజలకుఁ గలభక్తివలననో, భయముననో, యెన్నఁడు నావనముచేరువకైనఁ బురుషు లెవ్వరునురారు. మందిరప్రాంగణమునఁ గలపెద్దపాకలయందు సంతర్పణములు జరుగుచుండును. దానములు పంచిపెట్టఁబడును. ఆభాగమునకుదయభాగమునఁ బురుషులు రావచ్చును. అచ్చటకుఁ బ్రధానమందిరమించుక దూరము. సంతర్పణశాలలు మొదలు ప్రధాన మందిరధవళప్రాకారమువఱకుఁ జక్కని బాట కలదు. దానికిరుప్రక్కలఁ జక్కనిపోకచెట్లు బారులు తీర్చి పాతియుంచిరి. ఆదారిని పరిచారికలే వచ్చుచుఁ బోవుచుందురు. ఆమందిరప్రవేశ మొనరించి యందుండువిశేషముల నరసినవా రింతవఱ కెవ్వరును లేరు.

---

## రెండవ ప్రకరణము.

—(o)—

### ఈమందిరమెవరిది ?

వరదరాజమ్మగారి మందిరమునకొకక్రోసెడు దూరమునఁ గల చిన్నపర్వతము నెక్కి యొకబాలిక వచ్చుచుండెను. ఆమె యొడలంతయుఁ జెమటలు గ్రమ్మి క్రమముగ ధారలుగట్టి యామెధరించిన చీరయు రవికయు సంపూర్ణముగఁ దడిసిపోయెను. ఆమె యొకనది

యందు వస్త్రసహితముగఁ మునిఁగి వచ్చుచున్నట్లు చూపరులకుఁ దోఁచును. ఉన్నపని యామానవనుచు నాబాలిక పైఁటకొంగున వదనముఁ దుడుచుకొనుచు విసుకొనుచు మెల్లఁగ నడచి వచ్చుచుండెను. ఆమె పర్వతాగ్రమున కెక్కుపరి కీమందిర మామెకంటఁ బడెను. బాలిక యుత్సాహముతో నామందిరమువైపునకు దిగి గమనవేగము నభివృద్ధిఁ జేసి యామెకంటఁ బడినకాలిదారిని వచ్చుచుండెను.

"ఇఁక మావార లగపడరు. అబ్బబ్బ! ఈనాలుగుక్రోశములు నడచునరికి నాపని మైనది. కోడికూఁత వేళ బయలుదేరితిని. ఇప్పటికాయాలవికని నాయమున నీమందిరమును గనుఁగొంటిని. తెల్లవారి లేచి నన్నుఁ గానక వెదకిపసిగి తుదకు వారియాత్రకు వారుపోవుదురు. కాలినడకను గాశికిఁ బోవుట మాటలా?" అని యనుకొనుచు నామె యామందిరమును సమీపించెను. అచ్చటి కించుకదూరమునుండి వందలకొలఁది భోజనపదార్థములను గొనిపోవుబండ్లా మెకంటఁ బడెను. బాలిక త్వరగ నాబండ్లను జేరి మందిరవిశేషముల నరసికొనవచ్చు నని తలంచెను. ఆమె చరచర నడచుచుండెను. ఎంత నడచిన నడుగులో నడుగు పడుటచే నాబాలిక దూరమునఁ బోవుచున్న యాబండ్లను గాని, పలువిధములగుశాకములఁ బేపపుటికల నుంచి తీసికొనుపోవు స్త్రీపురుషులను గాని యామె చేరలేకపోయెను.

కొంతవడి కాబాలిక బోదులుకట్టిన మందిరసమీపారామభూమిలోనికి వచ్చెను. దూరమున నిమ్మపండ్లను గోయుచున్న యొకపరిచారిక యాబాలికను జూచి యెదురేగిఁ వాసస్థాను మెఱిఁగి కుశలప్రశ్న మొనరించి, కంటకములతో బొబ్బలెక్కునట్లు నడచినబాలిక యొంటరితనమునకు వెఱఁగంది, మందిరములోనికిఁ దీసికొనపోవుచుండెను.

"నీవెవ్వవు?" అని బాలిక యడిగెను.

"నేనీమందిరమున నొకపరిచారికను." అని నిమ్మపండ్లను గోసి నవనిత పలికెను.

"ఈమందిర మెవరిది?" అని బాలిక యడిగెను.

"వరదరాజమ్మ వారిదని యెఱుఁగరా?" అని పరిచారిక బదులుచెప్పెను.

"ఆమె మీయధికారిణియా? అయిన నీమెదేయూరు? ఎందుల కీధర్మములు చేయుచున్నది?" అని బాలిక యడిగెను.

"అమ్మా! ఆప్రశ్నములకుఁ బ్రత్యుత్తరము లిచ్చుటకు మా కనుజ్ఞ లేదు. తెలిసికొనుటవలన మీకును బ్రయోజనము లేదు." అని పరిచారిక యనెను.

"మా కవసరము లేనిసంగతి నీ కెట్లు తెలియును? సాహాయ్యము పొందుదాతపే రెవ్వరో, యునికి యెచ్చటనో పరిగ్రహీతకుఁ దెలియవలదా?" అని బాలిక యనెను.

"దానము చేయుటకుముందే ప్రకటనము కొఱకు లోహశిలాశాసనముల నొనరుచు కొందఱివలె మా యమ్మవా రిష్టపడరు. పైఁగ నది దాంభికవృత్తి యని యామె నిందించును. నిజమైనపేరు దెలిపినఁ జిరకీర్తి గందు రన—మనకుఁ గీర్తియు నక్కఱలేదు. మనము దైవసేవకులము. చేతనయినంతలో మనల నాతఁడు నమ్మి యొప్పగించిన సొత్తు నాతనిప్రపంచమున వలసిన వారికి వలసినంత పాత్రాపాత్రవివేకముతో నిచ్చివేసి మనభారము మనము వదల్చుకొనవలయును. మనల నీప్రదేశములకే కార్యములు నిర్వహింపఁ జేయునుద్దేశముతో దైవ మంపెనో యాకార్యములఁ జేయుటయే మనపని యని యామె చెప్పుచుండును." అని పరిచారిక యనెను.

"మంచిది. ఆమెసొమ్మనను కానిది—పేరు తెలియనిది—సాయము పొంద నిష్టముండనివా రుందు రట్టివారివిషయము? —" అని బాలిక యనుచుండ

"మీకు సాహాయ్యమే ప్రధానము కాని తక్కినవిషయమ్ము

లత్యవసరమును కావు. మీ కాపట్టుదల యేల ? మఱియు నామె— “మీరు బ్రాహ్మణులా ?—” అని పరిచారిక యడిగి బాలికను జూచెను.

“అవును!” అని బాలిక బదులు చెప్పుచు నావనసౌందర్యమును గాని, ప్రక్క నూతనముగ వచ్చినతన్నుఁ జూచి బెదరి చంచలకటాక్షముల మెఱుఁగు లభివృద్ధి యగునట్లు చెంగుచెంగున దుమికిపోవు లేళ్లనుగాని యామె పరిశీలించుటలేదు. వారు మందిరమును సమీపించిరి.

“మాయమ్మవారికి బ్రాహ్మణస్త్రీలు—కాదు—స్త్రీలను జూచుట కభ్యంతరము లేదు.” అని పరిచారిక యనుచుండ మఱియొకపరిచారిక సరిగ నట్టివస్త్రములతోడనే బయటికి వచ్చి “ఏమి యీ పెండ్లినడకలు ? అవలఁ జిత్రాన్నములోనికి— తేట మజ్జిగలోనికి—నిమ్మకాయలు లేవని తొందరపడుచున్నారు. రమ్ము! రమ్ము! సరళా!” అని యఱచి యించుక కోపపడెను.

“అమ్మవారిదర్శనమున కీమె వచ్చినారు.” అనుచు నాముప్వురు నామందిరములోనికిఁ బోయిరి. నిర్ణీతకృత్యముల నెఱవేర్చుకొని సరళ యీవలకు వచ్చి బ్రాహ్మణబాలికను దీసికొని లోనికిఁ బోయెను.

ఆమె పింగళిసూరనార్యునిభార్య యనియు, భర్త కాశికిఁ బోవుట విని కొందఱాయూరివారు కాశికిఁ బోవుచుండ వారివెంట బయలుదేరి, భర్త కాశినుండి మఱలి విజయనగరమునకు వచ్చెనని విని యామె వెనుకకుఁ బోవుటకుఁ దలంప నాయూరివారామెను విడువలేదనియు, తుదకామె వారల విడిచి విజయనగరము పోవునుద్దేశముతో నీమందిరముకడకు సాహాయ్యార్థము వచ్చినట్లుగ నాబాలిక చెప్పినదని పరిచారికలనుకొనిరి. వరదరాజమ్మవారు బాలికకు వలసినసాయ మొనర్చుట కంగీకరించినదని వేఱ చెప్పనక్కఱలేదు. కొన్నిదినములా బాలిక నచ్చటనే యుండుమని తమప్రభ్వి కోరినట్లుకూడ వారు చెప్పుకొనిరి.

## షోడశ ప్రకరణము.

—o—

### పరార్థపరత్వము.

కడచినవత్సరమున వానలు గురియక పోవుటవలనఁ బంటలంతగాఁ బండలేదు. వర్షములు కొలఁదిగ గురిసిన నాచుట్టుప్రక్కలఁ బంటచెరువులు లేకపోవుటవలనఁ బ్రజలు త్రాగుటకైన నీరము లేక బాధల నొందుచుండిరి. వరదరాజమ్మగారి కార్తజనులను రక్షింపవలసిన భార మధిక మయ్యెను. ఆమె యాభారమును సంతోషపూర్వకముగ నంగీకరించెను. ప్రజల కన్నదాన మపరిమిత మగుచుండెను. లక్షలకొలఁది ధనవ్యయము చేయించి భోజనపదార్థముల నాప్రాంతప్రదేశముల నుండి ప్రతిదినముఁ దెప్పించి యామె జనులఁ బోషించుచుండెను. అచ్చటికి వచ్చిన రాతిపనివాండ్రు, బీదలగునువ్వరులు, నితరప్రజలుఁ బ్రతిదినము నన్నపూర్ణాదేవిసత్రమున భుజియించి యామె యాజ్ఞననుసరించి యామందిరమున కించుక దూరమునఁ గల యాపెద్ద కొండలోయయొద్దఁ బనిచేయుచుండిరి. మూఁడువైపుల నత్యున్నతములయిన కొండలు గలవు. వానిపై నెన్నియోవేలదుక్కల వర్షము గురియుచుండును. ఆనీరంతయుఁ గొండవాగులఁ బడి నిరుపయోగమై పోవుచుండెను. అది చూచి వరదరాజమ్మగారాలోయయందుఁ గురియునీరంతయుఁ బ్రయోజనపడుటకు నాల్గవ వైపున నొకపెద్దకట్టఁ బోయించుచుండెను. ఆకట్ట సంపూర్ణమైనఁ గొన్ని వందలచతురపు గోశముల మేర నీరు నిలువయుండి పెద్దతటాకమైనచోఁ బ్రాంతపుజనులకుఁ గఱవు కఱ వగునని యామె తలఁచె. వేసవి యంతయుఁ బనిచేసి వేలకొలఁదిప్రజలు కష్టపడుచుండిరి. నాల్గవపట్టు పుఱల నొకకొండయంతకట్టఁ బోయుచుండిరి. అది యింకను బూర్తికాలేదు. ఇంతలో నొకటి రెండు కాఱువర్షము లకాలమునఁ గురిసి యామె యనుకొనినట్లు తటాకమంతయు నిండిపో

యెను. పనివాండ్రు కష్టపడి కట్ట పూర్తి చేసిరి. కాని గట్టు నూతనమైనదగుట నాదబాటుగఁ గురిసిన వర్షము దెబ్బ కాగట్టు తూటుపడి తెగిపోయెను. నీరంతయుఁ బోవుచుండెను. వనమధ్యమున నిక్షేపము దొరికినప్పుడు దొంగలు కొట్టినచో నెట్లు నిరుపేద విచార మొందునో యట్లాప్రాంతపు బ్రజ లందఱుఁ దమకు నూతనముగ లభించి, తమపొలముల సుక్షేత్రములఁ జేయుననుకొనిన చెరువుకట్ట తెగుట కెంతయు దురపిల్లిరి. ఆగండి కట్టినచో రత్నాభరణములు బహుమాన మొసంగెద నని వరదరాజమ్మవారు ప్రకటించిరి. వేలకొలఁది జనులు వచ్చి తట్టలతో రాళ్లను మన్నును బోయుచు శక్తివంచన లేకుండఁ గష్టపడుచుండిరి. కాని గండి కప్ప లేకపోయిరి.

ఈసందిగ్ధసమయమున నొకనాఁడు వరదరాజమ్మవారు మందిరోపరిభాగమునఁ గూరుచుండి చూపుతడక లోనుండి పనిచేయుచున్న వేలకొలఁదిమనుజులఁ జూచుచుఁ, బ్రక్కనుగూరుచుండిన పింగళిసూరనార్యునిభార్య యగుపార్వతితో నీవిధముగ సంభాషించుచుండెను.

“తల్లీ! మీభర్త మీతాతగారిని జూచుటకు వచ్చుచుండిరని తెలిసినప్పు డది సత్యమే యైయుండును. ఆయన సంపూర్ణముగఁ బాండిత్యసంపాదన మొనర్పనియెడలఁ దాతగారికడకు రాఁడు. మీరు మన మంచిపరిచారిక వచ్చుతోడనే విజయనగరమునకుఁ బోవచ్చును.” అని వరదరాజమ్మవా రనెను.

“దేవీ! మీమాటలవలన ధైర్యము కలుగుచున్నది. ఆర్తజనుల రక్షించుమీదే నాభారము. మీయండ కెట్లో భగవంతుఁడు చేర్చెను. భర్తను విడిచి పదివత్సరములనుండి దినములఁ బుచ్చుచున్న నాదు స్థితికి మీరు జాలిపడి యాదరించినట్లు—నన్నిదివఱ కెవ్వరుఁ గరుణతో నాదరింపలేదు.” అని బాలిక కన్నీటితోఁ బ్రత్యుత్తర మిచ్చెను.

“ధైర్యముఁ జిక్కఁబట్టి యింతవఱకు భర్త్రన్వేషణాసక్తవై

చేసినపనులఁ జెప్పి మమ్మాశ్చర్యాంబుధిని దేల్చితివి. అక్కా! అట్లు దుఃఖించుట మంచిది కాదు. చేసికొనినకర్మ మనుభవింప వలయును. మఱియు మిమ్మేమిభర్త మీపైఁగోపమునఁ బరిత్యజించెనా? చదువు కొనుటకుఁగాశికిఁ బోయినయాతనికొఱకింతవగ పేల? మఱియు నాతఁడు స్వగ్రామ మగుపింగళి పోక భార్యను జూచుటకే విజయనగరము నకుఁ బోయియుండును. దుఃఖింపకుఁ డమ్మా! సర్వవిధముల శుభ మగును." అని వరదరాజమ్మవారు చెప్పుచుండిరి.

స్వర్ణలతను బోలుశరీరకాంతులును, శిరీషపుష్పసదృశ కోమలత్వమును, గలిగి సర్వవిధముల నతిసౌందర్యవతి యగునా వరదరాజమ్మ వారు ప్రజ లనుకొనునట్లు సత్యముగ స్వర్గమునుండి దిగివచ్చిన యప్సరోంగనయో యనిసందియ మొదవించును. పండుతమలపాకులవంటి పలుచని చెక్కిళ్లును, జడలుకట్టినకుటిలకుంతలములును పురుషు లెవ్వరు లేకుంట నచ్చటచ్చట నదీగర్భమున బయలుపడిన సైకతశ్రేణులవలె వస్త్రమధ్యమునుండి తెల్లఁబారిపోవుచునగపడుచున్న శరీరసౌందర్యమును జూచి యామె సంపూర్ణ సౌందర్యమూర్తి నిచ్చటఁ జిత్రించుటకుఁ గుతూహలము కలుగుచున్నది. కాని యామె కాషాయాంబరముల ధరించి యున్నది. సర్వాభరణముల నామె తీసివైచిన మానవా ళ్లామె శరీరమునం దాయాభాగమున ముద్రితములై యున్నవి. శుద్ధసాత్విక స్వరూపిణియు, శాంతిప్రదప్రఫుల్లవదనయుఁ, గరుణాస్వరూపిణియు, వైరాగ్యమూర్తియు నగునాకాంతామణిని జూచి కన్నులమిఱుమిట్లుఁ గొలుపునా తేజస్స్వరూపమునకు వినమ్రులమై యామె సౌందర్యమును జిత్రించుపని మానుకొనవలసి వచ్చినది.

ఆతేజస్స్వరూపిణి పార్వతి నట్లనునయించుచు, జపమాలికను ద్రిప్పుకొనుచు, మఱల నింకొకనిముసములోఁ గలుగుకన్నీటిని మాటుప ఱచుకొనుచు నేదియో తలపోయుచుండ నొకపరిచారిక వచ్చి "మన

గొల్లది — కృష్ణవేణి—శివశక్తియై యాడుచు వచ్చినది. మందిరప్రాంగణమునఁ గలదు" అనిచెప్పెను.

మందిరమునకుఁ గ్రిందిభాగమున "అమ్మా! అమ్మా! వరదరాజమ్మాయి—అమ్మా!" అని యొకగొల్లది శక్తిపూనినట్లు కేకలు వైచుచుండెను.

"దర్శనము కావలయు ననుచున్నది. బలవంతముగ లోపలఁ బ్రవేశింపఁ దలఁచుచున్నది. ఎంతమంది పట్టుకొనిన నాఁగుటలేదు. ద్వారము బంధించితిమి." అని మరియొకపరిచారిక వచ్చి చెప్పెను.

ఇంతలోఁ గ్రిందిద్వారముతలుపులు శివశక్తి బ్రద్దలగునట్లు తన్నుచుండెను. "ఆమెనురానిండు!" అని వరదరాజమ్మ యానతియిచ్చి క్రిందకు దిగివచ్చెను.

అంతట వేపరొట్ట చేతఁబూనినయాశివశక్తి—శరీరమంతయుఁ బసపుతో నిండినయావ్యక్తి—కన్నుల మూసికొని, తల విరయఁబోసి "అమ్మా! లక్షలున్యాయపటిచినారు—కట్ట నిలువఁ బడలేదు—నా భక్తురాలి కొడుకులు—ఇద్దఱుకొడుకులు—రామలక్ష్మణులు—చినకంబఁడొకఁడు—పెదకంబఁడొకఁడు—రాత్రి కల గన్నారు—నేనే చెప్పినాను—వారిద్దఱను గండిలోఁ బారవైచి—పైని మన్ను తట్టలఁ బోయింపుఁడు—గండి పూడును—వారికిఁ జిరకీర్తి—ప్రజల కుపయోగము—కల సత్యము. కలలో నేనే చెప్పినాను—బత్తురాలా! నీకోరిక లీడేరెను—నీధర్మము వర్ధిల్లును—నీదానము వర్ధిల్లును—బత్తురాలా! నీవాబిడ్డల పేరు శాశ్వతమగునట్లు—క్రొత్తగాఁ గట్టించినవల్లెకుఁ గంబమని పేరుపెట్టుము" అని చెప్పి యాయాసపడుచుండెను.

"తల్లీ! భగవతీ! నీవిట్లీబిడల బాధించుటకు బదులాగండి నీకరుణామాత్రముననే కట్టింపరాదా? నాకీక్రూరకృత్యమున కేల యానతిచ్చెదవు. తల్లీ!" అని వరదరాజమ్మ యాశివశక్తికి నమస్కరించెను.

"వారు నాభక్తులు—వారికిఁ గీర్తి—నాయాజ్ఞకు వ్యతిరేకము వలదు—నాభక్తురాలైన యీకృష్ణవేణి తనయిరువురు పుత్రుల నీమహాకార్యమునకు బలి యిచ్చుచుండ నీకేమి భయము—" అని శివశక్తి చెప్పె వరదరాజమ్మగారు చెప్పుప్రత్యుత్తరమును వినకయే పరిచారికల నొత్తిగించుకొని మందిరముఁ గావలఁ బడి "నడువుఁడు! రండు!" అని యఱచుచు మందిరప్రాంగణమున వేచియున్న జనులు వెంటఁబరుగెత్తుకొనిరాఁగాఁ జెరువుగండిపైపునకుఁ బరువెత్తుకొనిపోయెను.

డప్పులు వాయించుచుండ నృత్యము చేయుచున్న చినకంబఁడు, పెదకంబఁడు "ధన్యులగుఁడు! తల్లిగారిసెలవైనది!" అని యఱచుచు వచ్చుచున్న తమవృద్ధజననిం జూచి మఱింత గూడుచు నుత్సాహాతిరేకమున నొక్కమాఱుగ నాగండిలోనికి గుభాలున నుఱికిరి. పనివాండ్రును, జూడవచ్చిన లక్షలకొలఁది ప్రజలును దలయొకతట్ట మట్టియు నాగండిలోఁ బారఁబోసిరి. తట్టలు దొరకనివారు తమకు దొరికినరాళ్లను విసరిరి. ఉత్సాహాతిరేకమున విసరినమంటితో నారాళ్లెత్తుకొని పాతికగడియలో నాగండి పూడెను. "హరాహరా! గోవిందా! గంగమ్మతల్లీ! వరదరాజమ్మగారు." అను కేకలతో నాప్రజలు గండి కట్టినందుల కెంతయు సంతసముతోఁ గేకలు వేయుచుండిరి.

ఇంతలో నారంగినాయుని వరదరాజమ్మగారాయిరువుర నాగండిలోఁ బడనీయవల దని పంపినయాజ్ఞ ననుసరించి యొకపరిచారిక పరువెత్తుకొని వచ్చెను. ఆమె వచ్చుటలోఁ గలిగిన యాలస్యమువలన నాయాజ్ఞ నిరుపయోగ మయ్యెను.

ఇరువురుపురుషులు స్వార్థమును వీడి— ప్రజలయం దుత్సాహోద్రేకము గలిగించి శాశ్వతముగ లక్షలకొలఁదిజనుల కుపయోగపడు మహాధర్మకార్యమునకుఁ దమప్రాణము లర్పించి, పెండ్లికొడుకులవలె నుత్సాహముతో నందుఁబడి మరణించిరి. ప్రజలసమ్మతమువలన నాకార్యము కొనసాగెను.

వరదరాజమ్మగారీసంగతి నంతయు విని, శివశక్తితోఁ గేకలిడుచుఁ బరువెత్తుచున్న జనసమూహము కేకల విని, మిక్కిలి విచారించెను. తుద కా నిస్వార్థత్యాగుల — మూఢభక్తుల — నజరామరకీర్తిమంతులఁ జేయఁదలఁచి తనమందిరమున కించుక దూరమున నూతనముగ బయలుదేరిన పెద్దపల్లెను గొల్లపల్లెను * పెదకంబము, చినకంబమునని పేరిడి, లక్షలకొలఁది ప్రజల కన్నమిడెను.



## నాల్గవ ప్రకరణము.

—(o)—

### ఆతఁడు నాభర్తయే.

“ఆతఁడు నాభర్తయే!” అని పార్వతి యనెను.

“మీ రెట్లు కనుఁగొంటిరి?” అని వరదరాజమ్మగా రడిగెను.

“విజయనగరమునుండి దాసి వచ్చి, మాతాతగారిని గనుగొంటిననియు, నాభర్త రాలేదనియుఁ జెప్పినది మొదలిక మీకడనే యుండి, శక్తికొలఁది నతిథిసేవయొనర్చుచుండఁ దలఁచితిని. నేఁడు భోజనశాలయందు బ్రాహ్మణులకు వడ్డనఁ జేయుచుంటిని. మీయనుగ్రహమువలన వారిచ్చటకు దయచేసిరి.” అని పార్వతి యనెను.

“అయినచో వారప్పుడు మిమ్ముఁ జూడలేదా?” అని వరదరాజమ్మగా రడిగెను.

“నేను దూరమునుండియే చూచి వెనుకకు వచ్చితిని.” అని పార్వతి యనెను.

“వారినామధేయ మేమి?” అని వరదరాజమ్మగా రడిగెను.

పార్వతి సిగ్గుపడి యొకపత్రము తీసి దానిపై “పింగళి సూరనార్యుఁడు” అని వ్రాసి వరదరాజమ్మగారి కిచ్చెను.

---

* (ఇప్పటి కాపల్లెలే కలిసిపోయి కంబమనుపట్టణముగా మారిపోయినట్లు స్థలజ్ఞులు చెప్పుదురు.)

« మీ రొక లేఖ వ్రాయుఁడు " అని వరదరాజమ్మగా రనెను.

« నే నట్లొనర్పఁజాలను." అని పార్వతి తలవంచుకొని మందహాస మొనర్చెను.

" మంచిది మీ రిట నుండుఁడు ! భోజనము లగుటతోడనే పెండ్లికొమరుని బిలిపింతుము." అని నవ్వుచు వరదరాజమ్మగా రనెను.

భోజనశాలయందు « మామిడిపండ్లబుంగ లిఁక వలదు. పనస తొనలు తెండు. పెరుఁగుకడవ లెక్కడ ? ఇప్పుడు నేయి యెందులకు? అన్నపుఁబళ్లెరములు ! చవి తీసికొనిరండు !" అని బ్రాహ్మణులు కేకలు వేయుచుండిరి. శక్తికొలఁదిఁ బెరుఁగు నందఱు జుఱ్ఱుచుండిరి. కొంతవడి కన్నపూర్ణాష్టకమును జదివిరి. « గోవిందా !" యను కేకలతో భోజనములు ముగిసెను. పరిచారికలు తాంబూలములఁ బళ్లెరముల నుంచి « కుంకుమపువ్వుబరిణెలఁ దెండు !" అని యనుచుండిరి.

అప్పుడు వరదరాజమ్మగా రొకదాసిని బిలిచి « నేఁడు వచ్చిన యతిథులకడకుఁ బోయి దక్షిణతాంబూలము లొసఁగినపిమ్మట వారిలో నెవరు తాంబూలముమాత్రమే తీసికొని దక్షిణతీసికొనరో వారి నిటకుఁ దీసికొనిరమ్ము!" అని చెప్పెను. " చిత్తము!" అని పరిచారిక వెడలిపోయెను.

కొంతవడికి మేడమీఁదఁ బుస్తకభాండాగారముకడనున్న చావడిలోఁ దెరకావల నొకపీఠము వేయఁబడియుండెను. అచ్చటకు సూరనార్యుని దీసికొని దాసి వచ్చి పీఠముపైఁ గూరుచుండుఁ డనెను.

« నాతోఁ బని యేమున్నది?" అని రమారమి యిరువదివత్సరములు దాఁటిన బక్కపలుచని యాకారమునున్న సూరనార్యుఁడడిగెను,

« మాదేవిగారిసెలవైనది." అని చెప్పి దాసి వెడలిపోయెను. ఒక యరగడియకాలము గడచెను.

ఇంతలోఁ దెరచాటునఁ గంకణరవము వినఁబడెను. సూరన తె

ర్వై పునకుఁ దిరిగి చూచెను. ఎవ్వరు నగపడలేదు. తెరగుడ్డ గాలికిఁ గావలయును గదలుచుండెను. కొంతవడికి "మీకుఁ గాశీనివాసము సౌఖ్యప్రదముగఁ గడచినదా ?" అని యెవరో ప్రశ్నించినది సూర నార్యునకు వినఁబడెను.

"చిత్రము! నన్నా యడుగుచున్నది?" అని సూరనార్యుఁడు భయప్రదర్శక సుగుచూపుతో ననెను.

"అవును." అని లోపలనుండి యనిరి.

"నాకు సౌఖ్యప్రదముగనే యుండెను." అనుచు సూరనార్యుఁ డు తన్నా మందిరమున నెఱిఁగినవా రెవరై యుందురని యాశ్చర్యము నొందుచుండెను.

"విద్యాభ్యాసము పూర్తియైనదా ?" అని మఱలఁ బ్రశ్న.

"విద్యకుఁ బూర్తియెక్కడకు—ఏదియో కొంతవఱకుఁ గృషి చేసితిని." అని సూరనార్యుఁ డనెను.

"ఇంత తొందరగ వచ్చితిరి. బంధుజనులను జూచుటకా ? పిం గళి పోయి మీతల్లిగారిని జూచివచ్చితిరా ?" అని ప్రశ్నలు.

ఈమందిరమునఁ గలవా రెవరు ? తన్నీప్రశ్న లొనరించువా రెవరు ? తనకథనంతయు నెఱిఁగినవా రెవరు ? అనుసందేహములు సూరనార్యుని బాధించుచుండెను. తాను ప్రత్యుత్తర మీయవలయు నో లేదో తెలియదు.

"ఈప్రశ్నము లొనరించువా రెవరో తెలియఁబలుకుఁడని నేను గోరనగునా ?" అని సూరనార్యుఁ డనెను.

"ఎవ రైననేమి ? మీయోగక్షేమముల నడుగువారు మీబం ధుమిత్రులై యుందురు. మీ కీసందేహ మేల ? మీరిప్పుడు విజయన గరమే పోవుచుండిరా ?" అని ప్రశ్నలు తెరచాటునుండి వచ్చెను. ఏమి బదులు చెప్పిన నేమిప్రమాదమో యనియో, తానున్నది తాక మానదనియో,

"చిత్తము! రాఘవపాండవీయమును రచియించుచుంటిని. అది మాతాతగారికి వినిపింపవలయును. అందులకుఁ బోవుచుంటిని." అని సూరనార్యుఁడనెను.

"మీరు భోజనసమయమునఁ జదివిన పద్యములను వింటిమి. మీరు మమ్ముల నానందపఱచుటకై బహుమానము లందవలయును." అని తెరచాటునుండి పలికిరి.

అప్పుడొక బాలిక రెండుబంగరుపళ్లెరములతో సేలువులు, మొహోరీలు, ఫలములు తీసికొనివచ్చి సూరనార్యునిముందుంచి తన మెడయందున్నరత్నహారమునుదీసి యాతనిమెడలో వైచి తలవంచుకొని వెడలిపోయెను.

సూరనార్యుఁడామె నానవాలుపట్టెను. ఆమె యాతనిభార్యయే!

---

## ఐదవ ప్రకరణము.

—o—

### వేఁట.

వందలకొలఁది వేఁటకాండ్రు ఉరులు, వలలు, బాణములు, గాలములు, బోనులు, మున్నగు వేఁటసాధనములతో నడవిలో నలుప్రక్కలఁ బొదలమాటునఁ బడి నేలయీనినట్లు వచ్చుచుండిరి. డప్పులవాండ్రు వింత కేకలిడుచు ధ్వనులఁ జేయుచు నీజనసమూహమును జూచి తోఁకలు ముడుచుకొనిపొదలనక్కిన మృగములఁ గడచిన రేయి కడుపునిండ మాంసము మెక్కి గుహలనిద్రించుజంతువుల, బెదరించుచుఁ బోవుచుండిరి. కొందఱు శూరులు తమమేలిక మెప్పువడయుటకు భయంకరమృగముల సమీపముగనే చెవిఁబట్టి యీడ్చి తెచ్చుచుండిరి. అడవిపందులు, శార్దూలములు, మొదలగుక్రూరజంతువుల నురులఁ బట్టుటకు మాటులొగ్గుచుండిరి. ఏతత్ప్రాంతక్షేత్రములయందలి వం

టుం గడుపారఁదినుటతోఁ దృప్తినొందక పాడుచేసినపాపముఫలింప, నిర్దోషులగుమనుజుల, సాధులగుమృగముల, సాత్వికస్వరూపము లగు గోవులనేమరిపాటునఁబట్టి వాఁడికోరలఁ జీల్చి భక్షించినదురాగతములు తుంచవమునిండ, ఎందఱకొలఁదిభీకరమృగము లావేఁటకాండ్రబారిని బడి యరణ్యమంతయుఁ బీనుఁగులపెంటయనుట భయంకరమైనను, ముందీక్రూరమృగములవలన బాధలు బొడసూపవని యందఱు నుత్సాహము చెందుచుండిరి.

అప్పు డొకపారసీకతురంగము నెక్కి కృష్ణరాయ లైదారుగురు సామంతులు వెంటరా శరవేగమున నొక పెద్దపులిని దఱుముచుఁ బొదలఁ జంగుచంగున నవలీలదాఁటు నశ్వరాజముల నుత్సాహమొసఁగుచు నావనమధ్యమున కుఱుకుచు వచ్చెను. వేటకాండ్రందఱు తమతమయాయుధములఁ దీసి చెట్లనుండి యుఱుకుచుఁ రుప్పలపై దుముకుచుఁ బరువెత్తుకొని వెనువెంట వచ్చుచుండిరి. ప్రాణాపాయమునకు వెఱచియో, రాజకంఠీరవుండగు రాయలమూర్తికి బెదరియో, బల్లెమునకు భయమందియో శార్దూలము వాయువేగమునఁ బరువెత్తుకొని పోవుచుండెను. రాయలదివఱకు విడిచిన రెండుమూడుబాణములు పులియొంట నాటుకొని యాభాగములు రక్తసిక్తములై యుండుటచే నారాజసింహుని బాణాహతి రుచియెఱిఁగిన యావ్యాఘ్రము ప్రాణములపై దీపిచే, బాణములుశరీరమున వ్రేలుచు బాధించుచున్నను లెక్కసేయక పాఱిపోవుచుండెను. దెబ్బతినినపులి యట్లు పాఱిపోవుట విచిత్రముగ నున్నదని యందఱు నాశ్చర్యము నొందుచుండిరి.

కొంతవడి కాపులి యలసి యొకపొదచాపునకుఁ జేరి కూరుచుండి వచ్చుచున్న రాయలయశ్వమును జూచి భీకరముగ రొప్పి, బాణములు తగిలినచోటఁ గారుచున్నరక్తమును నాకి బాణములఁ బెఱుకకోనఁ బ్రయత్నించి పొదలోనికిఁ బోవను. అందు రెండుపులిపిల్లలు లో

యాఁడుపులిప్రక్కను బరుండి పాలు ద్రావుచుండెను. పాలుద్రావుచున్నబిడ్డల నాకుచు, వాలముల నెత్తి యూఁకొనుచున్నతల్లిపులి, తనపొద కించుకదూరమున నాపల ధ్వనిచేసినపులిని జూచి మఱలఁ దనబిడ్డలఁ జూచుచుండెను. ఇంతలో రాయలు వైచిన రెండుబాణము లామగపులికిఁ దగిలెను. అది మఱల బాధనొందుచు వికారముగ నఱచుచు నిరువదిముప్పది బారల దూరములోనికి దుముకుచు నప్పుడే వచ్చుచున్న రాయల యశ్వముమీఁది కాపులి యుఱికెను. రాయలు బాణమువైచుటకు దూరము చాలక సరిగ గుఱిచూచుకొని బల్లెము నావులించుచుఁ దనవైపున కుఱుకుచున్న పులినోటిలోనికి గ్రుచ్చెను. ఆదెబ్బకామగపులి యావులించి, కాలితో బల్లెము నీవలకుఁ ద్రిప్పఁబోయి కన్నులుమూసికొని పై కెగసెను. బల్లెము మఱింత నోటిలోనికి దిగిపోయెను.

ఈసందడి కింతలోఁ బొదనున్న యాఁడుపులి యీవలకు వచ్చి రాయల యశ్వముపై వెనుకపాటున నుఱికి కసిదీర్చుకొనఁ దలంచెను. రాయ లాయాఁడుపులిని జూడ లేదు. వెంటవచ్చు నాశ్వికులు "పులి! పులి!" యని యఱచుచుఁ గొమ్ముల నూఁదుచు, బాణముల విడుచుచు గుఱ్ఱములఁ బరుగెత్తించుకొని వచ్చుచుండిరి. ఈయల్లరి వినులోపల రాయ లెక్కిన గుఱ్ఱము క్రిందకుఁ బడిపోయెను. రాయలు వెనుకకుఁ దిరిగిచూచుసరికిఁ బులి యాతనిపైకి భయంకరాకారమున దుముకుటకు సిద్ధముగ నుండెను. ఇంతలోఁ బులిపిల్లలు గూడ నీవలకుఁ దల్లికడకుఁ బరువెత్తుకొని వచ్చి చచ్చిపడియున్న పులిని జూచుచు, తమశత్రువగు వింతమనుజుని యాకారమును, వానిపై కుఱుకుచున్న తమతల్లిని జూచుచు నివ్వెరపడియుండుట రాయలు చూచెను. మగపులి నోటగ్రుచ్చినబల్లెము, బలిష్ఠమగునాపులి మరణబాధ నొందుచు గింజుకొనుటలో నాతనిచేతినుండి విరిగిపోయెను.

రాయ లేమిచేయుటకును దోఁచక పులిపిల్లలవైపునకుఁ జూచువరి కాతనికి నవ్వువచ్చెను. ఇదియంతయు నొక్కత్రుటికాలమున జరిగి పోయెను. పులి బరువునకుఁ గ్రుంగి కాలుజారినయశ్వము మఱల లేచెను. క్రిందఁ బడినరాయలు తనచేతియందున్న బల్లెముకఱ్ఱ నెపముచేత నడ్డముపెట్టి యాతఁడు గుఱ్ఱముపై కుఱికెను. అశ్వము వెనుకకు నాలుగైదుబారలు పోయి తాఁగజున్నవలె నాఁడుపులివైపున కుఱికెను. రాయ లింతలోఁ దనయొరనుండి కరవాలమును దీసికొనెను. దానితళతళలకు వెఱచి పులి ప్రక్కపొదచాటునకు దుమికెను. ఇంతలో నాశ్వికు లాభాగమునకు వచ్చిరి.

అప్పటికి నాలుగుగడియలు ప్రొద్దుకంటె నధికముగ లేదు. అపాయకర మగుసమయమునఁ దన్నాకస్మికముగ నడ్డగించిన పులిని వెదకుచు రాయ లాయడవిఁబడి పోవుచుండెను. ఆశ్వికులు పులిపిల్లలను బట్టించి రాయలు పోయినమార్గము ననుసరించిరి. వా రెంతదూరము పోయినను రాయలజాడ లగపడలేదు. ఇంతలో సాయంకాలమై చీఁకటు లెల్లెడల వ్యాపించెను. వేటకాండ్రు పాలకఱ్ఱలమంటలు వెలిగించిరి. వారందఱు నాసాంద్రతరకాళరాత్రియం దాయరణ్యముననే నిలిచిపోయిరి. ఎంతరాత్రియైన రాయ లగపడలేదు.

---

## ఆఱవ ప్రకరణము.

—(0)—

### యోగిని.

అప్పుడే చంద్రోదయ మయ్యెను. ఆకాశ మంతయు నిర్మలముగ నుండుటచే జాబిల్లి సుధాధవళరుచుల నీనుచు లోకమనోహరముగ మింటఁ గ్రాలుచుండెను. అది వసంతకాలమగుటచే మామిడిగున్నల వ్రేలాడుపరిపక్వఫలము లావెన్నెలలో మెఱయుచుండెను. వరదరాజు

మ్మగారు మందిరమునకు వెనుకభాగమునఁ గలతోఁటయందుఁ జివర భాగమున నున్న యొక పర్ణకుటీరమునఁ గన్నులు మూసికొని భక్తితత్పరమానసయై యుండెను. ఆమె యొకపక్షమునుండి దీక్షవహించి యుపవాసములతో నాపర్ణకుటీరమున వసియించుచుండెను. ఎప్పుడైన నొకటిరెండు కందమూలముల భుజించి యిన్ని నీరములఁ ద్రావుచుండెను. ఆకుటీరమున కామె కించుకదూరమున నగ్నికుండమున మోదుగచితుకులు నుసియై యుండెను. ప్రక్క దూగదూరమున నున్న పూఁబొదరిండ్లఁ బరిచారికలు వసియించి గీతములఁ బాడి రాత్రి జాముగుటచే నెచ్చటివా రచ్చటనే నిద్రించుచుండిరి. చల్లగాలి మెల్లఁగ వీచుచుండుటచే నొకమూలఁబట్టిన నల్లనిమబ్బు క్రమముగా వృద్ధి యగుచుండెను.

ఇంతలో నాపర్ణకుటీరముకడ కొక యాశ్వికుఁడు వచ్చెను. ఆ వెన్నెలయం దా యాశ్వికుని యొడలిపైనున్న విలువగలదుస్తులును, రత్నాభరణములును మెఱయుచుండెను. ఆతఁ డాయుధధారుఁడై యుండెను. ఆకుటీరము కంట బడఁగనే యాతఁడశ్వమును నిలిపి క్రింద కుఱికెను. అచ్చట మనుజు లెవ్వరును గాన్పింపలేదు. అశ్వమును నిలిపి, కళ్లెమునకుఁ గట్టియున్న యెఱ్ఱపట్టుతాళ్ల నశ్వముమెడపైనుంచి చేతనున్న కమిచీ కఱ్ఱతోఁ దెఱచియున్న యాపర్ణకుటీరద్వారమును సమీపించి "ఇచ్చటఁ జేరువపల్లెకు మార్గముఁ జూపఁగలవా రెవ్వరైనఁ గలరా?" యని ప్రశ్నించెను. ప్రత్యుత్తరము లేదు.

ఆతఁ డించుక లోని కరుగుసరికి నచ్చట ధ్యాననిశ్చలయై యున్న వరదరాజమ్మగా రాతనికంటఁ బడెను. ఆవిరాగమూర్తి తరుణియో, పురుషుఁడో యాతనికిఁ దెలియలేదు. కొంచెము వెలుతురు నిచ్చుచున్న యగ్నికుండమునందలి యగ్ని వెలుతురున నావిరాగమూర్తి జపము చేసికొనుచుఁ గన్నులు మూసికొనియున్న ట్లాతఁడు గ్రహించి, పిలిచిన నామూర్తి తపోవిఘ్న మగునని యాతఁడు బయటికిఁ జనెను.

ఆకస మంతయు మబ్బు గ్రమ్ముకొని పోవుచుండెను. ప్రచండమారుతవేగమున నాకుటీరమునందలి యగ్నియుఁ బ్రజ్వరిల్లుచుండెను. ద్వారము నించుక మూసి, గుర్రమున కెద్దియో వినఁబడునట్లు పలికి, యాశ్వికుఁడు మఱలఁ గుటీరద్వారమును సమీపించెను. గుర్ర మాశ్వికునిమాటలకుఁ బ్రత్యుత్తరముగఁ గాఁబోలు నుత్సాహముతో సకిలించెను. ఆతఁడు మఱలఁ బ్రవేశించునప్పటికి "హా! కృష్ణా! ఆపదుద్ధారకా! నా కెప్పటి కీదుఃఖోపశమనము! స్వామీ! పాపాత్ములకు బంధుఁడవు కాదా?" అని పలుకుచు నామూర్తి కన్నుల నశ్రుధారలు కాలువలుగట్టఁ గ్రిందఁ బఱచియున్న కుశశయ్యపై కొరగెను. మఱలఁ గదలి యగ్నికుండముపైకిఁ బడిపోయెను.

ఆపురుషుఁడు పోయి యామూర్తి నగ్నిలోఁ బడకుండఁ బట్టుకొనెను. కొంతవడి కామెకుఁ దెలివికలిగెను. పురుషుఁ డామెను విడిచి "స్వామీ! దారితప్పినపాంథున కీరాత్రి సమయమున నీ ప్రాంతములఁ బరుండుటకుఁ దావొసంగువారు కలరా?" అని ప్రశ్నించెను. ఆమాటలు వినకయే "సరళా!" అని మూర్తి యనెను. "నేనొకపాంథుఁడను." అని పురుషుఁ డనెను.

వరదరాజమ్మవారులికిపడి లేచి "ఎవరు వారు" అని ప్రశ్నించెను.

అప్పటి కాకసమంతయు మబ్బుక్రమ్ముకొని పోయెను. చిటపట చినుకులు రాలుచు వర్షము వృద్ధియగుచుండెను.

"దారితప్పినయొక పాంథుఁడను."

"పురుషు లీవేళలకు రాఁగూడదే!"

"దారి తప్పితి నని చెప్పలేదా?"

"ఇచ్చట కించుక దూరమున నొక మందిరము కలదచ్చటకుఁ బోయిన బాగుగనుండెడిదే! సరళా! నీవు నన్నిప్పుడు పట్టి లేవఁదీసితివా? ఈపురుషునకు దారిఁజూపుము." అని యామె యనెను.

"ఇచట నెవ్వరో యిచ్చటకు రాలేదు. నేనే మిమ్ము లేవఁదీసితిని. అగ్నిలోఁ బడుటచే నేను గోత్రవాఁడనైన నీపని చేయవలసి వచ్చినది." అని పురుషుఁ డనుచుండ వరదరాజమ్మ వారాంగనివదనమును బరిశీలించి చూచెను. ఆమె కన్నులవెంబడి నశ్రుధారలు గురియుచుండెను. ఆమె తేఱిపాఱి పురుషునిఁ జూచెను. అతఁడు శ్రీకృష్ణదేవరాయలని యామె గ్రహించెను. ఆమె కొంతవడికి లేచి యాకుటీరమును విడిచి బయటికిఁ బోయెను. ప్రక్కనున్న మఱియొకప్రదేశమునుండి యిరువురు పరిచారికలు—కామాయాంబిధాంగులు—ఆకుటీరములోనికివచ్చి భక్తివినయములతో నాపురుషునకు నమస్కరించిరి.

వర్షమించుక వెలిసినదని చెప్పి వారాంగనిఁ గోడ్కొని మందిరమునకుఁ దీసికొనిపోయిరి. వృక్షముక్రింద నిలువఁబడియున్న యశ్వము నాపరిచారిక లొకమంచి ప్రదేశమునకుఁ దీసికొనిపోయి మేఁతవేయించిరని వారాంగనితోఁ జెప్పిరి.

ఈవింతప్రదేశమున కాతఁ డాశ్చర్యము నొందుచుఁ దనహృదయము తటతట శబ్దించునట్లు చేసి మాఱుపలుకక పోయిన మూర్తిని గుఱించి ప్రశ్నించుచు మందిరప్రవేశ మొనర్చెను. ఆవనమధ్యమున నున్న యామనోహరమందిర మెవ్వరిదో—ఆతనికిఁ దెలియలేదు. ఆతనికి మొదటఁ గాన్పించినవ్యక్తి యెవ్వరో—ఆతనికిఁ జెప్పువారు లేరు. విశాలసమచతురమగుచావడిలోని కాతనిని దీసికొనిపోయి "చక్రవర్తులకు సరిపోవునట్లాతిథ్య మొసఁగుటకుఁ దగినవారము కాము—అటవికులము—వైరాగ్యవిహారులము—" అని సమాధానముఁ జెప్పుచు నాతనికి వలసినఫలములఁ గొనితెచ్చియు, నాసనముల వైచియు, భోజనాదికముల సమకూర్చియు సర్వవిధముల నాదరించిరి. తానెవ్వరో వారెఱుఁగరు. వారలెవ్వరో తానెఱుఁగఁడు! ఏమియుఁ దోచక యావిచిత్రముల నాతఁడు పరికించుచుండెను.

తుద కాతని నొకరమణీయ భవనమునకుఁ దీసికొనిపోయిరి. ఆ గవి యంతయుఁ జిత్రపటములతో నలంకరింపఁబడెను. ఆపటము లన్నియు—రాముఁడు—నలుఁడు—దమయంతి—అశోకవనమునందలి సీత—అజ్ఞాత వాసమునందలి ద్రౌపది—చెఱనున్న దేవకి—యీవిధముగఁ గరుణాకరము లగునవి యొకపక్క నుండెను. రెండవపక్క శ్రీకృష్ణ రాయనిపటములు—అశ్వము నెక్కుచున్నట్లు—అశ్వారూఢుఁడై సైన్యములఁ నడపుచున్నట్లు పట్టాభిషిక్తుఁడై గజముపై నూరేగుచున్నట్లు—కొలువుకూటమునఁ గూరుచుండినట్లు—భక్తితో నొకకన్య యాతనిపాదములపై వ్రాలి యున్నట్లు—ఈవిధముగ నన్నియుఁ దన పటము లుండెను. నలువైపుల నున్న యీపటములమధ్య నొకపెద్దపటము కలదు. అందొక పగ్రిహము—కృష్ణరాయని సంపూర్ణ విగ్రహము—కృష్ణరాయనికే సజీవమని తోఁచునట్లు చేయుచున్న చిత్రపట మొకటి వేలాడుచుండెను. ఆపటమునందుఁ గృష్ణరాయఁ డొకకేతకీ దళముపై వ్రాసిన లేఖను నిలువఁబడి చదువుచున్నట్లు చిత్రింపఁబడియుండెను. ఆకేతకిదళమున నీక్రిందిగీతములు విస్పష్టముగ లిఖయింపఁబడెను. ఆతఁ డాపక్కకుఁ బోయి పటము నాశ్చర్యముతోఁ జూచెను. ఆచిత్రపటము నందలి గీతముల నాతఁను చదువుకొనెను. అందిట్లున్నది—

చర స్వనాంతే నవమంజరీషు
న షట్పదో గంధఫలీ మజిఘ్రతు
సా కిం న రమ్యా స చ కిం న రంతా
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా. 1

మా కింశుక పకట తూష్ణ నిమేషమాత్రం
మన్మత్త కేవిహగతీతి మధువ్రతోయం
కిం మాలతీవిరహా వేదనయా తవ్వేయం

దృష్ట్వా ప్రసూన మచిరా దనలభ్రమేణ. 2
భ్రమర భ్రమతా దిగంతగాళే
క్వచి దాస్వాదిత మీక్షితం శ్రుతం వా
ఎద సత్య మహాస్య పటుపాతం
యది జాతికుసుమానుకారి పుష్పం. 3
కుసుమాని లిఖంతు నామ చిత్రే
కతిచి త్కారువి శేషరూఢశిల్పాః
సురభిత్వ మమూని కిం లభంతే
కిము చైతేషు రసం పిబంతి భృంగాః. 4
కిం మాలతీం మ్లాయసి మాం విహాయ
చుచుంబ తుంబీకుసుమం షడంఘ్రిః
లోకే చతుర్భి శ్చరణైః పశు స్స్యా
త్సమడ్భి రత్యర్ధపశు ర్న కిం స్యాత్. 5

వీని నాతఁడు చదివి కొంతవడి యోచించి మరలఁ జదివెను. మరలఁ జదివెను. ఆతని కేమియుఁ దోఁచుట లేదు. ఈమందిర మెవరిది ? ఇం దిన్నివిధములఁ దనప్రతిమను రచియించినవా రెవరు ? ఇందీగీతములను రచియించిన దెందులకు ? ఆతని కేమియు స్ఫురింప లేదు.

ఆతనిదృష్టి ప్రక్కనున్న యొకద్వారమువైపునకుఁ బోయెను. అం దెవ్వరైన నుందురని యాతఁడా ద్వారములోనికిఁ దొంగిచూచెను. అం దెన్నియో వేలు తాళపత్రగ్రంథములు పట్టుగుడ్డలఁ గట్టి మంచెలపై నుంచిరి. ఆంధ్రసంస్కృతగ్రంథము లెన్నియో వేలచ్చులఁ గల వని యాతఁడు గ్రహించెను. తనసొంతపుస్తకభాండాగారముకంటె నెన్నియో రెట్లనేకము గ నందు గ్రంథములు కలవని యాతఁడు కనుఁగొనెను.

ఈవిచిత్రము లన్నియుఁ జూచుటతో నాతనికిఁ బిచ్చియెత్తిపోయెను. అతఁ డెన్నివిధముల యోజించినను మందిర మెవ్వరిదో యాతనికిఁ దెలియలేదు. పరిచారిక నొకర్తుకఁ బిలిచి యడిగెను. మఱియొకతె నడిగెను. ఎవ్వరును జెప్పరు. చెప్పుట కాజ్ఞ లేదందురు. కొందఱు నవ్వి వెడలిపోవుదురు. కొంతవడికిఁ గృష్ణరాయలు లేచి "వర్షము వెలిసిన ట్లున్నది. మేము పోవుదుము. అశ్వ మెచ్చట?" నని యడిగెను. కొంతవడి కొకపరిచారిక వచ్చి "ప్రభాతమునఁ బోవచ్చునని మాగృహిణి వేఁడుకొనుచున్నది. అరణ్యప్రదేశము." అని చెప్పెను.

"ఆమె యెవ్వరో—ఎందులకు మ మ్మిట్లాదరించుచున్నదో తెలియకుండ నిట్లాఁగుట మావంటివారికి యుక్తముకాదు. ఆమెపేరెవరు?" అని రాయ లడిగెను.

"చెప్పుటకు మా కాజ్ఞలేదు." అని పరిచారిక నవ్వుచుఁ బోవుచుఁదలుపు బిగించుచుండెను.

"మాకుఁ జెఱసాలయా?" అని రాయ లడిగెను.

"ప్రభువర్యా! ఈమందిరమున నిది శాసనము! భవనములన్నియుఁ బరిచారికలు మూసియుంపవలెను" అని తలుపు తెఱచెను.

"మాయశ్వ మెక్కడ?" అని రాయ లడిగెను.

"ఉదయమునఁగాని మీయశ్వము మీ కీయఁబడదు." అని పరిచారిక యనెను.

"ఎందువలన?" అని రాయ లడిగెను.

"మాగృహిణి యాజ్ఞ లేదు." అని పరిచారిక బదులుచెప్పెను.

"మీగృహిణి యెవరు?" అని రాయ లడిగెను.

పరిచారిక నవ్వెను. రాయలు కొంచె మాగ్రహమున బొమలు చిట్లింప—"మీ కీవనమునఁ బ్రథమమునఁ గనఁబడిన యామె

ఇంతకంటె నేఁజెప్పఁజాలను. ప్రభువర్యా! మేము మీభృత్యకోటి లోనివారము. కారణాంతరమున నిట్లు మెలఁగుచుంటిమి. మాకును మీకంటె వేయిరెట్లధికకష్టముగ నున్నది." అనుచుఁ బరిచారిక వె డలిపోయెను.

రాయలు దీర్ఘాలోచనమును జేయుచుఁ దల్పముపై వ్రాలి వ్రేళ్లు పెనవేసికొని ఫాలతలమున నుంచెను. అతఁడు నిద్రించెనా?

---

## ఏడవ ప్రకరణము.

### సందేహము.

మరుచటిదినము ప్రభాతమగుచుండఁగనే కృష్ణరాయలు లేచి, తనయశ్వము నెక్కి తన్ను వెదకుకొనుచువచ్చినపరివారముతో వర దరాజమ్మవారు నిర్మించినతటాకపరిసరభూములఁ బోవుచుండెను. త టాకము వందలకొలఁదికోశములవఱకు వ్యాపించి యుండెను. అది యొకసముద్రమువలె నుండెను. దానిమధ్య లంకలపై గ్రామములు క లవు. పుట్లకొలఁదిభూములు తటాకమధ్యమునఁ గర్షకులు దున్నుచు, క్రొత్తనీటితోఁ బొలముల సేద్యముసేయుచుండిరి. ఇదివఱకే యెత్తుగ నుండినప్రదేశములపై వినిర్మింపఁబడియున్నగ్రామముల చుట్టును నీరు నిలిచి మహాతటాక మగుటచే నందలిప్రజ లొకయూరినుండి మఱియొ కయూరు పోవుటకుఁ బెద్దపేపపుటికలకుఁ దోలు మూసి దోనెలవలె వాడుచుండిరి. ఆమహాతటాకవినిర్మాణమునుగుఱించియు, మందిరము నుగుఱించియు, తటాకనిర్మాణ మొనరించినతరుణీమణి కీర్తినిగుఱించి యుఁ జూచియు నడిగి తెలిసికొనియు రాయలాశ్చర్యమునొందెను. కా ని యాతనికి రాత్రినుండియు సందేహముగ నుండినగృహిణినిగుఱించి యెవ్వరును వివరములు దెలుపలేకపోయిరి. కొంత దూరమేగిరు వరద

రాజమ్మగా రనియు, దైవస్వరూపిణి యనియుఁ దెలిపిరి. ఆదేశమున నతఁడు బ్రభుఁ డగుటెనకింటె నధికప్రజాసమ్మతముగఁ గీర్తిని బొందు చుఁ బ్రజలచే నారాధింపఁబడుచున్న యానెలఁత యెవ్వరో—ఆమం దిరమునఁ దనపటము లుండుటకుఁ గారణము లేమో యాతనికిఁ దెలి యలేదు.

దీర్ఘాలోచన మొనరించుచుఁ దాను రాత్రి గడపినదంతయు నొకస్వప్నమా యని యాతఁడు సందేహించుచు, నమ్ముటకు వీలు లే నిధర్మములఁ జేయుచున్న యాతరుణీమణి కంతధన మెచ్చటిదో— తనదేశమున నేమికారణమున నామె నివసించియున్నదో—ఆతనికి ద్యో తకము కాలేదు. రాత్రిచర్యయంతయు నాతనికి విచిత్రముగఁ దోఁ చుచుండెను. చుట్టుప్రక్కల నెటుచూచినను గర్షకు లమితానందము తోఁ బొలముల దున్నుకొనుచుండిరి. ప్రకృతియంతయుఁ దేదీప్యంతమై సౌఖ్యప్రదమై, స్వప్నతుల్యముగ నుండెను. ఆతని కానందియము వీత లేదు.

పరిచారికవినమ్రభావములును—మందిరమునందలిపరిశుభ్రత యు—చిత్రపటములవిచిత్రమును—ఆరామ సౌందర్యమును—పుస్త కభాండాగారవైశాల్యమును—తనకుఁ జూపినయాదరణయు—నాతనికి విచిత్రభావములఁ గలిగించుచుండెను. వెంటవచ్చుపరిజనులించుక దూ రమున వచ్చుచుండ నాతఁడు తనయశ్వముకళ్లెము వదలి గుఱ్ఱము ని ష్టమువచ్చినట్లు నడచిపోనిచ్చుచుఁ దటాకముగట్టుపైనుండి వచ్చుచుం డెను. ఆతఁ డట్లు కొంతదూరము వచ్చునరికిఁ దటాకమధ్యమునఁ బా తించుటకుఁ దెచ్చినయొకశిలాస్తంభ మాతనికంటఁ బడెను. అది గ ట్టుపైఁ బసుపురాచి యొకచోట జేరగిలఁ బెట్టి యుంచిరి. అందుపై నేదో యో చెక్కఁబడియుండెను. అక్షరములపై పసుపురాచియుంచిరి. ఆ శాసన మిట్లున్నది.

"స్వస్తి శ్రీ సర్వజిన్నామసంవత్సర వైశాఖ బ ౧౦ సోమవారమునాఁడు మూరురాయరగండఁడును, కరుణాన్వయాపుఁడును, భగవదంశాసంభూతుఁడును, మార్తాండతేజోయుతుఁడును, క్షత్రియకంఠీరవుండును, నాగాంబికాపుత్రుండు నగు శ్రీకృష్ణదేవరాయల యష్టైశ్వర్యాభివృద్ధిగ నొకపాదసేవకురాలు నిర్మింపఁజేసిన తటాక మాచంద్రతారకముగ వర్ధిల్లుచుగాక! శ్రీ శ్రీ శ్రీ"

దానిని పూర్తిగఁ జదివిన రాయల కాశ్చర్య మత్యధికమయ్యెను. అతఁడు మఱల మందిరమునకు బోనెంచెను. వేటకాండ్రనందఱను బట్టణమునకు రమ్మని యాతఁడు విజయనగరమార్గమునకు గుఱ్ఱమును మఱలించెను.

## ఎనిమిదవ ప్రకరణము.

—o—

### సపత్ని.

"పరిచారిక లుండఁ బాదసేవకుఁగూడ నీ వేలపూనుకొందువు?" అని యొడిలోఁ గాళ్లుంచుకొని చిఱునగవుతోఁ బాదములొత్తుచున్న పట్టమహిషి యగుతిరుమలదేవితోఁ గృష్ణరాయ లనుచుండెను.

"ప్రభువులకుఁ బరిచారిక లుండరనియా? సార్వభౌముని భార్యయైనను, బట్టమహిషి యైనను భర్తకు భార్య పరిచారికయే!" అని తిరుమల బదులు చెప్పుచు శేషశాయియై యున్న విష్ణువునకుఁ బాదములొత్తుచున్న లక్ష్మిని జూపెను.

"అట్లు చిత్రకారుఁడు లిఖియించినను లక్ష్మికి వాసస్థానము వక్షస్థలము కాదా?" అని రాయలు తిరుమలను జేయిఁబట్టి దరిఁ జేర్చుకొనఁబోయెను.

"స్వామీ! దేవరవారు నే నడిగిన ప్రశ్నమునకు సమాధానము చెప్పరేరి." అని తిరుమల యనెను.

“ ఆగోడవ జ్ఞప్తికిఁ దీసికొనిరావలదు. మే మొకసారి పరిత్యజించినవస్తువును—మఱల—” అని రాయలనుచుండ

“ మీ రట్లు సెలవీయఁదగదు. శ్రీమహావిష్ణువునకు భూదేవి వచ్చినప్పుడుకదా—లక్ష్మి—సపతికంటె నధికగౌరవమునుబొందుటకు మున్నతమగువక్షస్థలమును నధిష్ఠించుటకుఁ గోరుట! నాసవతి—రుచిదేవి లేనియెడ నేను మీపాదసేవఁ జేయుచు, [illegible]లకడ వసియించుటతోడనే తృప్తినొందెదను.” అ[illegible] తిరుమలపాదము లొత్తుచుండెను.

“ ప్రపంచమున నెక[illegible]డఁలూడ లేదు—అబలాస్వభా[illegible]మునకు విరుద్ధముగ సవతిని దెమ్మనిగో[illegible] విది యేటివెఱ్ఱి!” అని రా[illegible]లనెను.

“మీరు స్వయముగ వి[illegible]రి. పెద్దనార్యుని మనుమ[illegible] రాలగు పార్వతి నాఁడు వచ్చి రుచిదేవికి [illegible]డఁగలభక్తిని వర్ణించినప్పుడు నామేను పులకరించినది. పార్వతికైన [illegible]దేవియని బాగుగఁ దెలియదఁట! ఆమెచర్యలను జూచి గ్రహించినది. అచ్చటి చిలుకలు సహితము మీనామగుణకీర్తనముల గీతముచేయుచుండునఁట! దేశమంతయు వరదరాజమ్మవారని కీర్తిచంద్రికలు పెంపొందుచుండ, నామె చేసిన నేరమునకు మించిన పశ్చాత్తాప మొందుచుండ—మీకీపట్టుదల యేల? ఏలినవారు మావంటియంగనలకడ నుండుతప్పుల సైరింపవలయును. నన్నెట్లు క్షమియించిరి? ప్రమాదముననో—తెలియకయో—మిమ్ములఁ గత్తితో నఱకఁబ్రయత్నించినంత మాత్రమున—విశుద్ధచారిత్రయగుతరుణీమణిని విపినములపా లొనర్చుట మనకు శ్రేయోదాయకము కాదు.” అని తిరుమల చెప్పుచుండెను. మహిళాజనసాధారణ మగుకన్నీ రామెమాటలకంటె నధికముగ నాతనిమనస్సును గరఁగించుచుండెను. కోమలాంగుల కోమలస్వరమునకుఁ గన్నీరు సహాయమొనర్ప నేరాతిగుండెయైనను గరఁగకుండునా? అట్టియెడఁ గరుణాప

ముద్రిక దగురాయ. లేమయ్యెనో చెప్పవలయునా ?

"పార్వతి యెన్నిదినములైనది వచ్చి?" అని రాయ లడిగెను.

. మీరు వేటకు వెడలియుండిరి. లేకుండినచో నామె మాటలు మీరే వినియుందురు. ఇప్పుడైన నేమి? మీ రామెను బిలిపించి వినవచ్చును. ఆఁడుదానికష్టములు—ఆఁడుదాని మనోగతభావము లాఁడువాండ్రకే తెలియును. ఆమెవర్ణించి రుచిదేవి నిర్మలవర్తనమును జెప్పినప్పుడు నాకెంతదుఃఖము కలిగెనో—" అని తిరుమల చెప్పుచుండ

"అగును. ఆసుఃఖము మఱియొకదుఃఖముగ మారిపోయినయెడల మాకష్టములు—" అని రాయలు పలికి తిరుమలప్రసంగవశమునఁ జెప్పిన వేఁటమీఁది కాలనిధ్యానము పోవ నాతఁ డాలోచించుకొనుచుండెను. వరదరాజమ్మవారి మందిరమునఁగల భ్రమరాపదేశగీతములు. చెరువుకట్టపైనున్న శిలాశాసనము—ఈవిధముగ నాతని యాలోచనములు గిఱ్ఱునఁ దిరుగుచుండెను. కొంతవడి కాతఁడొక్క నిట్టూర్పును బుచ్చి "చింతామణిమందిరము—చిత్రపటము—స్వప్నము-" యని గొణుగుకొని చేతితో రెండుకణతలఁ బట్టుకొని లేచి కూరుచుండెను. తిరుమల కెయ్యదిగి, వస్త్రము సవరించుకొని నిలువఁబడెను. ఆమె యేదియో చెప్పఁ దలఁచుకొని యుండెను. రాయ లామె వదనమును జూచి "అగును. నిన్నటుల మంత్రి మాటల విని—రాజ్యము కొఱకు—వివాహమాడితిని. ఇప్పుడు మఱల నామెను దెచ్చినచో—" అని రాయలాగెను.

"స్వామీ! నామనస్సు కనుఁగొనకున్నారు. ఆమె మీప్రథమ భార్య! ఆమెను దెచ్చి పట్టమహిషిని జేయుట మనధర్మము. నేను దేవరవారికి నామెతోఁ బాద సేవఁజేయుచు దినములఁ బుచ్చెదను. ఆమె పూర్వచరిత్రమును వినినప్పటినుండియు, నేనామెను జూడవలయుననియు—శాంతిని జేసికొనవలయుననియుఁ గోరికలు మీఱుచున్నవి. నే నిదివఱకే

నేకపర్యాయములీ విషయమును జెప్పుచుంటిని. మీరు నాముద్దు జెల్లిం వవలయును.'' అని తిరుమల రాయలపాదములపై వ్రాలెను. ఆమె క న్నులనుండి బాష్పజలము కాలువలు కట్టుచుండెను. ఆమెపైకి జూచి ''ఏతప్పు చేసిననన్ను మీరు క్షమియింపఁ గలిగిరో—అతప్పు చేసిన రుచిదేవిని మీరు పరిత్యజించుట యన్యాయము! నాయందనుగ్ర హముంచి మీరామెను దీసికొనిరండు! కాకుండిన నాకాజ్ఞయొసఁగుఁడు-మీ పరిజనులతోఁ బోయి, యామెను బ్రతిమాలి నేనే తీసికొని వత్తు ను. నే నామెనెప్పుడుచూతును—ఎప్పుడాలింగన మొనర్తు ననితహ తహఁ జెందుచున్నాను. శోభనసమయమున నాతో ''నిల్లు నఱకవచ్చి న గజపతులకన్యను బరిత్యజించితిన'' ని దేవరవారు సెలవిచ్చినప్పటి నుండియు నాకీతొందర కలదు. కాని నే నబలను—అస్వతంత్రను—ఏమి చేయఁగలను—అయినను దేవరవారితో నీసంగతి పలుమారు మ నవి చేసికొని యుంటిని.'' అని తిరుమల యేడ్చుచుండెను.

''సపత్నీప్రేమముండుటకు—అమెను బట్టమహిషినే చేయుమ నుటకు—తిరుమలదేవికెంతయమాయకత్వము—కాదు—అవ్యాజప్రే మము—స్వార్థత్యాగము నుండవలయున''నిరాయలనుకొనుచుండెను. నాఁటిరాత్రి వరదరాజమ్మవారి మందిరమున జరిగినచర్యలన్నియు జ్ఞ ప్తికివచ్చుచుండెను. ఆమెయే రుచిదేవియని పార్వతి పొందినయనుమా నము సత్యమైయుండునని యాతఁ డనుకొనుచుండెను. ఆమె యోగిని వేషము—మందిరము—ప్రశాంతభావము—పుస్తకభాండాగారము-పరిచారికల చర్యలు—నివియన్నియుఁ గ్రమముగ జ్ఞప్తికివచ్చి హృ దయగోళమును గంపింపఁ జేయుచుండెను. క్రమముగా నాయాలోచన ము లన్నియు నారంగములన్నియుఁ బవిత్రవంతములై, ప్రకాశవంత ములై, దైవస్వరూపమగు ప్రేమముతో నిండియున్న తిరుమల యశ్రుజ లము లామెపాదమునకు సాయపడుటచే రాయలహృదయము ద్రవీభూ

తమగుచుండెను. తిరుమల హృదయమునను న్న యాయవ్యాజమగు ప్రేమమునందున్న యాకర్షణశక్తి రాయలహృదయమును జయించి "రుచిదేవిని దెత్తును. నీవూఱడిల్లుము." అనుమాటలు రాయలచే ననిపించెను. ఇకఁ దిరుమల కేమికావలయును? ఆమె యానందమునొందెను. రాయలు తిమ్మరుసయ్యవారిని బిలిపింపుమని సేవకునికి వినఁబడునట్లు పలికెను.

---

## తొమ్మదవ ప్రకరణము.

### ఉత్తరము.

"ఆమహాత్మురాలు నాకిచ్చినది నీ కెట్లువచ్చును? సువర్ణధేనువు నిచ్చునని మనమెఱుఁగముకదా! నన్ను పిలిచి కాళ్లుకడిగిన పరిచారికను నేనెఱుఁగుదును. అందువలన నా కాగోవునిచ్చిరి. నీకిందు భాగము రాదు." అనియొక బ్రాహ్మణుఁడనుచు వరదరాజమ్మనారి మందిరముకడ మఱియొక బ్రాహ్మణునితోఁ గలహమాడుచుండెను.

"మనమిద్దఱము గలసివచ్చునప్పుడు దొరకునదెల్లఁ జెరిసగము పంచుకొనవలయునని నిర్ణయించుకొంటిమి. అప్పుడు నీవు భాగము లేదనినఁ బోవునా? నీవు భాగమిచ్చెదవని యూరకుంటిని. కానియెడల నా బంగరుగోవును దీసికొనుటకు నేనే కూర్చుండియుందును." అని రెండవ యాతఁడనెను.

"మనము సజీవధేను దానమునకును స్వర్ణదానమునకును వచ్చితిమి. మొదట నీవుమంత్రము చెప్పుటకును, నేను దానములను బరిగ్రహించుటకును నిర్ణయించుకొంటిమి. ఆమె నీకుగోవు నిప్పించినది. నాకు బంగరుగోవు నిప్పించినది. ఎవరి యదృష్టము వారిది" అని మొదటి బ్రాహ్మణుఁడనుచు లేగదూడ యాకారమున మూరెడెత్తుగల బంగరుగోవును జంకక్రింద నిరికించుకొనెను.

"ఈకలహముతోఁ బ్రయోజనమేమి? మనలఁబంపిన సోమశర్మ యెట్లు చెప్పిన నట్లొనర్తము. నడువుము," అని రెండవ బ్రాహ్మణుఁ డనెను.

"దానమునకు సంతుష్టిఁ జెందవలయును! ఇరువురము కలసి పంచుకొనవలదా? అని ప్రశ్నించుట కిదియేమిపత్రిమా? వెనుకటిసారి నీకు కాశ్మీరపుసాలువు లిచ్చినప్పుడు మాకు సాధారణముగు జామారు కదా యిచ్చినది. నీవాదుస్సేలువుల నారత్తిగాడికిఁ గాని నాకుఁ గాని భాగ మిచ్చితివా? నీభార్యసోదరునకు బహుమాన మేలచేసితివి?" అని మొదటి విప్రుఁడనెను.

"నీవు బ్రహ్మచారి వుండకొడకవు. నోట మంత్రపుముక్కలైనరావు. దానపీఠమునకు దాకొల్పినది నేను. లేశమైన నాకీయకుండ నపహరింపఁ దలఁచితివా? మఱల నీవిచ్చుటకు రాఁగలవా?" అని రెండవ యాతఁ డనెను.

"పండితపరీక్షలోఁ జెరిసగమున కొప్పుకొనినప్పుడు నన్ను ఘనపాఠి నని చెప్పి యిప్పుడు కాదని యెట్లనఁగలవు? అయిన నాయుమ్మకుఁ దెలియదా? నీవిప్పుడు కిక్కురుమనిన నీమోసమంతయు నమ్మవారికి ఉకపఱచి నీకు దేవిశీమన్నా చెప్పింపనా?" అని కొంచెము తీవ్రముగ మొదటి యాతఁ డనెను.

అప్పుడు వారికిరువురు బాటసారు లెదురుపడిరి. వారి వేషములను బట్టిచూడ వారు రాజభృత్యులవలె నుండిరి. వారాకలహించు బ్రాహ్మణుల వారించి, రెండవవారి కదియే విలువగలబంగరుగోవు నిప్పించెదమని వారు చెప్పిరి.

"మీ రెట్లిప్పింతురు?" అని రెండవ బ్రాహ్మణుఁ డనెను.

"అయ్యో! ఆమె మాదేశపురాజు తనూజాత!" అని బాటసారు లనిరి.

బ్రాహ్మణులు తేరిపారిచూచి "ఆమె రాజకూఁతురా?" అని వారనుకొని యొకరిమొగ మొకరు చూచుకొనిరి.

"మన కెందుల కా సందేహము. వారిప్పింతురుకాదా! తేపే చూడవచ్చును. తొందరయేల?" అని బంగరుగోవును స్వీకరించినయాతఁ డనెను.

"అవును నీకేమితొందర? నీబంగారు నీకు ముట్టినదికదా!" అని రెండవ యాతఁ డనెను.

"ఇది యెందులకిచ్చిరి?" అని బాటసారులడిగిరి.

"చెరువుకట్టక్రిందఁ బడిన యిరువురు సోదరుల పేరున నిచ్చిరి." అని యాకథనంతయు విప్రులు వారికిఁ జెప్పిరి.

అప్పుడించుక వృద్ధుఁడైన బాటసారి "నాయనా! మీరింత తగవు లాడుచున్నారు. ఈ గో వెవరుదానము చేసిరో చెప్పఁగలరా?" అని యడిగెను.

"మీరు చెప్పినరాజపుత్రికయే!" అని బ్రాహ్మణుఁ డనెను.

"ఆమె పే రెఱుఁగరటయ్యా!" అని వృద్ధుఁ డనెను.

"మీ రెఱిఁగియు మఱచుడుగనేల?" అని బ్రాహ్మణులనిరి.

"మీరు దాతపేరంతజాగరూకతగ జ్ఞప్తియుంచుకొందురో చూతమని—" అని వృద్ధుఁడనెను.

"వరదరాజమ్మవారు!" అని బ్రాహ్మణు లనిరి.

"అది యందరెఱిఁగినపేరే! నేఁగోరున దదికాదు." అని వృద్ధుఁడని నవ్వెను.

"ఇఁకఁ బేరేమి? మే మెఱుఁగము." అని బ్రాహ్మణు లనిరి.

"కాదయ్యా! దానసమయమున నెవరిప్రవరము చెప్పిరి? దాతగోత్రనామము లేమి చెప్పిరి?" అని వృద్ధుఁడనెను.

"అదిరా! ఏమిరా! బుచ్చన్నా! నేనంటిని నీకు జ్ఞప్తియున్నదా?" అని రెండవబ్రాహ్మణుఁడనెను.

"మంత్రము లే జ్ఞాపకముండవని నన్నధిక్షేపించితివి కాదా? నే నంతగా విన లేదు. నాగోత్రనామములు చెప్పవలసినట్లు చెప్పుటకుఁ బదిసారులనుకొనుచు సిద్ధముగనుంటిని. అవల్లెవేయుసమయమున నీవ నివేసియుంచుపు. నేవేఙ్ప్రికిఁ దెచ్చుకొనుము." అని మొదటియాతఁడనెను.

"బాబూ! చెప్పెదను—కృష్ణదేవభర్తురాలు సకలపాపపరిహారముగఁ గంబసోదరస్వర్గప్రాప్తికి సద్విపుష్ట్రన కీగోదానము!" అని యే మేము యనిపించెను. పరిచారిక లోక తాళపత్రమునిచ్చి యందున్నది చదువుమంచురు. ఎంతపన్నమైన వల్లెవేయుదును గాని—చదువుటయభ్యాసము లేదు—దాసి చదివి చెప్ప మేమేదియో చెప్పి వేసితిమి, ఇవి యే మెఱిఁగినసంగతులు. మీఁదమీచిత్తము.'' అని రెండవబ్రాహ్మణుఁ డనెను.

"మంచిది! మీరు జేవుమందిరముకడకు రండు! రెండవవారికిఁ గూడ సువర్ణధేనువు నిప్పింతుము." అని చెప్పి బాటసారు లాబ్రాహ్మణులఁబంపి యొకరిమొగ మొకరు చూచుకొని నవ్వుకొనిరి.

పిమ్మట వారిరువురు నదినిశ్చయమే! లేకుండినచన్ని నిదర్శనములా? యనుకొనిరి. వారిసంభాషణమంతయు నుత్సాహదాయకముగ నుండినను, సంగతులు గ్రహించుట కిష్టపడువారికి వలసినంతస్పష్టముగ లేదు.

వారిరువురును గలసి మందిరప్రాంగణమునకు వచ్చిరి. అప్పటికిఁ గనుచీఁకటిపడుచుండెను. వారచ్చట ద్వారముకడ నానాఁడు పెరుఁగుకడవలఁ దెచ్చినగొల్లవాండ్రకు రూకలనిచ్చుచుండిన పరిచారికను జూచి "మీయమ్మవారి కొకలేఖను దెచ్చితిమి. తీసికొనిపోయి యీయవలయును.'' అని చెప్పిరి.

"ఆమె సెలవు లేకుండ—మీ రెవ్వరో తెలియకుండ లేఖలులో

నీకేబోరాదు. అయినను మీదేయూరు? మీరెవరు?" అని పరిచారిక యడిగెను.

"కళింగదేశమునందలి గజపతినగరము. రాజభృత్యులము." అని వారు బదులుచెప్పిరి.

"మంచిది. మీరిటనుండుడు." అనిచెప్పి గొల్లవారల నంపివేసి "వీరిని నేనెన్నఁడుఁ జూడలేదే!" అనియనుకొనుచు నామె లోనికేఁ బోయెను. వారిరువురు నచ్చటనే యుండిరి. మఱియొకపాతికగడియలో నామెతిరిగివచ్చి "ఆలేఖ నంపినవారెవ్వరు? పనియేమి?" అనియడిగెను.

"గజపతిరాజగారిభార్య! పని మాకెట్లు తెలియును?" అని వారు బదులుచెప్పిరి.

"అట్లయిన నాలేఖ నిటు తెండు," అని యామె వారికడ నాలేఖనుదీసికొని వారి నాదరించుటకొక పరిచారికను నియమించి లోనికేఁ జనెను.

వారినిరువుర నుచితమర్యాదల భోజనశాలకడనున్న యొక మందిరములోని కాదాసి కొనిపోయెను.

సరళ యుత్తరమునుదీసికొని పైకిఁబోవునరికి వరదరాజమ్మ వారు చిలుకలతోఁ బద్యములఁ జెప్పుచుండెను. అవ్యక్తమధురస్వరముల నా చిలుక లామెచెప్పినమాటల వల్లెవేయుచుండెను. సరళ యుత్తరము నామెకిచ్చెను.

వరదరాజమ్మవారు త్తరమునుదీసికొని ముద్రికవిప్పి చదువ నారంభించెను.

"మాగారాబుపట్టియగు తుషారమణీమణిని జనని యాశీర్వదించి వ్రాయులేఖ —" అని యామెచదువుకొని కన్నులనీరు దుడుచుకొన వలసివచ్చెను. "తుషారమణీ!" యని వినునరికి పంజరమునందలి చిలుకలానందముతోఁ జెక్కలువిదల్చుచు "తుషారమణీ! తుషారమణీ!

శూర! తోఁటకూర! కృష్ణరాయలు శ్రీకృష్ణలాయలు!" అని పలుకఁ దొడఁగెను.

పిమ్మట రుచిదేవి యుత్తరమునిట్లు లోపలఁ జదువుకొనెను. "తల్లీ! నీవు పెంచినశుకములే పంజరముల మేఁతమాని తపించి యన్నియు మరణించినవి. నీపేరువినినతోడనే రెండుఫలములఁదిను నావందలకొలఁది చిలుకలిప్పుడు లేవు. అనంగతుఖ్ఖారములగు చిలుకలఁబెంచిన నీకా చిలుకపేరు పెట్టుకొని ముద్దుగఁబిలుచుకొను—నీపుత్రికలవంటి చిలుకలతిమనోహరముగఁ బిలుచు—తుఖారమణీమణియను పేరు వినుటకుఁ గూడ మాకుఁగఱవైనది. సార్వభౌమపత్నివై సకలసుఖముల ననుభవింతువని జ్యోతిషికులు చెప్పినఫలములకు వ్యతిరేకముగ, వనముల యోగినివై దినములఁబుచ్చుచుంటివని వినినప్పుడు మాకడు పెట్లు కోసికొని పోవుచుండునో గ్రహింపుము. నిన్నిలువెడలఁగొట్టినను—మీ తండ్రి కారాయలపై నాగ్రహము రాదు. నిన్నింటికైనఁ దెచ్చుటకుఁ బ్రయత్నింపరు. ఆయనకు రాజ్యముకంటెఁ దనూజాత యధికమా? ఆఁడుపుట్టువు పుట్టిననాకు—నిన్ను విడిచిజీవించుట దుర్భరముగ నున్నది. నిన్నాకులహీనుఁ డగురాయలు పెట్టినబాధల నేనెట్లు వినిసహింపను? నీకాతనితోఁ గాపురము లేకపోయినది నాకు సంతసమే! నీవాతని నెట్లయిన సంహరించుటకుఁ బ్రయత్నింపుము. లేనియెడల నీకాతని రాజ్యమున నేమిపని? మనగృహమునకు రమ్ము! కడుపునఁ బెట్టుకొందుము. కంట నీరు తుడుచుకొందుము. తల్లీ! అంతఃపురగవాక్షముల నాకసముమాత్రము చూడఁగలిగిన నేనీక్షణమున రెక్కలుగట్టుకొని నీయొద్ద వ్రాలవలెనని యున్నది. నాముద్దు చెల్లింపుము. ప్రత్యుత్తరము వ్రాయుము. గ్రహింపుము.

నీజనని,

అప్పలనరసమాంబ.

ఈయుత్తరమును జదివి కించిత్భ్రూయుగ్మముతో వరదరాజమ్మవారు—కాదు రుచిదేవికదా యామె—యాయుత్తరమును జించి పారవైచెను.

"సరియే! ఉదయమునసే వారి నంపివేయుఁడు—ప్రత్యుత్తరము—ఉత్తరము—ఆమె యోచించెను—మంచిది! అని యామె తల వంకించెను. వ్రాసియిచ్చెదను. ఉదయమునసే వారి నంపివేయుఁడు." అని చెప్పి రుచిదేవి మందిరములోనికి వెడలిపోయెను. అందఱు నామె వింతచర్యలఁ జూచి యొకరిమొగము లొకరు చూచుకొనుచు భోజనశాలకు వెడలిపోయిరి.



పదవ ప్రకరణము.

—(o)—

ప్రత్యుత్తరము.

ఉదయము కాకపూర్వమే గజపతినగరమునుండి వచ్చిన భృత్యుల కిరువురకు ననేకరత్నాభరణముల నిచ్చి, వారు తెచ్చినయుత్తరమునకుఁ బ్రత్యుత్తర మొసఁగి పంపివేసిరి. ఆభృత్యులు బహుమానముల నెల్ల నంతఃపురిచారికలకిచ్చి యుత్తరమునుదీసికొని తెల్లవారుచుండఁగ వెడలిపోయిరి. ఆభృత్యు లిరువురును మందిరమున కొక యరకోసుదూరము పోయి యచ్చటనలువంకలఁ జూచి యొకపొదరింట దూరిరి. మంచుబిందువు లింకనుఁ గురియుచుండెను. బాలభానుఁడు క్రమముగ బయటికి వచ్చుచుండెను. తమోరాశి క్రమముగనదృశ్యముకాఁగాఁ బ్రకృతియందలికొండలు చెట్లు క్రమముగఁ జూపట్టుచుండెను. వారిరువురు నచ్చటఁగూరుచుండి రుచిదేవిప్రత్యుత్తరముఁ జైకిఁదీసిరి. అంతట నావృద్ధుఁ డాయుత్తరమును భృత్యాచారమునకు వ్యతిరేకముగ, నిర్భయముగ విప్పి యిట్లు చదువఁదొడంగెను.

" పూజ్యురాలైనతల్లిగారిపాదపద్మములకు రుచిదేవియనియు, తుషారమణిమణి యనియు వరదరాజమ్మ యనియు, అన్నపూర్ణయనియుఁ బిలువఁబడుచు నిప్పుడు పేరులేక జీవించియున్నమీతనూజాత వందనసహస్రములొనరించి వ్రాయువిజ్ఞప్తి.

మీరంపినలేఖ యందినది. తుషారమణిమణియే లేనప్పుడు చిలుకలు మరణించుట యాశ్చర్యము కాదు. నావెంట నన్నిటిఁ దీసికొనిపోనీయరైరి. అయినను దైవానుగ్రహ మట్లున్నది అవియైన దైవసన్నిధానమున నాదుస్థితి నాపరమదయాకరునకు వినిపించి నాకుఁ దోడ్పడఁగలవు. మఱియు నానామము వినుచుండినచో మీకు విచారము కలుగుచుండును. మీకట్టిబాధ కలుగుచుండుట నేవినఁజాలను.

జ్యోతిష్కులు చెప్పినట్లు నేను సత్యముగ రాజాధిరాజగు సార్వభౌమునిభార్యనైతిని. కాని మీయందలి ప్రబోధములకు లోఁబడి నేనాతని శయనాగారమును జేరునప్పుడు కత్తి ధరించుటచే—పాపకార్యము చేయుటకుఁ జెప్పిన యాలోచనములకుఁ జెవియొగ్గుటచే—బుద్ధియందు దుష్టకార్యాలోచనమునకుఁ జోటిచ్చుటచే—నేనా పాపఫలము ననుభవించుచున్నాను. అది నాకర్మము!

మాతండ్రి కారాయలపై నాగ్రహ మెట్లు వచ్చును? రాయలు కరుణ వర్షించుచుండఁ దండ్రిగారికోపాగ్ని యెట్లురగులును? ఆతఁడు దయారసముఁ జిమ్ముచుండఁ దండ్రిగారి హృదయ తాప మెట్లు వృద్ధియగును? మేఘము వర్షించుచుండ భూమిపై వేఁడి యుండునా? శీతమయూఖుఁడు చల్లఁగఁ బ్రకాశించుచుండఁ జంద్రకాంతశిలల నిప్పుపుట్టునా? తల్లీ! నాయనగారు నన్నింటికిఁ దేనక్కఱ లేదు. ఆయన కాస్వాతంత్ర్యము లేదు. నాకాయాజ్ఞ లేదు. తనూజాత నాయన యొకరిచేతఁ బెట్టెను. ఆపుష్పము కంటకసమన్విత మని రాయలు త్రోసివేచెను. అది యామహాత్ముని గృహముననే పడియున్నది. ఇందు తం

డ్రిగా రేమి చేయుదురు? తల్లీ! ఆఁడుపిల్ల యెప్పటికైనఁ బరులకీయఁ బడవలసినదే! నీవు నన్ను మరణించితి నని మఱచిపొమ్ము! నాకొఱకు నీవు దుఃఖించుచుంటి వని వినుట నాకు మాత్రము దుర్భరము కాదా? తల్లీ! నీవు వెఱ్ఱిజననివి.

రాయలు కులహీనుఁ డంటివి! ఇంతకంటె నీయుత్తరమున నాకు బాధకలిగించినమాట లేదు. ఇంతకంటె నాజీవితామృతమును వనికిమాలిన క్షుద్రనీరముగ నొనర్చినమాట మఱియొకటి లేదు. ఇంతకంటె నాకొంప తీసి నట్టేటఁ గట్టినమాట మఱియొకటిలేదు! ఈమాట నాకంఠమును కాలకూటవిషమై పట్టుకొనినది. ఇదియైన సత్యమైన నాకంత బాధలేదు. శ్రీరాయలవారు సుక్షత్రియకన్య యగు నాగాంబా పుత్రులు! వారు సాగివారికి దగ్గఱబంధువులు. మన మెఱిఁగిన—మనతో వియ్యమందిన వారిబంధుగులు! తల్లీ! మీరెన్నఁడు నిఁక నిట్టితూలు మాటల వ్రాయవలదు. మనము వినినదంతయుఁ బ్రవాదము. ఇది నిశ్చయముగ నమ్ముఁడు.

నన్ను రాయలు బాధలు పెట్టెనా? ఆమహామహుఁడు నేనాతని కొనర్పఁదలంచిన యపకృతి నెఱిఁగినప్పుడు తన చంద్రహాసమున నొక్క వ్రేటునఁ జంపఁగలఁడు! కరుణాసముద్రుఁడగు నాతఁడు నన్ను బ్రదికియుండనిచ్చెను. అదియే నాకు దుర్భరముగ నున్నది. నన్నాతఁడు బ్రతికియుండనిచ్చుట యాతని దయార్ద్రహృదయమును దెలుపుచున్నది. కాని నాకీజీవితము దుర్భరమైనది. ఏమైనను నాస్వామియిష్టము ననుసరించి నేనీ దుఃఖమును భరించెదను. నాకర్హమైనశిక్ష నాకు జరుగుట ధర్మమే! అమ్మా! రాయలు దైవస్వరూపము. నీవెన్నఁడు చూడలేదు. ఆదివ్యమంగళమూర్తి కేవలము శ్రీకృష్ణావతారము! ఆతని నిందించుట భగవదపకృతి యొనర్చుటగా నమ్ముము. కష్టములు బాధాకరములే! కాని సౌఖ్యాభావము బాధకానేరదు! అది యుల్లంఘనీయము!

నేనెప్పటికైన నాతని—ఆసార్వభౌముని భార్యనే—నేనెప్పటికైన నాతని పరిచారికనే-కావుననే యాతని దేశమునుండి—యాతనియాశ్రమముతోఁ జేతనైన ధర్మకార్యములొనర్చుచుంటిని. ఆతనికి నాపైఁ బ్రేమ లేకుండిన నేమి?—ఐహికరాజ్యభోగములు నాకుండవు. నేనాతని మనసారఁ బ్రేమింపఁగలను. కన్నులార స్వప్నజాగ్రదవస్థలయందును జూడఁగలను. నేను నివసించుభూమి యాతనిది. నేనుపీల్చుగాలి యతనిది. నేను స్మరియించుపేరాతనిది. నేను ధ్యానించుమూర్తి యాతనిది. నేనా మహాత్ముని నామనస్సున నిల్పివైచితిని. నేనాతనిపేరు దలఁచుచు శయ్యనుండి లేచి యాతనిపేరు స్మరించుచు నిద్రను జెందెదను. ఆతఁడు నావాఁడు! నేనాతనిదానను కానని యాతఁడు పొమ్మని నంతమాత్రమున నాకేమి నష్టము? నన్నాతఁడు విడిచిపోఁజాలఁడు! నేనాతని భావించి సౌఖ్యముగ దినములఁ గడపుచుంటిని! తల్లీ! నీవాతని నెన్నడును నిందింపకుమా!

నేనాతని సంహరించుటయా? వాయువునంతను బీల్చివేయఁగలమా? నీరమునంతనుదాగివేయఁగలమా? అగ్నినంతను నార్పివేయఁగలమా? చేయఁగలము! అట్లు చేయుదుమా? చేయనగునా? చేసిననాఁడు—పంచభూతములకు ద్రోహము చేసిననాఁడు మనగతియేమి? తల్లీ! ఈపిచ్చిప్రయత్నమేకాదా? నన్నీవనవాసము చేయించినది! ఈయజ్ఞానమేకాదా యామహామహుని దెలిసికొనలేకపోయినది.

నేను గజపతినగరము రానా? తల్లీ! సార్వభౌమునిభార్య సార్వభౌమునిరాజ్యమును విడిచి రాదు. కాకుండిన నిలువెడలఁగొట్టినప్పుడే వచ్చియుండును. నన్నా పరమపవిత్రమూర్తి విడిచియుండఁజాలఁడు. ఉండుట శాస్త్రసమ్మతము కాదు. నేను శ్రీ రాయలవారిరాజ్యమును వీడుట దోషము.

తల్లీ! ఏమియో వ్రాసితిని. నీవని ప్రత్యుత్తరమును వ్రాసి

తిని. ఇఁక నెన్నఁడు నిట్టియుత్తరముల నాకంపకుము. నీవు సుఖముగ నుండుము. తండ్రిగారీపరిణయ మొనర్చుటలోఁ దప్పొనర్చిరని కినిసి వారిమనమునఁ జింత కలుగుమాటల నకుము, సర్వసౌఖ్యముల ననుభవించుచుంటిని. నన్ను మఱచిపొమ్ము! తల్లీ! సెలవిమ్ము.

చిత్తగింపుము,
మీవిధేయురాలు,
రుచిదేవి.

ఈయుత్తరము నంతను శ్రద్ధగ వినుచున్నయువకుఁడు విస్ఫారిత నేత్రములతో "నప్పాజీ! ఏమిది?" అని యడిగెను. అతఁడు శ్రీకృష్ణదేవరాయలు—అతని కీభృత్యవేష మేమి?

"అప్పాజీ! మందిరమునఁ జిత్రపటమునఁ గలభృంగాపదేశగీతములయర్థము చూచితివా?" అని యడిగెను.

"కర్తవ్య మేమి?" అని తిమ్మరు సనెను.

చూపుడువ్రేలు వంచి నొసటవ్రాసికొనుచు, ఖడ్గమున వ్రేలు త్రెళ్లు మెలివేయుచు రాయలు పొదరింటి కీవలకు వచ్చెను. తిమ్మరుసు వెంట వచ్చుచుండెను.

---

## పదునొకండవ ప్రకరణము.

—0—

### ప్రయాణము.

"మహాత్మా! నాపాపము పరిహరింపఁబడవలసినది కాదు. నన్నా సార్వభౌముఁడు క్షమియింపఁదగినది కాదు. నాయందవ్యాజానురాగము కలిగినట్లు—నాతప్పు క్షమియించినట్లు—నే జీవించియుండి యామహాత్మునిదివ్యనామస్మరణముఁ జేయుచునే దినములఁ బుచ్చుచున్నట్లు నామనోనాయకుఁడు చూచినట్లు—చెప్పితి రంతియ చాలు

ను. ఎక్కడకు?" అని రుచిదేవి యెదుట నాసనముపైఁ గూరుచుండి యున్న తిమ్మరుసుతో ననుచుండెను.

"దేవిగారట్లు సెలవీయఁ దగదు. మీరు తప్పక విజయనగరము రావలయును. మీకు సపత్నీ—" అని తిమ్మరు సనుచుండ

"మంత్రిశేఖరా! మీకు వందనసహస్రములు. నాసోదరియు-పట్టమహిషియు నగుదిరుమల నాకొఱ కెంతకష్టమొందినదియు, నన్నెట్లు ప్రేమించుచున్నదియు నే నెఱుఁగుదును. ఆమె వ్రాసి యంపిన లేఖ లవిగో! నేను మఱల విజయనగరమా? ఏల? కావలసిన రాయలవారిదర్శనము కలిగినది. చూడవలసినమిమ్ముఁ జూచితిని. చెప్పవలసినమాటలఁ జెప్పితిని. నాహృదయగోళమును గంపింపఁజేసినవిషయము లిప్పుడు మాయమైపోయినవి. ఇఁక నా కీభూమిపై జీవించియుండవలసినపని లేదు. నే నెచ్చటనున్న నొకటియే! నాపై ననుగ్రహముంచుఁడు." అని రుచిదేవి యనెను.

"అమ్మా! మీకు సర్వము తెలియును. పొరపాటుపడుట మనుష్యస్వభావము. జరిగిన దేదియో జరిగినది. ఇంతచిన్నతనమున మీరిట్లు విరాగమూర్తులై యుండుట మంచిది కాదు. రాయలవారి హృదయేశ్వరివై—కర్ణాటరాజ్యధురీశ్వరివై—మమ్ముల నందఱ నిచ్చమెయిఁ బాలింపవలసిననీవిట్లు సెలవీయఁదగదు." అని తిమ్మరు సనెను. రుచిదేవి కన్నులవెంబడి నీరు కాలువలు గట్టుచుండ,

"తండ్రీ! పాపాత్మురాలను! నా కాయోగ్యత లేదు. ఆదినములు పోయినవి. ఐహికరాజ్యభోగములు నా కేల? మఱల నన్నేల వెనుకటిస్థితికి దింపఁ బ్రయత్నించెదరు? నాప్రాణేశ్వరుని సర్వదా ధ్యానించుచు నన్నీకుటీరమున బ్రదుకనిండు. అలవాటుతప్పిననగరవాసమునకు నన్నేల పురికొల్పెదరు? నన్ను క్షమియింపుఁడు." అనెను.

"తల్లీ! వెఱ్ఱిదానవు. నిన్నిచట విడిచిపోవుట యనినరాయ లేమగును? నిన్ను విడిచి యాతఁ డొక్కనిముస మండునా? నీవిట్లు పశ్చాత్తాపపడినట్లు కాని—నీ కాతనిపై నవ్యాజానురాగ ముండినట్లు కాని—యాతఁ డెఱిఁగినచో నిన్నాతఁ డిన్నిదివసములు విడిచియుండునా? కలను గన్ననిన్ను—కళ్యాణస్వరూప వైననిన్ను—రాయలు హృదయపూర్వకముగఁ బ్రేమించి—విశ్వప్రయత్నముపైఁ బెండ్లియాడిన నిన్నాతఁడు విడిచివైచునా?" అని తిమ్మరుసనెను.

"తండ్రీ! నే నామహాత్మునికిఁ గష్టము లొనర్చినదాన నగుదును. నే నెదుట మెలఁగుటయే దుర్లభము! నామనస్సు విరుచుకొనుటకు నాకే శక్తి లేదు. ఐన నట్లొనర్చినను ప్రతిదినము నాపూర్వదురదృష్టపడిన మాతనిజ్ఞప్తియందు మెలఁగి యాతనికి సౌఖ్యముఁ గలిగించును." అని రుచియనెను.

"తల్లీ! మే మెంతచెప్పి—రాజ్యసంబంధ మగునెన్ని కారణములఁ జెప్పి మే మాతనికి వివాహ మొనర్చితిమి! ఎంతకాఠిన్యముమీఁద నాతఁ డావివాహ మాడెను! అప్పుడైన నిన్ను మఱచిన దేది? నిన్నాతఁ డిప్పుడు విడిచియుండునా?" అని తిమ్మరుసనెను.

"నే నెట్లు రాఁగలను?" అని రుచి యనెను.

"అమ్మా! మీ రట్లు సెలవీయఁ దగదు. అందోళికాదులు సిద్ధముగ నున్నవి. ఉత్సాహమునఁ బట్టణ మలంకరింపఁ జేయఁబంపి యున్న రాయలమనస్సు విచారమొందును." అని తిమ్మరుసు చెప్పెను.

"తండ్రీ! మీరు నాకుఁ బితృసమానులు. నాకిఁకఁ జెప్పకుఁడు. నేను విజయనగరమునకు మఱల రాలేను. నాకా మహాత్మునిదర్శన మొక్కసారి కలుగఁజేయుఁడు, ఇంతియ నాకోరిక! నే నామహామహునిపై నాగ్రహ మొందియుండునని సందియమునఁ గదా ప్రాణేశ్వరుఁడు దర్శన మీయకుండెను." అని యామె కన్నుల నీరునించెను. ఆమె తలవంచి దుఃఖించుచుండెను.

తిమ్మరుసు రెండవవైపునకుఁ జూచెను. తిమ్మరు సాగడి విడిచి బయటికిఁ బోయెను.

రుచిదేవి కన్నుల నొత్తుకొనుచుఁ బయికిఁ జూడకయే దుఃఖించు చుండెను. శ్రీకృష్ణరాయ లామెప్రక్క నిలువఁబడి యుండెను.

“మహాత్మా! నా కాదివ్యమంగళవిగ్రహము నొక్కసారి చూపింపుఁడు! ఆమహాభాగుని పాదములపై నన్నొకసారి పడనిండు! నాప్రాణేశ్వరుని పాదకమలముల నాయశ్రుధారలఁ గడుగనిండు! నా కదియ పదివేలు! ఇఁక నీజన్మమున నే నేమియుఁ గోరను!” అని రుచి దుఃఖాతిరేకమునఁ దిమ్మరుసుపాదములపైఁ బడుచుంటి ననుకొని పైకిఁ జూడకయే క్రిందకు వ్రాలెను.

“దేవీ! నీ కింతపామరత్వమా? నీ వింతదుఃఖింప వలయునా?” అనుచు రాయ లామెను లేవనెత్తెను.

రుచి యొక్కయుదుటన లేచి రాయలవదనమును జూచెను. అశ్రుజలపూరితము లగు నామెకన్ను లాతనిఁ జూడ లేకపోయెను. ఆమె కాతఁడు రాయలని తెలిసెను. ఆతనిపాదములపైఁబడి హస్తద్వయము నాతనికాళ్లకుఁ బెనవేసి దుఃఖించుచుండెను. ఆమెశరీరము వివశమైపోయెను. ఆమె కనిర్వచనీయ మగులోకాంతర ప్రయాణ మొనర్చినట్లయ్యెను. ఆమె యాలోచన మాఁగిపోయెను. ఆమెకు బుద్ధియు—మనస్సును—శరీరమునుగూడ లేనట్లుండెను. వర్ణనాతీత మగునానందాతిరేకమున నామె కన్నీరు కాలువలుగట్టున స్రవించుచుండెను. ఆమె యెఱుఁగదు. ఆమె బాలికవలె భోరుమని యేడ్చెను. శూరాగ్రేసరుఁడగు రాయలహృదయము ద్రవీభూతమయ్యెను. ఆతనిశరీరము జల్లుమనిపోయెను. నోటమాట రాక యాతఁడును గ్రిందకుఁ బడెను. రుచి నాతనియొడిలోనికి దైవమే చేర్చెను. ఆతనికి మాటలాడుటకైన సత్త్వము లేకపోయెను. ఆమె నోదార్చుట కాతనికి మాటలు లేకపోయెను.

భావములు విప్పి చెప్పుటకు మాటలు దొరకలేదు. అతఁడు మూఁగవలె శబ్దోచ్చారణమును—చెవిటివలె ధ్వనిగ్రహణమును—జడమువలెఁ జేష్టలును లేక యామెనట్లో కౌఁగిలించుకొని పడిపోయెను. అన్యోన్యాలింగనాయత్తములై పడియుండు నాగుబాములవలె వారిరువురు వచ్చుట నెంతకాలమో పడియుండిరి. ఆకాలము—వారలేస్థితియందుండిరో—వారే యెఱుఁగని యాకాలము దుఃఖకరమో—సంతోషకరమో—యెవ్వరు చెప్పఁగలరు?

కొంతవడికి లేచి వారొండొరులను జూచుకొనిరి. ఇరువురకును భావోద్రేకమున సంతోషదుఃఖాతిరేకమున నశ్రుధారలు గురియుచుండెను. ఇరువురును జూపులవలననే యన్యోన్యభావములను గ్రహించి దుఃఖించుచుండిరి.

"దేవాదిదేవా! ప్రాణేశ్వరా! నన్నను గ్రహించితిరా? నాకు దర్శన మొసఁగితిరా? నాపాపముల క్షమించితిరా?" అని పలుకుచు రుచిదేవి రాయలయొడిలోఁ దలవాల్చెను.

"దేవి! మనోహారిణీ! నీహృదయావేదనమున కిది—" అతఁడు చెప్పలేకపోయెను.

"అప్పాజీ!" అని రాయలు పిలిచెను.

రుచిదేవి లేచి లజ్జతో నించుక దూరమున నిలువఁబడెను.

"అందోళికలు సిద్ధముగ నున్నవా?" అని రాయ లడిగెను.

"చిత్తమ" ని బయటినుండియే ప్రత్యుత్తరము వచ్చెను.

రాయలు లేచి రుచిదేవిని గౌఁగిలించుకొని "ప్రయాణమునకు ముహూర్తము సమీపించినది." అని రాయ లనెను.

రుచిదేవియేదియో చెప్పఁదలంచెను. ఆమెమాటలాడ లేకపోయెను.

ప్రయాణసన్నాహగీతములు పరిచారికలు పాడుచుండిరి. సర్వమును శాంతిప్రదమై యుండెను. వరదరాజమ్మగారిమందిరము—ఆ రా

యము—చెన్నుతరిగి యుండెను. ప్రకృతి యంతయుఁ గరుణారసప్రపూర్ణమై యించుక దిగులు పుట్టించుచుండెను. గంభీర మగునాసమయ మెంత పవిత్రమైనది ! — ఎన్ని తలంపులకు వీలయినది ! ఎన్ని భావముల కాకరమైనది !

## పంద్రెండవ ప్రకరణము.

### మనుచరిత్రము.

"నీ వీసత్రమున నేల వంట చేసికొనుచున్నావు ?" అని యొక బ్రాహ్మణుఁడు విజయనగరమునందలి రాజమందిరమున కించుక దూరమునఁ గలధర్మసత్రమున వంటఁజేసికొనుచున్న మఱియొక బ్రాహ్మణు నడిగెను.

"అవును. ఇచ్చటనే చేసికొనుచుంటిని. కొన్నిదినములవఱకిచ్చటనే యుందును." అని యావంటచేసికొనువాఁ డనెను.

"పెద్దనగారికిఁ దెలియదా ? మీతాతగారూరనుండ నీ విట్లు చేయుట యుచితమా ?" అని మొదటియాతఁ డనెను.

"ఇదిగో ! ఈకార్య మైనపిమ్మటఁగాని తాతగారిదర్శనము లేదు." అని రెండవయాతఁ డనెను.

"ఎందువలన ?" అని మొదటియాతఁ డడిగెను.

"'పండితుఁడ వైనఁగాని నీమొగముఁ జూచుట లేదు.' అనిన తాతగారికి నాపాండిత్యలేశమును జూపింపవలయును. అది యాతఁడు మెచ్చిననే నే నిట నుండుట." అని మొదటియాతఁ డనెను.

"సూరనార్యా, నీ కింతపట్టుదల యేల ? కాశీయాత్రనుండి వచ్చిన దెప్పుడు ?" అని రెండవయాతఁ డనెను.

"రామేశ్వరముకూడఁ బోయివచ్చితిని. మఱచితిని. మధురలో మీయయ్యలరాజు వేంకటకవిగారు కనఁబడినారు. కాని రామభ

డా! వేంకటకవిగారు మీకుఁదాతాసహోదరులా ?'' అని పింగళి సూరనార్యుఁ డడిగెను.

''అవును. మొన్న నాయన—మాసముదినము లైనది. రాయ లదర్శనము చేసియే యాత్రకుఁ బోయినారు.'' అని యయ్యలరాజు రామభద్రుఁ డనెను.

''ఏదియో చిన్నవాండ్రము కదా! పెద్దలని వేంకటకవిగారికి నాగ్రంథము చూపితిని. ఆయన పాండిత్యమున నసమానులే!'' అని సూరనార్యుఁ డనెను.

''అవును. కావ్యరచన యాయనకుఁ గిట్టదు. చెప్పినఁగవిత్రయమువంటికపత చెప్పవలయు నందురు.'' అని రామభద్రుఁడనెను.

''మిత్రుఁడా! ఏడెనిమిదేండ్లయినది కాశికిఁ బోయి—రాజ్యములో విశేషములు చెప్పవుకద!'' అని సూరనార్యుఁ డనెను.

''ఏమియు లేవు. రాయలవారి మొదటివివాహ మెఱుఁగుదువా?'' అని రామభద్రుఁ డడిగెను.

''లేదు! లేదు!'' అని సూరనార్యుఁ డనెను.

''భోజనమువేళ యైనది. పోయిమరల వచ్చెదను. మధ్యాహ్నము తీరికగ మాటలాడుకొనవచ్చును.'' అని రామ భద్రుఁ డనెను.

''కాని మిత్రుఁడా ! నీ క్షేమైన నాస్థానమునఁ బ్రవేశము గలిగినదా?'' అని సూరనార్యుఁ డనెను.

''ఇదిగో ! తాతగారే యొప్పగించినారు. రెండేండ్లయినది. ప్రస్తుత మీగ్రంథము వ్రాయుచున్నాను. రాయ లొనర్చిన సకల కథాసారసంగ్రహమున కాంధ్రీకరణము.'' అని రామభద్రుఁ డనెను.

ఇంతలో రాజమందిరప్రాంగణమున భేరీనినాదము వినఁబడెను. వారిరువురు నావైపునకుఁ జూచిరి. అచ్చట నెందఱో జనులు మూఁగియుండిరి. భజంత్రీలు మేళము సాగించిరి. ముత్యాలజాలరులతోఁ గూ

డినపల్లకి యొక్కటి తెచ్చి యుంచిరి. స్త్రీపురుషులు బాలుర బాలికలు నెండలో వచ్చి మూఁగుచుండిరి.

కొంతవడికి "జయీభవ! విజయీభవ!" అని కేకలు వైచుచు వందిమాగధులు బల్లెములఁ జేత నుంచుకొని పల్లకికడకు వచ్చిరి. బ్రాహ్మణు లనేకులు పనసలఁ జెప్పుచు నచ్చట నిలువఁబడియుండిరి. ఇంతలో తూర్యారవము లాఁపిరి.

"ఇది యంతయు నేల?" అని సూరనార్యుఁడు రామభద్రు నడిగెను.

"తెలియదు. నేను నిన్ననే నగరమునకు వచ్చితిని. మీతాతగారికడకుఁ బోవ నచ్చట లేరు. తలుపులు వైచియుండుటచేఁ గొలువ లేదు. ఇంటికిఁ బోవుచుండ నీ వగపడితివి" అని చెప్పి "అదిగో! పెరుఁగు వచ్చినది." అనెను. ప్రక్కవారల నడుగ నాతూర్యారవము లేలోకొ యెవ్వరును జెప్పలేకపోయిరి.

సూరనార్యుఁడు వెనుకకుఁ దిరిగి గదిలోనికిఁ బోయి "అయ్యో! అన్నము చిమిడిపోయినది." అని యొకగిన్నె తెచ్చి "అమ్మా! మంచి పెరుఁగు పోయుము." అని సూరన పలికెను. "బాబూ! మంచిపెరుఁగు కావలసినచోఁ గోటగుమ్మముకడ నుండి రానిత్తురా? మేము వెనుకకుఁ బోవలసినదే! మునుపటివలెఁ గాదు బాబూ! పరిశుభ్రమయినపాలు పెరుఁగు నమ్ముచుండిన రాజభటులు దండనాధికారికడకుఁ గొనిపోవుదురు," అని చెప్పుచు నాతఁడు కోరిన పెరుఁగు పోసెను.

"వంటలో మామిత్రుఁడు నేర్పరియే!" అని సూరన వండిన కూరలఁ జూచుచు రామభద్రుఁ డనెను.

"కాశిలోనుండి నేర్చిన దేమి? ఘటపాండిత్యము! ఘంటాపాండిత్యము. తప్పెల కెసరెక్కించుట, తల కాలోచన మెక్కించుట— కడవలో గుడగుడ, గంటములోఁ బరపర—కడవలోఁ బరిశుభ్ర పాకము కవిలెలో గ్రంథపాకము—గంజివార్పు, రసములనేర్పు—పాకనము

శుచి, పద్యముల రుచి—ఇవియే! ఈ రెంటియందును గట్టిపాండిత్య మలవడినది." అని సూరనార్యుఁ డనెను.

"విశ్వామిత్రుఁడు రాముని దెచ్చుటకు దశరథునికడకుఁ బోయి రామలక్ష్మణులఁ బొందినట్లు—నీవు కాశికి సంస్కృత పాండిత్యసంపాదనమునకుఁ బోయి సాహిత్యాలంకారశాస్త్రములఁ బాండితి నొందివచ్చితివి. అయిన నీభార్య నిన్ను వెదకుచుఁ గాశికిఁ బోయినదని వింటిని. ఆమె యెందైనఁ గన్పడినదా?" అని రామభద్రుఁ డనెను.

అతఁడు ప్రత్యుత్తరము నీయక రాజమందిరము వైపునకుఁ జూచుచుండెను. అప్పుడు మంగళ భజంత్రీలు మేళము సాగించిరి. పిమ్మట ననేకులు రాజభవనమునుండి బయటికివచ్చిరి. బంగరుపీఠముపై నొక తాళపత్రగ్రంథము పసుపురాచినది పెట్టి యొక బ్రాహ్మణుఁడు తీసికొనివచ్చెను. దానివెనుక రాయలువారు సత్కవులతో నీవలకు వచ్చెను. అల్లసాని పెద్దనకవితోఁ జేయిచేయి గలుపుకొని రాయలు వచ్చుచుండెను. పెద్దనగారి కాలిపై గండపెండేరము ప్రకాశవంతమై యుండెను. మెడయందు రత్నహారములు మెఱయుచుండెను.

పెద్దనగారిని రాయలు పల్లకిలోఁ గూరుచుండఁ బెట్టిరి. పుష్పమాలాలంకృతుని జేసిరి. గజములపై బిరుదు పతాకములతో ముందు భటులు బయలువెడలిరి. అప్పుడు వందిమాగధులు "జయీభవ" అని మఱలఁ గేకలువేయుచుండిరి. కాసెకోకలు బిగించుకొని నిలువఁబడియుండిన చాకలివాండ్రు బోటుకత్తులతో నాపల్లకి నందుకొనుటకు సిద్ధముగ నుండిరి. అప్పుడు తెనాలి రామకృష్ణుఁడు ముందునకు వచ్చి పల్లకికడ నిలువఁబడెను. అప్పుడు రాయలవారు పల్లకికొమ్ము నొకచేతఁ బట్టి యెత్తుటకు సిద్ధముగ నుండెను. "నేనుఁగూడ రామకృష్ణుఁడను రెండవకొమ్ము నేనుబట్టుదునా?" అని తెనాలిరామకృష్ణుఁ డనెను. రాయలు మందహాసముతో సరే యనెను. వారిద్దరు నాతాతగారి నెత్తి

రెను. "ఆంధ్రకవితాపితామహా! అల్లసానిపెద్దనార్య! జయీభవ! విజయీభవ!" అని జనసంఘమంతయు నొక్కపెట్టున నఱచిరి. కోలాహల మయ్యెను. పిమ్మట జాకలివాండ్రకు బల్లకి నిచ్చి రాయలును రామకృష్ణుడును సంతసపడిరి. "క్రిందకు బడిపోవుదువోయి రామకృష్ణా! కొంటెవాడవు." అని పెద్దనార్యుడు రామకృష్ణునిజూచియనెను.

పిమ్మట రాయలయనుజ్ఞ ననుసరించి పెద్దనార్యు నాజనసంఘ మూరేగించిరి. రాయలవారు వెంటబాదచారులై వచ్చిరి. పట్టణమంతయు మూగిపోయెను. మనుచరిత్రము కృతినొందిరని విని రామభద్రుడును సూరనార్యుడు నామహావైభవమును జూచుటకుబోయిరి. సూరనార్యుడు తాతగారికి జరిగినమహావైభవమును జూచుటకు సందేహింపలేదు. మసివస్త్రమునుపడిచి, భుజియింపకయే భోజనపుగది తాళమువైచి జనసంఘముతోగలసి కొంతవఱకూరేగింపుటుత్సాహముతో బోయెను.



## పదమూడవ ప్రకరణము.

—(o)—

### అష్టదిగ్గజములు.

"వచ్చినారు. ఇటకు వచ్చెదరు. ముందు మీరాయనపాండిత్య నంగీకరించినగదా!" అని పార్వతి పెద్దన్నగారితో భోజనసమయమున ననెను.

"అమ్మా! నీకొఱకైన నేనాతడు పండితుడని యంగీకరింపవలెను. మాటకొఱకుగదా కాశికిబోయినాడు. మఱల నేమైన ననిన— నీవేడ్చెదవు. నీ కీకష్టములకు నేనే కారకుడ నైతిని." అని పెద్దన పలికెను.

"మీ కాసందేహము వలదు. మీ రనిరని యభిమానమునైన విద్య వచ్చినది. విద్యలేనియెడ బ్రయోజన మేమి? ఇందుగొప్ప మే

మున్నది? గుసగుసలాడ నెందులకు చేయుటలేదు.'' అని పార్వతి యనెను.

"నిష్కారణముగ నిన్ను దుఃఖపెట్టినాఁడు! నీ వాదేవిగారియండఁ జేరకుండినచో నెన్నిసిలుగులపాలై యుందువో యరణ్యమున నామాత్రము యోజింపవైతివి.'' అని పెద్దన నుడివెను.

"ఇప్పుడు వచ్చినప్రమాద మేమియును లేదు. నే నెట్లో పోయి సమాధానము చెప్పివచ్చితిని. మీయొద్దకుఁ దీసికొనివత్తును. రాఘవపాండవీయ మను ద్వ్యర్థికావ్యము వ్రాయుచున్నారు. తీసికొనిరమ్మని సెలవైనచోఁ దెత్తును.'' అని పార్వతి యనెను.

"అతఁడు ముందు నా మొగము చూచునా? సత్రమున వంటఁ జేసికొనిన యాతఁడు నాయింటి కెట్లువచ్చును? మఱియు వేములవాడ యాతఁడు వ్రాసె నందురు. ద్వ్యర్థి వ్రాసినాఁడుగా! అని పెద్దన పలికి యుత్తరాపోశనమునుబట్టి లేచెను.

"దాని కాయన చెప్పినారు. ఈగదిలోని కాయనవచ్చి కూర్చుందురు. పిమ్మట మీరు చదువుమనినఁ జదివెదరు.'' అని పార్వతియనెను.

"మంచిదట్లే చేయుమ'' ని పెద్దన నుడివి చావడిలోనికి వచ్చి తాంబూల మొకబాలిక తెచ్చినది తీసికొని నములుచుండెను.

కొంతసేపటికి గదిలోనికి సూరనార్యుఁడు వచ్చినటులు పార్వతి చెప్పెను.

"ఏది? చదువు మనుము'' అని పెద్దన నుడివెను.

అంతట గదినుండి "శ్రీతోఁబుట్టి సుధామధుద్రవముతో—'' యని తీర్చిన కంఠస్వరమున నొకపద్యము వినవచ్చెను.

"అది యటు లుండనిమ్ము! కృత్యాది యక్కఱ లేదు. గ్రంథమంతయుఁబూర్తి యైనదా?'' అని పెద్దన యడిగెను.

"మొదటిప్రార్థనపద్యములును—కథలో స్వల్పభాగమున్నవి కృతి యెవరికి నియలేదు.'' అని యొకస్వరము బదులు చెప్పెను. అది

సూరనార్యునిదని చావడిలోఁ గూరుచుండిన భట్టుమూర్తి తలంచుచు వానిని జూడ నాతఁడు చదువుచుండెను.

"సరియే? సూరనా! నీ వెన్నిదినములైనది వెడలి?" అని పెద్దన యడిగెను.

"ప్రమాది విక్రమ— —సర్వజిత్తు! యెనిమిదివత్సరములు దాఁటినది." అని భట్టుమూర్తి యనెను.

"ఏది చదువుము—కథాప్రారంభమునుండి ప్రారంభింపుము." అని పెద్దన పలికెను.

"వెలయు సకలభువన" అని ప్రారంభించి "మాయ లేకయుం విహరించె మనుజవిభుఁడు!" అని యెనిమిదిపద్యములను సూరనార్యుఁడు చదివెను.

"తరువాత," అని సాగుదుగఁ బెద్దన యడిగెను.

"మ॥ తలపం జొప్పడి యొప్పె నప్పుడూహాహూహూహూ హూహూ—" అని సూరన చదువుచుండెను.

"అప్పుడే మూడు విరుపులా" అని పెద్దన నవ్వెను.

గ్రంథమునందలిపద్యమును విడిచి

"తదు § ద్యజ్జైత్రయాత్రాప్రసము
త్కలికారింఖదసంఖ్యసంఖ్యజయుగ § త్కంఖాణరింఖావిశృం
ఖలసంఘాతధరాపరాగపటలా § క్రాంతంబుమిన్నైయన
గ్గళభేరీరవనిర్దళద్గగన రే § ఖాలేపపంకాకృతిన్."

అని యాశువునఁజెప్పి గ్రంథములోనిపద్యమును మార్చెను.

"నాయనా! ఇప్పుడు నీవు నామనుమరాలిమగఁడవోయి!" అని పెద్దన లేచి గదిలో నున్నసూరనార్యునికడకుఁ బోయి కౌఁగిలించుకొనెను.

"నేను మీమనుమరాలిమగఁడ నగుట కిట్టికవిత్వమును జెప్పి చూపవలసివచ్చినది. కాని—" అని సూరనార్యుఁడు నవ్వుచుఁ బెద్ద

నార్యుఁడు తీసికొనిరాఁ జావడిలోనికి వచ్చెను.

"కాని యేమి?" అని పెద్దన యాతనిగూరుచుండఁ బెట్టి హెచ్చరించెను.

భట్టుమూర్తి లేచినిలువఁబడి సూరనార్యునికి నమస్కరించెను.

"మీ బాలిక మగఁడ నగుట కీకవిత్వము గాని—కవిత్వ బాలికపోలికమైన నీకావ్యమున నుండఁజాలదు." అని సూరనార్యుఁడనెను.

"తరువాత మీయుష్టానుసారము కావ్యములు వ్రాయవచ్చునిది పూర్తిచేయుఁడ" ని భట్టుమూర్తి యుత్సాహముతోననెను.

అప్పుడు రాజభవనమునుండి భృత్యుఁ డొకఁడు వచ్చి నమస్కరించి రాయలవారి కనుజ్ఞ యైనదని చెప్పెను. "ఏమి? తొందరగవచ్చితివి" అని పెద్దనార్యుఁ డడిగెను.

"చిత్తము! మీమనుమరాలిగారిభర్త సూరన్నగారితోఁ బాశ్వతమ్మగారినిగూడ దీసికొనిరమ్మని యంతఃపురమునుండి వార్తవచ్చినది. బండ్లు వచ్చినవి. తమరవశ్యముగ రావలయును." అని భృత్యుఁడనెను.

"రాయలవా రెక్కడ నున్నారు?" అని పెద్దన దుస్తులుధరించుచు నడిగెను.

"చింతామణీమందిరమున—" అని భృత్యుఁ డనెను.

"ఎవరెవరు వచ్చిరి?" అని పెద్దనార్యుఁ డడిగెను.

"చిత్తము రామకృష్ణకవిగారు—ధూర్జటిగారు—తిమ్మకవిగారు—మాదయ్యగారిమల్లనగారు—తిమ్మరుసయ్యవారు—అయ్యలరుసయ్యవారు—రామభద్రకవిగారు—" నని భృత్యుఁడు చెప్పెను.

"ఏదియో విశేషముండును." అని పెద్దన పలికెను.

"పెద్దసభ కేర్పాటులు చేయుచున్నారు." అని భృత్యుఁడనెను.

"రాఘవపాండవీయమును దీసికొనిరమ్ము" ని పెద్దనార్యుఁడు సూరనతో ననెను.

"అది యింకను బూర్తి గాలేదు; ప్రథమదర్శనమున నిదియేల? వలదు." అని సూరనార్యుఁ డనెను.

పిమ్మట భట్టుమూర్తితోఁ గలసి వారిరువురును రాయల దర్శనమునకుఁ బోయిరి.

నాఁడు రాయలు సూరనార్యునకును భట్టుమూర్తికి నాస్థానకవిస్థానము నొసఁగి యాదరించిరి. నాఁటిమహాసభయందు రాయలు పూర్వదిగ్విజయయాత్రయందుఁ దలపెట్టిన "ఆముక్తమాల్యదా కావ్యము" రచియించుటకుఁ బూనుకొందుమని సెలవిచ్చిరి. సభలో రామకృష్ణుఁడు "ఎనమండ్రు కవులైరి. అష్టదిక్పాలురవలె నష్టదిగ్గజములు నేర్పడిరి. రాయలకీర్తికాంతావిహార మిఁక నిరంకుశము!" అని హెచ్చరించెను. అప్పుడు రాయలవా రష్టదిగ్గజములకును "దిప్పలూరు" గ్రామము సర్వాగ్రహారముగ నిచ్చివేసిరి. *

## పదునాల్గవ ప్రకరణము.

—(0)—

### ఉపసంహారము.

ప్రభాతసమయమునఁ బుట్టినపరిమళవంతమైనపుష్ప మొకింతకాలము ప్రకాశించి నశించుచున్నది. మఱికొంతకాలమునకు మన మాపుష్పకాంతులఁ జూడలేము. కాని స్మృతియం దాపుష్పమును దిరిగి చూడవలయునని కోరుకొనుచుందుము. కాని యది మఱల మన కంటికి గనపడదు. ఆకుసుమమును వికసింపఁజేసిన యాప్రభాతముమాత్రము మఱల మనకంటికి గనపడుచున్నదా? అటుగాగ ప్రశాంతములగుప్రభాతములను, ప్రభాతసమయవికసితము లగుకుసుమములను, మనము చిరకాలమునుండి చూచుచున్నాము. కాని యొకదానితో మ

* సర్వజిత్సంః ౧౪౮౦ శ్రావణ బ ౩॥ సోమవారము శాసన మున్నది. (Vide 73 P. P. కవిజీవితములు Vol. VI. రెండవకూర్పు గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు.)

ఆయొకదానికిఁ బోలిక లేదు. ప్రకృతియం దెద్దానికిని సామ్యము లేదు. కాని కొన్ని సామాన్యధర్మములు గలయుపమానము లగుపారిభాతవస్తువులఁబట్టి యుపమేయములగుపారిభాతవస్తువులను స్మృతికిఁ దెచ్చుకొనుచుందుము.

శ్రీకృష్ణరాయునిభావకుసుమము స్వప్నగతరుచిదేవీరూపపారిభాతకాంతిసందర్శనమున వికసించినది. పరిమళించినది. కాలాంతరమున నాపారిభాతకాంతులు మాఱిపోయినవి. కుసుమము జాఱిపోయినది. మాఱిపోయినకాంతులలో జాఱిపోయినపుష్పము ఫలించి, రాలి, మొలకలెత్తి, పొదలి మఱలఁ బారిభాతమున మొగ్గదొడిగి వికసించినది. పోలిక యున్నంతమాత్రమున నాపారిభాతమునకు నీపారిభాతమునకుఁగాని, యాకుసుమమునకు నీకుసుమమునకుఁగాని సామ్యము లేదు.

రుచిదేవీకృష్ణరాయ లిప్పు డనంతప్రేమసాగరతరంగములపై మనోజ్ఞనౌకావిహారము సేయుచున్నారు. ఆనందస్వరూపిణియగుకరుమల వారికిఁ గర్ణధారిణియై యున్నది. వేయేల? ఇప్పు డామువ్వురు నేకశరీరులై ప్రేమానందసుఖస్వరూపులై విలసిల్లుచున్నారు. ఆప్రేమతరంగము లిప్పటికిని కంబముకడ మహాసరోవరమున నృత్యము సేయుచున్నవి. ఆయనురాగకుసుమము లిప్పటికి నాసరోవరమున వికసించి పరిమళించుచున్నవి. ఆప్రేమగీతముల నిప్పటికి నందలిభ్రమరరాజములు గానముసేయుచున్నవి. *

రుచిదేవి పట్టపుదేవి యేలకాలేదని పాఠకులు సందియమొదవుచున్నదా? ఆమె యేమహాపురుషుని హృదయేశ్వరునిగ భావించుచున్నదో—ఎవ్వనితోడిదే లోకముగ సంచరించుచున్నదో—ఎవ్వని సందర్శనమును గోరి జీవించుచున్నదో—ఎవ్వనియెడలఁ దానుచేసిన

* పారిజాతసాగర మనునావికాలతటాకతీరమునఁ బారిభాతలతమగడు విజేవిళలాపరిమళకలదని స్థలజ్ఞులు చెప్పుచున్నారు.

యపరాధములంగూర్చి పశ్చాత్తాప పడుచున్నదో—అట్టి శ్రీకృష్ణదేవ మహారాయలు—ఆమెహృదయమునకు హృదయమై- చైతన్యమునకుఁ జైతన్యమై—ప్రాణమునకుఁ బ్రాణమై సంభావించుచుండ నట్టిమహానందముకంటె-భర్త తన్నుక్షమియించె నని వినుమహానందముకంటె-భర్త మఱలఁదన్ను బ్రేమించుచుండె నని వినుటకంటె—భర్త మందిరమున భర్తగౌరవమునఁ జూచుచుండ నాతనిచెంత నివసించుచుండుట కంటె—భర్తతో దినారాత్రములు భగవద్ధ్యానము చేసికొనుచుఁ బుస్తకపఠన మొనరించుకొనుచుఁ, గావ్యరచనమునకుఁ గడంగుచు, జ్ఞానదాయకము లగువిషయములఁ జర్చించుకొనుచు, విద్వజ్జనులఁ బోషించుచుఁ, గవుల నాదరించుచుఁ, గావ్యముల నందుకొనుచు, జీవమాత్ర నిశ్చింతగఁగడపుటకంటె నామెకు రాయలపట్టమహిషియగుట యొక్కవ యానందకరమా ? నిర్మలహృదయమునఁ బవిత్రప్రేమముతోఁ గడపిన యొక్కనిముసమే మహానందదాయకమై యుండ నంతకాల మామె జీవితేశ్వరునిమనమును జయించి తనయొద్ద బంధించి కూరుచుండఁ బెట్టఁ గలిగినంతటిమహా ప్రణయతరంగముల నుయ్యేలలూఁగుటకంటె, నామె కింకేమికావలయును ?

చదువరులారా! పవిత్రాంధ్రరాజ్యప్రతిష్ఠాపకుండును, వీణానిక్వణనంబుఁ బోలుధ్వనియుఁ, దేనెసోనల ననుకరించు రుచియుఁ గల యాంధ్రభాషకుఁ బునరుద్ధారకుండును, మహైశ్వర్యవంతుఁడు నగు శ్రీకృష్ణదేవమహారాయని యీపవిత్ర జీవితకాలమే మనకుఁ బ్రభాతము!

పాఠకోత్తములారా! శ్రీకృష్ణరాయల సైన్యములు, గజములు, అశ్వములు, సమస్తైశ్వర్యములు మీరు కనివిని యున్నారు. అతఁడు జయించినదేశ వైశాల్యమును గని యచ్చెరువొంది యున్నారు. అతఁ డోడించిన శత్రురాజుల లెక్కింపలేకపోయినారు. ఇదియే యాతనివరాత్రమ ప్రభాతము!!

ఆంధ్రసోదరులారా!

కీర్తిమంతుఁడగు శ్రీకృష్ణరాయలు—ఆతని యైశ్వర్యము—ఆతని రాజ్యము—ఆతఁడు నివసించిన విజయనగరము—ఇవియన్నియు క్షణికములు! కాని యాతఁడు కవులనాదరించుటయు విద్యాపోషకుఁ డగుటయుఁ గవిరాజసేవకుఁ డగుటయుఁ బండితభృత్యుఁ డగుటయు నాత్మజ్ఞాననిధి యగుటయు నాంధ్రరాజ్యలోకమున—భాషాలోకమున—సూచించు సహస్రకరోదయ మిదియే. ఇదియే ప్రభాతము!

భాషాభిమానులారా!

భక్తుఁడైనరాయలు—రాజ్యము క్షణభంగుర మని యెఱిఁగిన రాయలు—కవిత నాదరించుటతోఁ గవులఁ బోషించుటతోఁ దనివిచెందనిరాయలు—ఆముక్తమాల్యదా కావ్యమును రచియించెను. రాయల స్వభావపరిశీలనాశక్తి—భావపటిమ—రసోజ్జృంభణము—సహజోక్తియు నందనుభవైకవేద్యములు! ఇదియే యాతని మహాకార్యములలో నొకటి! ఇదియే యాతని మహాకావ్యములలో నొకటి! ఇదియే సంస్కృతభాషకు భోజునివలె—ఆంధ్రభాషయందు రాజకవిరాజు రచియించిన ప్రథమకావ్యము. ఈకావ్యోదయమే సుప్రభాతము! ఇదియే యాతని యత్రాసమగు వజ్రము! ఇదియే యాంధ్రభాషయుందు సంతకాలము వాఙ్మయమున నిలిచియుండు సుప్రభాతము!



# అనుబంధము.

## ఈనవలనుగుఱించి పత్రికలును, పండితులునిచ్చిన యభిప్రాయములు.

### ఆంధ్రపత్రిక, మదరాసు 18-11-15. ఇట్లు వ్రాయుచున్నది.

**ప్రభాతము.**

ఇది యొక చారిత్రికనవల. వంగూరి సుబ్బారావుగారు గ్రంథకర్తలు. శ్రీరామవిలాసగ్రంథమాలవారిచే ప్రకటింపఁబడిన గ్రంథములలో నిది రెండవది. ఈ గ్రంథమును చదువచదువ రసప్రవాహమున మునిఁగిపోతిమి. ఆంధ్రభాషాపోషకులగు శ్రీకృష్ణదేవరాయలవారిచారిత్రమే, నవల కితివృత్తము. రసపోషణ మత్యంతశ్లాఘనీయము. తిమ్మరుసుమంత్రిరాజనీతిజ్ఞత. తిరుమలదేవియుదారభావము, పింగళిసూరనార్యునియాత్మగౌరవము, రుచిదేవి సుగుణవిలసనము, పార్వతి పతిభక్తి, రాయలవారికి కవీంద్రులపట్లకలభక్తి, గజపతిసత్యవాక్యనిరతి మున్నగునవి సహజమనోహరముగ వర్ణింపఁబడినవి. ఇందు ప్రకృతకాలానుగుణ్యమగు శాక్యతంత్రమును దేశహితాచరణమును సేవావ్రతులధర్మములునుగూడ సమయానుకూలముగ వ్రాయఁబడినవి.

---

### ఆంధ్రచంద్రిక యిట్లు వ్రాయుచున్నది. (4-11-15)

**ప్రభాతము.**

సింహతత్రయాధిపత్యముక్రిందఁ బ్రచురింపఁబడిన యీనవలయందు లోపము లుండఁజాలవు. కథను చక్కఁగ సాగించినందులకు గ్రంథకర్తగారగు వంగూరి సుబ్బారావుగారిని హృదయపూర్వకముగ నభినందింపుచున్నారము. ఇది పండితపామరకర్ణరసాయనంబుం గావించుననుటకు సందియ ముండదు. గొప్పగొప్ప బహుమతులఁ దీసికొని వ్రాసినవారి నవలలకంటె నిది యెన్నియోమడుంగులు శ్రేష్ఠతరముగ నున్నయది. వీరి యుద్యమమునకే కృషిసలుపఁ బ్రార్థితులు. శ్రీకృష్ణదేవరాయలుదాసీపుత్రుఁడుగాదని నిరూపించుచు వారియంతఃపురవిశేషములు, భాషాపోషణోద్యమము, మున్నగువిషయములఁ జక్కఁగఁ జిత్రించియున్నారు. చక్కని భాషలో వ్రాయఁబడినది. దీని వెల రు 0-12-0 శ్రీరామవిలాసగ్రంథనిలయము చిత్రాడ, పిఠాపురముః గోదావరిజిల్లా యని వ్రాయవలయును.

---

## దేశాభిమాని, గుంటూరు 20-2-16.

### ప్రభాతము.

ఇయ్యాది పిఠాపురమునందు స్థాపింపఁబడిన "శ్రీరామవిలాసగ్రంథమాల" వారిచే బ్రచురింపఁబడినవానిలో రెండవగ్రంథము. గ్రంథకర్త వంగూరి సుబ్బారావుగారు. గ్రంథమాల సంపాదకులు శ్రీచెలికాని లచ్చారావుగారు. గ్రంథస్థమగువిషయము శ్రీకృష్ణదేవరాయలువారి ప్రథమవివాహము. గజపతినగరరాజుగారికుమార్తె రుచిదేవిని వివాహమాడుట, పరిత్యజించుట. ఆమెగారు పుట్టింటికి బోనొల్లక రాయలప్రభుత్వభాగమందె యొకపల్లెయందు ప్రస్తుతము కర్నూలుజిల్లాయందలి కంభముప్రాంతమందు యోగినివృత్తియందు పతిధ్యానపరాయణియై నివసించియుండుట. రెండవభార్య తిరుమలదేవియొక్క ప్రోత్సాహముచే రుచిదేవిని రాయలు తిరిగి తెచ్చుకొనుట, అలసాని పెద్దన్నగారి మనుచరిత్రము కృతినంది యందల మెక్కించుట, పెద్దన్నగారి మనుమరాలిమగఁడగు సూరనార్యునికి పాండిత్య మలవడినవిధము, మొత్తము పదునాల్గుప్రకరణములుగ (14 కాదు 30) వ్రాయఁబడినది. ఈగ్రంథమును బూర్తిగ జదివినచో సంపాదకులు సూచించినచొప్పున శ్రీకృష్ణదేవరాయలుయొక్క రాజ్యవైభవము సంస్థానమర్యాదలు మొదలగునవి చక్కగ నిందు వర్ణింపఁబడినవి. మఱియు రాయలకు గలకవితాదరణ, ఆకాలమందు రాజులకుండు చిత్రలేఖనశక్తి, అప్పటికాగితములవాడుక పరదేశీయులప్రసంగము మొదలగుచరిత్రాంశముల దెలుపుచున్నది. మంత్రితిమ్మరుసుయొక్క రాజకీయకార్యనిర్వాహణధురంధరత్వము, సేనానాయకులప్రభుభక్తి, రాజాదరణ, రాజపరిపాలనావిధానము మొదలగునవి యిందు సముచితముగ వర్ణింపఁబడియెను.

గజపతి తనతనయను రాయల కిచ్చెదనని వాగ్దానమొసఁగి యెవ్వరెన్ని చెప్పినను తిరుగ మరలకుండుట క్షత్రియధర్మమును సూచించుచుండెను. యదార్థశూన్యములు, ననర్థదాయకములు నగుదూరదృష్టిలేని దాసీభాషణంబులకు చెవినొగ్గినందులకు రుచిదేవిపడినకడగండ్లు పశ్చాత్తాపము మిగులవిచారకరములు. తిమ్మరుసుగూఢతంత్రము వలన రుచిదేవికిని దదీయప్రియజననికిని జరిగినయుత్తరప్రత్యుత్తరములు రుచిదేవికిగల పతిభక్తిని వెల్లడించుచున్నవి. రుచిదేవియొక్క సవతి యామెను రాయలతోఁగలుపుట మిక్కిలి యనురాగపూరకమును నీతిబోధకమునై ప్రశంసనీయముగ నున్నది.

---

## రవి, కాకినాడ 25-11-15.

పత్రిభాతము.

మాకార్యస్థానమునకుఁ బంపఁబడిన యీచక్రాని చారిత్రికనవల నందికొంటిమి. ఇందలి భాషాసౌష్టవము, వర్ణనాచమత్కృతి, రసపోషణము మున్నగునవి మనోహరముగనున్నవి. నవలను జదువఁ బ్రారంభించినవారు తుదముట్టువఱకు విడువరు. శైలి నాతి కఠినమై, హృదయంగమమై యున్నది స్వభావాద్యాలంకారములుగల తావు లత్యంతహృద్యములై యున్నవి. కావ్యలక్షణముఁబట్టి యుండవలసిన ప్రయాణాదివర్ణనములుఁ జాలవఱకు నిందుఁ గలవు. ఆంధ్రవాఙ్మయపోషకులును, కవిసార్వభౌములునగు శ్రీకృష్ణదేవరాయలవారి చరిత్రమే నవల కితివృత్తము. శ్రీ రాయలవారికిఁగల కవిజనాదరణము, రుచిదేవి సుగుణసంపత్తి, తిరుమలదేవి యౌదార్యము, మంత్రి తిమ్మరుసు రాజనీతివైశారద్యము, గజపతి సత్యవాక్యధౌరంధర్యము మొదలగునవి యథాపూర్వకముగ, మనోరంజకముగ వర్ణింపఁబడినవి. తత్కాలానుకూలముగ వర్ణింపఁబడిన భేదతంత్రము, సేవాధర్మము మొదలగునవియుఁ జక్కగ నుండె. పుస్తకపరిమాణము, కాగితము, అచ్చు మిగుల బాగుగనున్నది. గ్రంథమునకీయఁబడిన నామము మృచ్ఛకటికాదులందువలె నప్రధానాంశమును బట్టియే పెట్టఁబడినట్లు కాన్పించుచున్నది. ఆంధ్రభాషాభివృద్ధిఁ గోరి యిట్టి సర్వజనోపయోగగ్రంథరచనాప్రోత్సాహకులగు శ్రీరామవిలాసగ్రంథమాలాసంపాదకులయుద్యమ మెంతయు శ్లాఘనీయము. సర్వేశుఁడు సంపాదకులకు జిరాయురాదు లొసంగి గ్రంథమాలను నిరంతరమభివృద్ధిఁ జేయుఁగాత.

—— o ——

## ఆంధ్రపత్రికాశిక, మదరాసు 28-6-16. (శారదాకింకిణి.)

పత్రిభాతము.

ఇయ్యది యొక యాభూతమైనయాఖ్యాయిక. పీఠికాపుర శ్రీరామవిలాసగ్రంథమాలాద్వితీయకుసుమము. వంగూరి సుబ్బారాయవిరచితము. శ్రీచెలికాని లచ్చారాయ సంపాదితము. నవరససరసోల్బణం బనందగు నీయాఖ్యాయికయం దాంధ్రభోజుండని ప్రసిద్ధివడసిన శ్రీకృష్ణదేవరాయకల్యాణకథనం బతి సామర్థ్యముతో వర్ణింపఁబడియుండుటచే, జరిత్రాత్మకం బగుచున్నది. ఆఖ్యాయికలు పుక్కిటిపురాణములనేర్చి, జల్లిపదములతోఁ గల్లబొల్లివర్ణనలం గావించి నీరసము నింపుటకంటెఁ జరిత్రాత్మకకథాశేషములం జమత్కరించి, యానందముగ గ్రంథరచనం బొనరించుట

వలన, జనబాహుళ్యమునకు దేశాభిమానముం గలిగించువారు కాఁగలరని యభినందించుచున్నారము.

“శ్రీకృష్ణదేవరాయరాజ్యవైభవము, సంస్థానమర్యాదలు, రాయలకవితాదరణ, చిత్రలేఖనశక్తి, కాగితముల యుపయోగము, పరదేశీయుల ప్రసంగము, తిమ్మరుసుగారి రాజకీయకార్యనిర్వహణధురంధరత్వము, సేనానాయకుల ప్రభుభక్తి, రాజాదరణ, రాజపాలనము, యిత్యాదులు మనోహరలీల వర్ణింపఁబడియున్నవి.

గ్రంథశైలి మృదువై, మధురమై, ద్రాక్షాపాకమునంబడి, సరసజనమనోరంజకమై, యలరారుచున్నది. భాష పూర్ణముగ సలక్షణంబని వాకొనఁజాలముగాని, గ్రంథకర్త గ్రాంధికభాషాభిమానియనివాకొన వెనుదీయము. వెలమదొరల వంశమున జన్మముగాంచిన శ్రీచెలికాని లచ్చారాయసుధీమణివాక్స్ఫూర్తిపరిరంభణాయమాన హృదయుఁడై శ్రీరామవిలాసగ్రంథమాలా ప్రతిష్ఠాపకులై, భాషాసేవం జేయఁబూనుట శ్లాఘనీయము. ఈగ్రంథ మత్యంత మాదరపాత్రము. విశ్వవిద్యాలయమువారీగ్రంథముం బ్రవేశపరీక్షకో, ప్రథమశాస్త్రపరీక్షకో, పఠనీయగ్రంథముగ నేర్పరచి గ్రంథమాలవారికి గ్రంథకర్తకు బ్రోత్సాహ మొసంగుట ధర్మము. వెల 0—12—0

---

## ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. (సం౫. సం9. 10. 11.)

ప్రభాతము.

“ఇది యొకనూతనాఖ్యాయిక. దీనిని శ్రీచెలికాని లచ్చారావుగారు సంపాదకులుగానున్న శ్రీరామవిలాసగ్రంథమాలకై వంగూరి సుబ్బారావుగారు రచియించిరి. ఇది శ్రీకృష్ణదేవరాయల రాజ్యవైభవమును, దత్కాలమందలి సంస్థానమర్యాదలును దెల్పు చరిత్రాత్మక మగువచనము. భాష సర్వజన సాధారణముగా సులభశైలి నున్నది.”

---

## సుదర్శని. 15-9-16.

ప్రభాతము.

పిఠాపురంపోష్టు చిత్రాడ యందుగల శ్రీరామవిలాసగ్రంథమండలి వారిచేఁ బ్రకటింపఁబడినది. శ్రీ వంగూరి సుబ్బారావుగారిచే విరచింపఁబడినది. ఇందు శ్రీకృష్ణదేవరాయల చరిత్రము కొంత వ్రాయఁబడినది. రాయల యుదార గాంభీర్యము తిమ్మరుసు మహామేధ. తత్పరివారముయొక్క సముచితసంచారము, గజపతియొక్క సత్యానిరతి, అంతఃపురస్త్రీల యాభిజాత్యము, గజపతికొమార్తె రుచిదేవియొక్క నిష్కాపట్యచరిత్రము, తిరుమల యాలోకసామాన్యధర్మచింత ఇత్యాదు లిందు స్పష్టీ

స్థిరముగా చిత్రింపఁబడినవి మఱియు నలసాని పెద్దన, పింగళి సూరనాదుల ప్రస్తావన లందందు క్వాచిత్కముగా చేబడినవి. ఇందు రెండే విశేషములు చెప్పవలసియున్నవి. తాత్కాలిక నవలలో కొన్నిటియందువలె చదువరుల మనసులను సుడిద్రిప్పి నిర్ఘాంతపెట్టదగినంత యత్యద్భుతకల్పనలు లేవు— లేనిపోని వర్ణనలకును భాషావైదగ్ధ్యమునకును కథాకల్పనలకును బోయి యవి చక్కఁగ నిర్వహింపలేక వెంకాయ పిచ్చి కొండచేసి చదువుట కసహ్యము గలిగించు వెర్రివెర్రిపోకడలును లేవు—యథోచితమైనకల్పనయు బహుసులభభాషాశైలియు గలిగి యొప్పుచున్నది. స్త్రీసంఘములకు గూడ సులభముగా తెలియును— వెల 0—12—0

---

శ్రీకృష్ణదేవరాయుని వంశీయులగు ప్రస్తుత విజయనగర ప్రభువు లిట్లు వ్రాయుచున్నారు:—

RAJAH OF ANEGONDI. 30—10—15.

Dear sir. I very heartly thank you for the kind offer of your novel " Prabhatam " and am glad to let you know that it is very excellent,

Yours sincerely.
Sri Ranga Deva Rayalu.

---

Mr. A. Veerabhadra Rao. Telugu Pandit. Mahabnb college, Secunderabad, writes:—

.... ....The book is written in the most chaste and fascinating style. The graphic picture which it gives to us of the social, political and literary life in the days of the great Emperor Kistnadevaraya is peculiarls illuminative and the interest of the reader is fully maintained to the end of the book

---

వావిలికొలను సుబ్బారావుగారు ఆంధ్రపండితులు, ప్రెసిడెన్సి కాలేజి, మదరాసు, యిట్లు వ్రాయుచున్నారు :—

“తమ ప్రభాతము చదివినాను. శైలి రమ్యముగను, మృదువుగను, నిర్దుష్టముగా

నున్నది. చిత్తోద్రేకము మనోవికారము కలిగించు వర్ణనములు లేవు. కావున బాలురు బాలికలు నిశ్శంకముగఁ జదువవచ్చును. ... ... "

---

*Madras Mail* writes (28-2-17) (Telegu literature) The series of Telugu works issued under the title of the Sri Rama Vilas publications by (?) the Telugu Literature, Research committe of Pithapuram is being added to History, literature etc. One of the recent additions is a book entitled "Prabhatam or Dawn" (12 as) by Mr. V. Subba Rao. The period of History to which the plot of the story relates is that the of the days of Kistnadevaraya the Vizayanagar Emperor one of the greatest potrons of Telugu, during whose time flourished several of the most famous writers who have produced some of the classics in Telugu. The book is calculated to inspire love of Telugu and a desire to know more of the History of their past in the rising generation.



*Desamata* (A weekly of Rajahmundry (15-11-16) writes:—

"......ఇందు మంత్రియైన తిమ్మరుసు [illegible] [illegible]లయౌ దార్య శౌర్యసాహసములును చక్కఁగఁ జూపఁబడినవి. [illegible] వర్ణన లతి స్వాభావికముగను నుండి యాంధ్రదేశమందలి కుటుంబజీవనమును జక్కఁగ జిత్రించు (ఈ)రసభరితమైన నవల చదువఁ జదువ కుతూహల్యముగ నున్నది... ...

---

*Taylor High School Magazine* (Jan 1917) writes:—

"... ...ఆంగ్లభాషయందలి 'కలోనియల్', నవలలవలె 'ఫెదర[illegible]ట్', కాగితములపై ముద్రింపఁబడి మనోహరమగు కథాక్రమమును, స్త్రీలు, బాలురుగూడ జదివి యానందింపఁగల సులభశైలియు, నిర్దుష్టమును, రసవంతమునైన కవితామాధుర్య-ముకు గలిగి యీచిన్నగ్రంథము విరాజిల్లుచున్నయది. ... ... వ్రాయఁగ నటో యీగ్రంథము మొదటినుండి తుదవఱకు యీవిధముగనే రసవంతమైన కథా హాసమును గలిగి యున్నది. గ్రంథవిస్తరభీతిచే వ్రాయఁజాలకపోతిమి. వేయేల.